# కొసమెరుపు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## పట్టుబడిన పెద్దపులి

రచన: బి. రాజేశ్వరి

## ద్రోహి

రచన: టెంపోరావ్

## స్వర్ణ మయూరం

రచన: అజీజ్

## బట్టతల పొట్టిమనిషి

రచన: బొమ్మిడి అచ్చారావు

కళ్యాణదుర్గం - మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —122
ఫిబ్రవరి, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# పట్టుబడిన పెద్ద పులి!

బి. రాజేశ్వరి

"పులి, బాబోయ్ పెద్ద పులి ఊరిమీద పడింది!" జనం పరుగులు, ఉరుకులు పెడుతున్నారు. క్షణాలికలుగా చెదిరపోతున్నారు.

ఏడుపులు, ఆక్రందనలు, హాహాకారాలు ఒక్కసారిగా చెలరేగాయి.

లోపలకు పోయి యిళ్ళ తలుపులు బంధించుకునే వాళ్ళు, పరుగెత్తే తొందర్లో కిందపడి అరిచేవాళ్ళు, ఎదురుగా వచ్చేవాళ్ళను ఢీకొనేవాళ్ళు, కుక్కలు పరుగెత్తినా పులి వచ్చి తమమీద పడిపోయిందని ప్రాణ భయంతో కవ్వుమంటున్న వాళ్ళు-అంతా పెద్ద ప్రళయం విరుచుకు పడిపోయిన భ్రాంతి కలిగించే వాతావరణంతో నిండిపోయింది కృష్ణాపురం గ్రామం.

నిమిషాల్లో వీధు లన్నీ నిర్మానుష్యమైపోయాయి.

రాత్రి ఎనిమిది గంటలు కావటానికి కొద్ది నిమిషాలు మాత్రమే వుంది. ఈ సమయంలో పులివచ్చి ఊరిమీద

పడటం ఆ ఊరి ప్రజలకు చాల విడ్డూరంగాను, కొత్త గాను వుంది.

అక్కడికి దాదాపు ముప్ఫయి కిలోమీటర్ల దూరంలో ఫారెస్టు ఘాట్ రోడ్ వుంది. అక్కడకి అయిదు కిలోమీటర్ల దూరంలో అడవి వుంది. అయితే ఆ అడవిలో పెద్ద పులులు లేవు. అటవిశాఖవాళ్ళు స్వాధీనం చేసుకుని ఫారెస్టు రేంజి ఆఫీసు పెట్టి గార్డును, దాణేదారును ఇంకా తదితర సిబ్బందిని నియమించాక ఎన్నడూ క్రూరమృగం తమ ఊరిపై పడటం చూడలేదు.

అలాంటిది యిప్పుడు అకస్మాత్తుగా యీ పెద్ద పులి ఎక్కడ్నుంచి పుట్టుకొచ్చింది? ఊరిమీదపడి ఎవర్నయినా పొట్టన పెట్టుకుందా? ఏమో! బయటికి రావటానికి ఎవరికీ ధైర్యంలేదు. ఎవరిమటుకు వాళ్ళను ప్రాణభయం కాలు కదపనివ్వటంలేదు.

పులి ఏ క్షణంలో వచ్చి తమమీద పడ్తుందోనని ప్రతి ఒక్కరికీ భయం భయంగా వుంది! చీమ చిటుక్కుమన్నా ఉలిక్కిపడ్తున్నారు. పక్కన తమవాళ్ళున్నా భయంతో బిగుసుకు పోతున్నారు.

అయితే యిళ్ళకు చేరిపోయినవాళ్ళు ఎలాగో గండం నుంచి తప్పించుకోగలిగారు గాని, బయటికి వెళ్ళినవాళ్ళ సంగతేమిటి?

ఇదే ప్రశ్న వేధిస్తోంది సుమతిని. ఆమె భర్త చంద్రం బయటకు వెళ్ళినవాడింకా తిరిగిరాలేదు. పక్క ఊళ్ళో ఉద్యోగం చేస్తున్నాడు. ప్రతిరోజు ఉదయం ఎనిమిది గంటలకు పోయి రాత్రి ఎనిమిది దాటాక యింటికి చేర్తూండేవాడు.

కిటికీ ఊచలకు తల ఆన్చి నిర్మానుష్యంగా వున్న

వీధిలోకి పరీక్షగా చూస్తోంది, ఆత్రంగా గోడగడియారం వంక చూస్తోంది. ఎక్కడైనా పులి తిరుగుతున్న సూచన లున్నాయేమోనని చెవులు రిక్కించుకుని వింటోంది. అయిదు నిమిషాలు గడిచాయి.

సరిగ్గా అప్పుడే వినిపించింది-పులి గాండ్రింపు చాలా భయంకరంగా.

ఊరు ఊరంతా భయంతో బిగుసుకుపోయింది. తెరవబోయిన కొన్ని తలుపు లన్నీ టపటపా మళ్ళీ మూసుకున్నాయి.

దూరంగా ఎవరిదో ఆర్తనాదాలు—చావుకేకలు— పులి గర్జనతోబాటు గాల్లో కలిసిపోయాయి. వింటున్న కృష్ణాపురం ప్రజల గుండెలు అవిసిపోయాయి అవి విని! ఆ వెంటనే మరో రెండు నిమిషాలకి ఓ ఆవు హృదయ విదారకంగా అరిచింది.

ఎవరూ బయటకు రావటానికి సాహసించలేదు. ఏదో మారణహోమం జరిగిపోతోంది. అది అందరికీ తెలుస్తూనే వుంది. కాని ఎవరు? ఎవరు బలైపోతున్నారు?

సుమతిలాంటి యువతులు, బిడ్డల రాకకోసం ఎదురు చూస్తూన్న తల్లులు గుండెలు బద్దలవుతాయేమోనన్నంత టెన్షన్‌తో నిల్చుండిపోయారు శిలాప్రతిమల్లా? ప్రతి ఒక్కరు ఆ ఆర్తనాదాలు తమ వాళ్ళవి కాకూడదని వేయి దేవుళ్ళకి మొక్కుకుంటున్నారు. కాని ధైర్యం దిగజారిపోతూనే వుంది!

ఓ పదినిమిషాలు గడిచింది. ఎక్కడా మళ్ళీ ఎలాంటి కేకలూ వినపళ్ళేదు. పులి గాండ్రింపు కూడా వినపడ లేదు.

కాని ఎవరికీ బయటికొచ్చే ధైర్యం లేకపోయింది.

ఎవరికి వాళ్ళు తలుపులు బిగించుకుని వుండిపోయారు.

ఓ గంట గడిచింది. ఎక్కడినుంచీ ఎలాంటి చప్పుళ్లూ లేవు! పులి గర్జింపులుగాని, ఎక్కడా ఎలాంటి అలజడి గానీ లేవు!

ఇద్దరు యువకులు ఏదైతే అవుతుందని ధైర్యంగా తలుపులు తెరుచుకుని బయటికి వచ్చారు.

సర్పంచ్ యింకా కొందరు మగాళ్ళు ఒకరొకరుగా తలుపులు తెరుచుకుని బయటి కొచ్చారు.

పులిని బెదరగొట్టడానికి డప్పులు, వాయిద్యాలు రప్పించబడ్డాయి. కాగడాలు వెలిగించబడ్డాయి. వాయిద్యాలు మోగిస్తూ, కాగడాలు పట్టుకుని పెద్ద గుంపుగా బయల్దేరారు.

ఎక్కడా పులి కనిపించలేదు. అయితే, అది చేసిపోయిన బీభత్సం ప్రత్యక్షంగా కనిపించింది. అందరు నిశ్చేష్టులై నిల్చుండిపోయారు.

ఓ ఆవు, దూడ రక్తం మడుగులో పడున్నాయి. వాటికి పదిగజాల దూరంలో ఎవరో యువకుడు గుర్తు తెలీనివిధంగా పులిచేత చీల్చివేయబడి వున్నాడు.

పేవులు బయటికొచ్చేశాయి. కంఠంవద్ద పెద్ద పెద్ద గాయాలు. పులి పంజాతో చేయబడ్డ గాయాలు శరీరం మీద, ముఖంమీద కనిపిస్తున్నాయి.

"ఒరేయ్, యితను చంద్రం మేష్టారులా వుందే!" అన్నా డొకడు. చంద్రం సుమతి భర్త.

"అవును, అతనే! పక్క ఊళ్ళో చదువు చెపుతాడు. అతను రోజూ యిదే టయానికి తిరిగొస్తా వుంటాడు" అన్నా రెవరో.

"ఒరే, పాపం, పెళ్ళయి రెండేళ్ళుకూడా కాలేదు.

ఇంతలోనే పాపం ఆ ఆడకూతురు పసుపు కుంకుమ తుడుచుకుపోయిందే!” అన్నా రింకొకరు.

“ఇదుగో, మరో శవం! ఎవరో గుర్తు తెలీటంలేదు” కాగడాల వెలుర్లో దూరంగా బోర్లా పడున్న మరో శవం కనిపించింది. అతని గుడ్డలు చీలికలు వాలికలై పోయాయి. ఓ చెయ్యీ, కాలూ లేవు. పులి తినేసి నట్టుంది.

ఎవరికీ శవాన్ని బోర్లా వేయాలంటే ధైర్యం చాల్లేదు. చాలా బీభత్సంగా వుంది శవం! ఎవరో బోర్లా వున్న మనిషిని వెల్లకిలా తిప్పారు.

“అరే, గుమాస్తా జోగారావు! పదిమంది పిల్లలు ఇత నొక్కడి సంపాదనమీదే బతుకుతున్నారు. మాయదారి పులి పొట్టనెట్టుకుంది!” అన్నాడు ఓ ఆసామీ. జోగా రావు బస్తీలోని బట్టల షాపులో గుమస్తాగా పనిచేస్తు న్నాడు. రోజూ పది కిలోమీటర్లు నడిచివెళ్ళి నడిచి వస్తూంటాడు.

అందరికీ హృదయం ద్రవించుకుపోయింది.

మరి కా స్సదూరం నడిచివెళ్ళారంతే. ఇంకా ఎలాంటి ఘాతుకాలు కనిపిస్తాయోనని అందరు అదిరే గుండెల్తో వెతికారు. ఏం కనిపించలేదు.

ఆ పులి యెక్కడ్నుంచి వచ్చిందో తెలుసుకోవాలి ముందు! మనిషి రక్తం మాంసం రుచి మరిగిన పులి మళ్ళీ తప్పకుండా మర్నాడొస్తుంది. మనం దాన్ని రేపు ఎదు ర్కోవటానికి సిద్ధంగా వుండాలి!” సర్పంచ్ అందర్నీ ఉద్దేశించి అన్నాడు.

“నా దగ్గర లైసెన్సున్న రివాల్వరుంది. సర్పంచ్ గారి వద్ద గన్ వుంది. దాన్ని ఎదుర్కొని చంపటం పెద్ద

కష్టంకాదు!" అన్నాడు గురవయ్య, మోతుబరి.

"ఓ పులిని పట్టి చంపలేకపోతే అది మన ఊరికే అప్రతిష్ట? ధైర్యమున్న వాళ్ళు తెల్లారాక నాకొచ్చి చెప్పండి!" అన్నాడు సర్పంచ్.

## 2

"రాణీ, మీ వాళ్ళకు చెప్పావు కదూ!" అన్నాడతను.

రాణి అలవోకగా అతనివంక చూసింది. అర్ధనిమీలిత నేత్రాలు అతన్ని ఆరాధనగా చూస్తున్నాయి.

"ఊహు, చెప్పలేదు" అన్నది అల్లరిగా రాణి.

అతను అప్‌సెట్ అయినట్టు కనిపించాడు.

"అదేమిటి రాణీ, యీ రోజు ఎలాగైనా చెపుతానన్నావు కదా! మరి యింకా ఆలస్యం చెయ్యటం మంచిదంటావా?"

"పిచ్చి రాజా! ఎందుకంత తొందర?"

"ఏమిటా మాట?"

"సరే, నిజం చెప్పేస్తున్నాను. మా వాళ్ళతో నిన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పాను, వాళ్ళు యింతెత్తున నా మీద కెగిరారు. ఎట్టి పరిస్థితుల్లోను నీతో నా పెళ్ళికి ఒప్పుకో నన్నారు...."

రాజా లేచి నిటారుగా కూచున్నాడు.

"ఏమిటీ, మీ వాళ్లు ఒప్పుకో నన్నారా....?"

"అవును."

"అయితే మన పెళ్ళి....?"

"ఈ జన్మ కింతే!"

"రాణీ....!"

"నన్ను మరిచిపో రాజా....!"

"సువ్వేనా ఆ మాటంటున్నది?"

"దేవుడు మేలుచేస్తే వచ్చే జన్మలోనైనా భార్యాభర్తలం కావాలని కోరుకుంటున్నాను...."

"హు, లేని దేవుడి గురించి ఆలోచించేకన్న వున్న మనుషుల గురించి, వాళ్ళ భవిష్యత్తు గురించి ఆలోచించటం మంచిది కాదా...."

రాణి కిలకిల నవ్వింది.

రాజా విస్తుపోయి చూశాడా మెవంక. వాళ్ళిద్దరు పార్కులో ఓ మూల కూచుని వున్నారు.

"నిజమని నమ్మేశావు కదూ....?!" అంది రాణి.

"అయితే మీ వాళ్ళు ఒప్పుకున్నా రన్నమాట...."

"ఒప్పుకోలే దన్నమాట నిజం కాదు!"

"అబ్బ! డొంకతిరుగుడు దేనికి? వాళ్ళు అంగీకరించా రన్న విషయం ఎంత సస్పెన్స్‌లో వుంచావు డియర్!"

రాణి కిలకిలా నవ్వింది.

"స్ట్రెయిట్‌గా చెప్పేస్తే త్రిల్ ఉండదుగా! అందుకని...!"

"అబ్బ, నా మనసు యెంతగా నలిగిపోయిందో తెలుసా? కొద్ది నిమిషాలసేపు యీ లోకమే చీకటై పోయినట్టనిపించింది. ఆత్మహత్య చేసుకోవా లనిపించింది, తెలుసా?"

రాణి చటుక్కున అతని పెదాల్ని తన సున్నితమైన మునివేళ్ళతో మూసేసింది.

"అలాంటి మాటలు హాస్యానికూడా చెప్పకు రాజా! నేను విని భరించలేను!" అంది రాణి బాధగా.

అంతలో, ఎక్కడ్నుంచో పెద్ద పులి గర్జిస్తూ రాజా మీదికి ఎగిరి దూకింది. రాజా దాన్ని ఎదుర్కోనేలోపల

అది అతని కంఠం కొరికేసింది. రాణి ఆ దృశ్యం చూసి భయంతో వణుకుతూ పెద్దగా కేకలు పెట్టింది.

పార్కు వాచ్‌మాన్, పార్కులో వున్న జనం భయ భ్రాంతులతో నిశ్చేష్టులై య్యారు.

"పులి, పులి!" అంటూ అంతా చెదిరిపోయారు.

రాణి కదల్లేదు, మెదల్లేదు. ఆమె తన ప్రాణాలు పోయాయనే అనుకుంది! పులికి ఆహుతై పోవటానికే తను సిద్ధపడినట్టు స్థిరంగా అలాగే నించుంది.

కాని చిత్రంగా పులి రాజాను చంపేసి, ఒక్క సారిగా ఎటో పారిపోయింది.

రోడ్డుమీద జనం కకావికలుగా పరుగులు పెట్టారు— అప్పటికప్పుడు రోడ్ మీద ఓ జీపు ఏక్సిడెంటు, రెండు స్కూటర్ల ఏక్సిడెంటు జరిగిపోయాయి.

పులిని చూసి ఎవరికివారు ప్రాణభయంతో పరుగులు పెట్టారు.

క్షణాల్లో పులి ఎటో మాయమయిపోయింది.

రాణి ఒక్కసారిగా రాజామీద కుప్పలా కూలి పోయింది. క్షణాల్లో ఆమెకు స్పృహ తప్పింది. కానే పటికి జనం గుంపుగా చేరారు పార్కులో.

ఓ యువకుడు వాళ్ళ మధ్యనుంచి తోసుకుంటూ వచ్చాడు. రాణిని పైకి లేవతీశాడు. ఆమెకి స్పృహ రావటానికి శైత్యోపచారాలు చేశారందరు.

"అక్కా, అక్కా!" అని పిలుస్తున్నాడా యువ కుడు.

రాణి కళ్ళు తెరిచి చూసి "పులి, పులి!" అంటూ భయంగా అరిచింది.

"అక్కా, నేను శ్యాంని! పులి పారిపోయింది!"

అన్నాడా యువకుడు.

రాణి కళ్లు విప్పి రాజా శవాన్ని చూసి, ఒక్క కేక పెట్టింది. ఆమెకు మళ్ళీ స్పృహ తప్పింది.

## 3

"వారం రోజులైనా పులిని పట్టుకోలేక పోయారు ఎందుకండీ మీరింతమంది వుండి...!" చిరాగ్గా అన్నాడు సర్పంచ్.

కృష్ణాపురంలో కచేరి సావట్లో చాలామంది అధికార అనధికారులు సమావేశమై వున్నారు. అటవీ శాఖాధికారులు, పోలీసులు, సర్పంచ్, పంచాయితీ మెంబర్లు, మునసబు, కరణం మోతుబరి గురవయ్య యింకా పెద్ద రైతులు, ఊరి ప్రముఖులు అందరూ ఆ సమావేశంలో పాల్గొన్నారు.

"ఏం చెయ్యమంటారు? ఫారెస్టుకూడా బాగా వెరిఫై చేసివచ్చాం. ఎక్కడా పులిజాడ లేదు. అసలు అడవిలో తాము పులిని చూడలేదని మా ఫారెస్టరు, రాణేదారు, గార్డు చెప్పారు. అదీగాక మళ్ళీ ఆ పులి ఊరిమీదికి రాలేదు. వస్తే బంధించటానికి అన్ని ఏర్పాట్లు చేశాం!" అన్నాడు అటవీ శాఖాధికారి సంజాయిషీ యిచ్చుకుంటున్నట్టు.

"జనం ప్రాణాలు అరచేత పట్టుకుని దినదిన గండంగా బతుకుతున్నారు. నిన్న యిక్కడికి యిరవై మైళ్ళ దూరంలో వున్న జక్కులగూడెంలో ఓ మనిషిని చంపేసింది. మొన్న వేదగిరిలో ఓ యువకుడ్ని పొట్టన పెట్టుకుంది. ఇలా ఆ పులి రెచ్చిపోతుంటే జనానికి ధైర్యం రమ్మంటే ఎలా వస్తుంది?" గురవయ్య అన్నాడు.

"కృష్ణాపురం మళ్ళీ రాలేదుగదా? ఆ పులి ఎక్కడ

వుంటుందో అంతుబట్టడంలేదు. దాదాపు వారం రోజులు ఎక్కడ దాక్కుందో తెలీదు. అకస్మాత్తుగా వేదగిరిలో పార్కులో ఓ యువకుడిపై దాడిచేసింది. మర్నాడు— నిన్న —జక్కులగూడెంలో ఓ ముసలాయనను చంపింది. ఈ మూడు ఊళ్ళూ దాదాపు ముప్ఫయి కిలోమీటర్ల పరిధిలోనే వున్నాయి. ఫారెస్టుకూడా దాదాపు ఒక్కో ఊరికీ యిరవైనుంచి ముప్ఫయి కిలోమీటర్లలోపునే వుంది. అందుకే మేము ఫారెస్టులో బాగా కానే సెర్చ్ చేశాం. కాని పులిజాడ దొరకలేదు" పోలీస్ యిన్ స్పెక్టర్ చెప్పాడు.

"ఏది ఏమయినా ఈ పులి ఆగడాలు యిలాగే కొనసాగిపోతే జనానికి ప్రాణాలకు రక్షణలేదు! అది రాత్రిళ్ళు తన పనులు సాగిస్తోంది. పగలు యెక్కడ దాక్కుంటుందో అర్థంకాదు! మీరు సరిగ్గా వెతికి చేయలేదేమో! అడవిలోనే ఎక్కడో దాక్కుని వుండి వుంటుంది" సర్పంచ్ అన్నాడు.

"లేదండీ, అంతా వెతికించాం కదా! కొంతమందిని ప్రత్యేకం అడవిలో కాపలాకూడా పెట్టించాం. అయినా మీరిక భయపడాల్సిన అవసరం లేదు. వారం రోజులు దాటింది మీ ఊరిమీదపడి. మళ్ళీ రాలేదు. అంటే ఆ పులి అలా అలా ఒక్కో ఊరిమీదనుంచి ఎటో పారిపోతోంది. ఈ చుట్టుపట్ల వున్న ఊళ్ళన్నిటికీ హెచ్చరికలు పంపించాం. ఏమాత్రం వీలున్నా మా వాళ్ళు దాన్ని పట్టుకుండా వదలరు" అన్నాడు అటవీ శాఖాధికారి.

సర్పంచ్, గురవయ్యా. తక్కిన పెద్దలు ఆయన సమాధానంతో తృప్తిపడలేదు. వాళ్ళ చూపుల్లో తనమీద స్పష్టంగా కనిస్తున్న అనాదరణ, అసంతృప్తి అటవీ

శాఖాధికారి గమనించకపోలేదు.

కృష్ణాపురం సర్పంచ్ పొలిటికల్‌గా మంచి పలుకుబడి వున్నవాడు. అందుకని పెద్ద పెద్ద అధికారు లందరూ రంగంలోకి రావలసి వచ్చింది.

నిజానికి పులి మళ్ళీ కృష్ణాపురంలో కనిపించలేదు. ఎవరో ఒకరిద్దరు మళ్ళీ పులిని చూశామనీ, అయితే మంటల్ని చూసి పులి ఊళ్ళోకి రాలేదని, బయటి సుంచే పారిపోయిందనీ పుకారు పుట్టించారుగాని నిజానికి రెండోసారి పులి రాలేదు కృష్ణాపురం.

అయినా అధికారులు కృష్ణాపురంలో మకాం చెయ్యక తప్పలేదు. పులిని బంధించటానికి కావలసిన పూర్తి ఏర్పాట్లతో వచ్చారు.

## 4

"నువ్వలా ఏడుస్తూ కూచుంటే మాకెవరికీ అన్నాలు సయించటంలేదు. నా మాట విని కాస్త ఎంగిలిపడు తల్లీ!" రాణి తల్లి కూతుర్ని బుజ్జగిస్తోంది.

అప్పటికి రెండు రోజు లయింది పులి రాజాను చంపి. రాణి యీ రెండు రోజులుగా పచ్చి మంచినీళ్ళు ముట్ట లేదు. ఇంటిల్లపాదీ బతిమలాడినా ఆమెను దుఃఖసాగరం నించి మరల్చలేకపోయారు. అలా ఏడుస్తూ రాజాను తలుచుకుంటూ కుమిలిపోతోంది రాణి.

"నన్ను విసిగించకండి, వెళ్ళండి! రాజా లేకుండా నేను బతకలేను. రాజాతోబాటు ఆ పులి నన్నుకూడా చంపేస్తే బావుండేది. బతికుండీ క్షణ క్షణం చావమని వదిలేసింది...." రాణి కంఠం దుఃఖంతో పూడుకు పోయింది.

"రాజాను నువ్వెంతగా (ప్రేమించావో మాకు తెలుసు.

అందుకే అతనితో నీ పెళ్ళికి ఏర్పాటు కూడా చెయ్యబోయాం. కాని విధివ్రాతను మనం తప్పించలేం! అదేదో పెళ్ళికాకముందే జరిగిపోయింది కాబట్టి మనం అదృష్టవంతులం....”

తల్లి మాటలకు కోపంగా చూసిందామెవంక రాణి.

“అంటే పెళ్ళయ్యాక యిలా జరిగితే ఒకటి, పెళ్ళి కాకముందు జరిగితే ఒకటీనా? మా ఇద్దరికీ మానసికంగా ఎప్పుడో పెళ్ళయిపోయింది. అతనే నా భర్త! భౌతికంగా పెళ్ళికాకపోయుండవచ్చు, కానీ మనసారా నా రాజాయే నా భర్త. నేనిప్పుడు విధవరాల్ని. పోండి, మీరంతా నాముందునించి వెళ్ళిపోండి” మోకాళ్ళమధ్య తలదాచుకుని కుమిలి కుమిలి ఏడ్చింది రాణి.

రాణి తల్లి నెమ్మదిగా లేచి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

“అక్కా, నువు కోపగించుకోనంటే నేనోమాట చెప్పనా?” రాణి తల తిప్పి ఆ మాటలంటున్న శ్యాం వంక చూసింది.

“బావ యిక ఎలాగూ తిరిగిరాడు. అతని ఆశయాలకు ప్రతిరూపంగా నువ్వున్నావు. నువ్విలా ఆకలితో మాడి చావాలని, స్వర్గంలో వున్న బావ కోరుకోడు కదా! దయచేసి కాస్త ఎంగిలిపడు అక్కా!” శ్యాం అక్క పక్కనే కూచుని ప్రాధేయపడ్డాడు.

రాణి శ్యాంని పట్టుకుని ఏడ్చేసింది.

“ఆ పులి నిన్న రాత్రి జక్కుల గూడెంలో కూడా ఓ మనిషిని చంపేసిందట. ఈ రోజు పేపర్లో వచ్చింది. జక్కుల గూడెంనించి ఎవరో మనుషులు కబురు కూడా తెచ్చారు. అంతకు వారం రోజుల క్రితం కృష్ణాపురంలో

ఇద్దరు మనుషుల్ని, పశువుల్ని చంపినట్టు వారల్లో చదివాం. మనతోపాటు యింకా కొందరు దురదృష్ట వంతులు తమ వాళ్ళని పోగొట్టుకున్నారు. కృష్ణాపురంలో ఆటవీ శాఖవాళ్ళు పులికోసం తీవ్రంగా గాలిస్తూనట్టు తెలిసింది. దాన్ని ఎలాగైనా పట్టుకుంటారు. ప్రాణాలతో కాకపోయినా చంపయినా పట్టుకుంటారుగాని వదలరు" అనునయంగా అన్నాడు శ్యాం.

రాణిలో ప్రతీకార వాంఛ తలెత్తింది. "ఆ పులి బతికుండగూడదు. దాన్ని చంపెయ్యాలి! దాన్ని ప్రాణాలతో పట్టుకున్నారని తెలిసిన మరుక్షణం నేనే అక్కడికిపోయి దాన్ని చంపేస్తాను. నా రాజాను చంపిన పులిని నేను బతకనివ్వను" ఆవేశంగా పిడికిళ్ళు బిగించింది.

శ్యాంకి అంత దుఃఖంలోను నవ్వు వచ్చింది. ఆ రోజు రాజాను చంపిన పులి ఎదురుగా వున్నా అక్కడ చంప గలిగిందా? కాకపోతే అందరిలా భయపడి పారిపో కుండా ధైర్యంగా నిలబడింది.

అతికష్టంమీద ఆ పూట రాణిచేత నాలుగు మెతుకులు కతికించగలిగాడు శ్యాం.

## 5

"అక్కా, పులిని పట్టుకున్నారు. ఆటవి శాఖవాళ్ళు మాటువేసి పులిని పట్టుకున్నారట!" అన్నాడు శ్యాం మర్నాడుదయం రాణి వున్న గదిలోకి పరుగెత్తి.

రాణి మంచంమీద లేచికూచుని, "ఎప్పుడు? ఎక్కడ పట్టుకున్నారు?" అన్నది ఆవేశంగా.

"కృష్ణాపురంలో పట్టుకున్నారట. మొత్తాని కి సాధించారు. ఇప్పుడే కృష్ణాపురంనించే వచ్చిన మా

ఫ్రెండు చెప్పాడు!"

"అయితే మనం యిప్పుడే కృష్ణాపురం వెళ్ళాలి" అంది రాణి లేస్తూ.

శ్యాం తెల్లబోయి చూసి, "ఎందుకక్కా?" అన్నాడు.

"ఆ పులి మన శత్రువు. దాన్ని ప్రాణాలతో వదల కూడదు" అన్నది రాణి పళ్ళు బిగబట్టి.

"కాని అది అధికారుల అధీనంలో వుంది. దాన్ని చంపటానికి వాళ్ళు ఒప్పుకోరు సరికదా, మనం వెళ్ళే సరికి దాన్ని అక్కడ్నుంచి తీసుకుపోయి వుంటారు."

"ఎక్కడికి తీసుకుపోయినాసరే దాన్ని వదలకూడదు. నేను దాన్ని చంపి నా ప్రతీకార జ్వాలను చల్లార్చు కోవాలి!"

"అక్కా, ఎందుకనవసరంగా ఆవేశపడతావు? వాళ్ళు దాన్ని పట్టుకోకముందు ఎవరయినా చంపేసి వుంటే అది ఫరవాలేదుగాని, దాన్ని పట్టుకున్నాక ఎవరైనా చంపుతానంటే వూరుకుంటారా? అది పెద్ద నేరంగా పరిగణిస్తారు. అసలు మనకా అవకాశమే యివ్వరు!"

"ఇవ్వకపోతే మనం చేసుకుందాం. ఓ పిస్తోలు సంపా దించగలవా?"

శ్యాం తెల్లబోయాడు. "పిస్తోలా? నాకెలా దొరుకు తుంది?" అన్నాడు.

రాణి ఓ క్షణం ఆలోచించి, "అటవీ శాఖవాళ్ళ దగ్గర ఆయుధాలుంటాయి కదా! పోలీసులుకూడా వుంటా రక్కడ. పిస్తోలు దొరక్కపోదులే, వెళ్దాం పద!" అన్నది ఏదో నిర్ణయానికొచ్చినట్టు.

శ్యాం బతిమాలసాగాడు. "వద్దక్కా, నాకేదో

భయంగా వుంది. దాన్ని మనం ఏమీ చేయలేం__"

"శ్యాం, నా మాటకెదురు చెప్పకు! నువ్వొస్తావా సరే, లేకుంటే నే నొక్కర్తినే వెళ్ళగలను!" రాణి కంఠంలో ధ్వనించిన స్థిరత్వానికి చలించిపోయాడు శ్యాం.

"సరే అక్కా__. అమ్మకు చెప్పి వెళ్దామా?"

"ఎవరికీ చెప్పొద్దు. ఇప్పుడు కృష్ణాపురానికి బస్ వుందా?"

"ప్రతి గంటకూ బస్సు లున్నాయి."

"సరే, పద!" రాణి లేచి గబగబ దుస్తులు మార్చుకుంది.

ఓ పదినిమిషాల తర్వాత కృష్ణాపురం పోయే బస్‌లో వున్నారు రాణి, శ్యాం.

ఓ నలభై నిమిషాల ప్రయాణం తర్వాత ఘాట్ రోడ్ తగిలింది. చుట్టూ ఎత్తుగా పెరిగిన చెట్లు తలవిర బోసుకున్న దయ్యాల్లా వున్నాయి.

రాణి పరిసరాల్ని పరీక్షగా గమనించి చూస్తోంది.

వేదగిరికి, కృష్ణాపురానికి మధ్యగా వుంది అడవి. రాజాను చంపిన పులి దాదాపు యిరవై కిలోమీటర్లు ప్రయాణంచేసి యీ అడవిలోకి తప్పించుకు పారిపోయి వుంటుంది. అసలు అది ఈ అడవినుంచి వేదగిరికి ఆహారం కోసమే వచ్చిందా? వస్తే ఎవర్నయినా చంపి ఆహారాన్ని యింతదూరం తెచ్చుకోవటం దానికి సాధ్యమయే పనేనా?

రాణి మనసులో గజిబిజిగా ఎన్నో ఆలోచనలు.

ఆలోచనలమధ్య బస్సు కృష్ణాపురం చేరింది.

రాణీ, శ్యాం బస్ దిగారు.

ఊళ్ళో చాలా హడావిడిగా వుంది. ఊరి జనమంతా ఒకేచోట పోగుపడిపోయి వింత చూస్తున్నారు.

"ఇంకా పులిని బస్తీకి తీసుకుపోనట్టుంది. జనమంతా చూస్తున్నది పులినే అయుంటుంది!" శ్యాం అన్నాడు. రాణీ ముఖంలో రంగులు మారాయి.

"నేను చెప్పానుకదా, అది ఎక్కడికీ పోదని! నా ప్రతీకారం చెల్లించటానికే అదింకా ఇక్కడ వుంటుందని నాకు తెలుసు!" రాణీ గుంపువైపు అడుగులు వేస్తోంది.

"అయితే, అక్కా దాన్ని నువ్వు...."

"చంపితీరాను. అదుగో పోలీసులు కూడా వున్నారు. వాళ్ళెవరిదైనా పిస్తోలు లాక్కుని మరీ చంపేస్తాను."

శ్యాం భయంగా చూశాడు. "పోలీసులు వూరుకోరు. అటవీ శాఖవాళ్ళు, ఊరివాళ్ళు, పోలీసులు—యింత మందీ వూరికే చూస్తూ వుంటారా? నీ ప్రయత్నాన్ని సాగనివ్వరు. ఒకవేళ వీలుచూసుకుని నువ్వు దాన్ని కాల్చినా వాళ్ళు మనల్ని ప్రాణాలతో వదలరు. ఇద్దర్నీ పట్టుకుని జైల్లో పెట్టేసారు" అన్నాడు.

"శ్యాం, నువ్వు నాతో కలిసి రాకు. విడిగా వుండు. నన్ను పోలీసులు పట్టుకున్నా నువ్వు నా తమ్ముడివన్న సంగతిగాని, నాతో వచ్చిన సంగతిగాని ఎవరికీ తెలియకూడదు!"

"అక్కా...."

"ఏమీ మాట్లాడకు? వీలైనంతవరకు నేను పోలీసులకి దొరకననుకో. దొరకటం జరిగినా ప్రాణాలతో మాత్రం కాదు."

"అంటే...."

"అదంతే శ్యాం! నువ్వు నాకేమీ అడ్డు చెప్పకు."

"అక్కా, అయితే నువ్వు..." శ్యాం కళ్ళలో నీళ్ళు, దుఃఖం కట్టలు తెంచుకు నేలాగా వుంది.

"ఛీ, మగాడివి కంట తడిపెడతావా?" అంది రాణి.

శ్యాంలో పౌరుషం తలెత్తింది. కళ్ళు తుడుచుకుని, "పౌరుషంలోను, ప్రతీకారంలోను నేను నీకు తీసిపోనక్కా!" అన్నాడు గంభీరంగా.

రాణి చిన్నగా నవ్వి, "అదీ, అలా వుండాలి!" అన్నది.

ఇద్దరు గుంపును సమీపించారు. శ్యాం కొంతదూరంగా అక్కను అనుసరిస్తున్నాడు.

## 6

అక్కడ ఓ బోనులో పులిని బంధించి వుంచారు.

ఊరు ఊరంతా విరగబడి చూస్తోంది పులిని. తన భర్తను పొట్టన పెట్టుకున్న ఆ పులిని సుమతి చూసిందో లేదో తెలీదు. తమ కుటుంబాని కాధారమైన మనిషిని చంపేసిన పులిని గుమాస్తా జోగారావు కుటుంబ సభ్యులు చూశారో లేదో తెలీదు. కాని, రాణి మాత్రం నిశ్చలంగా, సూటిగా, కసిగా, కోపంగా, ఉద్రేకంగా చూసింది పులివంక.

ఆమె కళ్ళు కాసేపు ఆశ్చర్యంతో పులిని చూసి శ్యాంవంక చూశాయి. శ్యాంకి ఆమె కళ్ళలోని ఆశ్చర్యం కొట్టొచ్చినట్టు కనిపించింది.

రాణికి చాలా సమీపంలోనే పోలీసు ఇన్‌స్పెక్టర్ వున్నాడు. అతని నడుముకి కట్టిన బెల్టుకున్న సాకెట్‌లో రివాల్వర్ వుంది సిద్ధంగా. ఇన్‌స్పెక్టర్‌కి అటు యిటు వున్న కానిస్టేబిల్స్ చేతుల్లో తుపాకు లున్నాయి. అవి

కూడా రాణికి అందుబాటులో వున్నాయి. ఏ క్షణంలో నైనా ఆమె ఏదో ఒక ఆయుధాన్ని చేజిక్కించుకుని పులిని కాల్చి చంపుతుందేమో ననుకున్నాడు శ్యాం.

కాని రాణి వున్న చోటునుంచి కదల్లేదు.

శ్యాం ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

రాణి జనం మధ్యనుంచి బయటికి వచ్చేసింది.

శ్యాం తనూ బయటికొచ్చి అక్కను అనుసరించాడు. అతనికి అక్క పరిస్థితి అర్థంకావటంలేదు. అంతదాకా ప్రతీకార వాంఛతో రగిలిపోయిన అక్క అవకాశం దొరికినా ఎందుకు పులిని కాల్చలేదు? భయపడిందా? మనసు మార్చుకుందా? కాల్చలేనని అధైర్య పడిందా?

"శ్యాం!" పిలిచింది రాణి.

శ్యాం అక్కను సమీపించాడు. రాణి శ్యాం చెయ్యి పట్టుకుని, "రాజాను చంపిన పులి యిదికాదు!" అన్నది చల్లగా.

శ్యాం తెల్లబోయాడు. "అదేమిటక్కా?" అని మాత్రం అనగలిగాడు.

"అవును శ్యాం! రాజాను చంపిన పులి పది పులుల మధ్య వున్నా గుర్తుపట్టగలను. అది దీనంత బలంగా లేదు. ఇంత ఎత్తుగా, పొగరుగా లేదు. దాని చర్మం దీని చర్మంలా నిగనిగలాడటంలేదు. దాని కళ్ళు దీని కళ్ళలా నిప్పులు రాల్చటంలేదు. ఏ విధంగా చూసినా దీనికి దానికీ ఎక్కడా పోలికేలేదు!" రాణి శాంతంగా చెపుతోంది.

"అయితే రాజాను చంపిన పులి...."

"ఖచ్చితంగా వేరొకటి! అదే యీపులైతే యీ

పాటికి దాన్ని చంపి నేను చచ్చి వుండేదాన్ని" గంభీరంగా అన్నది రాణి.

## 7

బస్‌లో తిరుగు ప్రయాణమయ్యారు అక్కాతమ్ముళ్ళు.

బస్‌లో యిద్దరి సంభాషణ ఆసక్తిదాయకంగా వినిపించి రాణి, శ్యాం చెవులొగ్గి వినసాగారు.

"ఈ అడవిలోనే కదూ పులిని పట్టుకున్నారు?"

"అవును. యీ అడవిలోనే వారం రోజులు ముప్పు తిప్పలు పెట్టి తర్వాత చిక్కిందట!"

"ఈ వారం రోజులు పులి యీ అడవిలోనే దాక్కొని వుందా?"

"ఆ విషయం యెవరికీ తెలీదు. ఆ పులి మరో రెండు చోట్ల ఓ రోజు తేడాలో ఇద్దరు మనుషుల్ని చంపి తిన్నదట."

"అలాగా, ఎక్కడ?"

"వేదగిరిలో ఒకతన్ని చంపిందట. జక్కులగూడెంలో ఓ ముసలాయన్ని చంపితిన్నదట!"

"వేదగిరిలోను జక్కుల గూడెంలోను చంపిందిగాని మనుషుల్ని తినలేదట!"

"కృష్ణాపురంలో తిన్నదా?"

"అక్కడ చంపినవారిని తింటుండగా గ్రామస్తులు బాజాలు వాయించి కాగడాలు చూపిస్తే పారిపోయిందట!"

"కాని యింకో విషయం తెలీదనుకుంటాను నిన్న ఈ పులిని పట్టేశారు కదా! నిన్న జక్కుల గూడెంలో మరో మనిషిని చంపిందట కదా, అదెలా జరిగింది?"

"ఏమిటి నువ్వనేది? జక్కుల గూడెంలో మరోసారి

పులి మనిషిని చంపిందా?"

"అవును. జక్కుల గూడెంలో వరుసగా రెండు రోజులు ఒక్కో మనిషిని చొప్పున చంపిందట. మరి నిన్న కృష్ణాపురంలో పట్టేశారుకదా పులిని! జక్కుల గూడెంలో ఎలా ప్రత్యక్షమయింది?"

"అయితే ముందు జక్కుల గూడెంలో మనిషిని చంపేసి ఆ తర్వాత అడవిలోకి పారిపోయిందేమో! ఆ తర్వాత అటవీ శాఖవాళ్ళు దాన్ని బంధించి వుండొచ్చు కదా!"

"అందు కవకాశంలేదు!"

"ఏం, అలా అంటావు?"

"కృష్ణాపురంలో పులిని చీకటిపడుతుండగానే అంటే ఏడు గంటల ప్రాంతంలో పట్టారట! కాని జక్కుల గూడెంలో రాత్రి పదిగంటల ప్రాంతాల పులి ఊరిమీద పడి మనిషిని చంపిందట."

"అయితే యిది మరొక పులి కావచ్చునంటావా?"

"ఖచ్చితంగా అంతే అయుండాలి!"

"లెంం చెప్పడంలో పొరపాటేమో! జక్కుల గూడెంలో చంపేసి అడవిలోకి ఏడు గంటలకు ముందే పారిపోయి వుండొచ్చు పులి. లేదా అటివీ శాఖవాళ్ళు ఏ పదిగంటల రాత్రో దాన్ని బంధించి వుండాలి!"

"అదేం కాదు. నే నిప్పుడు ఆ పులిని చూసే కదా వస్తున్నాను, కృష్ణాపురం నుంచి. ఖచ్చితంగా వాళ్ళు పోలీసులు మాట్లాడుకోవటం విన్నాను. సర్పంచ్, గురవయ్య వాళ్ళు మాట్లాడుకోవటం కూడా దగ్గరుండి విన్నాను. పులిని పట్టింది ఏడు గంటలకి ముందే!"

ఇంతలో ఆ యిద్దరి సంభాషణ వింటున్న మరో

కాయన కల్పించుకుని, "ఆయన చెప్పింది నిజమేనండీ. మాది జక్కుల గూడెమే! రాత్రి పదిగంటలకి మనిషిని చంపేసింది పులి. ఆ సంగతి కృష్ణాపురంలో వున్న అటవీ శాఖవాళ్ళకు, పోలీసులకు తెలియచేయటానికి మా సర్పంచ్ కృష్ణాపురం వెళ్ళారు. ప్రస్తుతం అక్కడ వాళ్ళతో ఆ సంగతే మాట్లాడుతున్నారు.

మొదటి వ్యక్తి రెండో వ్యక్తివంక చూసి, "నువ్వు చెప్పింది కరెక్టే! అయితే రెండు పులులున్నమాట నిజమే నన్నమాట! అయితే మన వేదగిరిలో మనిషిని చంపిన పులి, జక్కుల గూడెంలో పులీ ఒకటే అయ్యుంటుంది. కృష్ణాపురం పులి వేరే అయ్యుంటుంది!" అన్నాడు.

వింటున్న రాణి, శ్యాం ఉలిక్కిపడినట్టు చూశారు.

బస్ వేదగిరిలో ఆగింది.

అంతవరకు మాట్లాడుకున్న వ్యక్తులిద్దరు ముందు దిగి పోయారు. వాళ్ళ వెనక రాణి, శ్యాం కూడా బస్ దిగారు.

"ఇంతదాకా యెక్కడికి పోయార్రా, మీకోసం ఊరంతా వెతికిస్తున్నాము. ఏమయిపోయారో, ఎక్కడికి వెళ్ళారోనని హడలిపోతున్నాం!" అన్నది రాణి తల్లి రాణిని, శ్యాంని చూసి, గుండెలు చల్లబడగా.

"అనుకోకుండా ఓ స్నేహితురాలు వచ్చి తీసుకు పోయిందమ్మా! అది యీ రోజు తన భర్తతో వెళ్ళిపో తోంది! బస్టాండువరకు వెళ్ళి దాన్ని సాగనంపి వచ్చాను. తోడుకోసమని మన శ్యాంని తీసుకు వెళ్ళాను" అన్నది రాణి.

"ఇలా యింకెప్పుడూ చెప్పకుండా వెళ్ళకమ్మా! అసలే పుట్టెడు విచారంలో వున్నావు. ఎలాంటి అఘా

యిత్యం తలపెట్టావోనని యింటిల్లిపాదిమీ హడలిపో తున్నాం. ఇదిగో రాణీ, నామీద ఒట్టువేసి చెప్పు— ఎలాంటి అఘాయిత్యమూ — తొందరపడి చేయనని!" రాణి తల్లి చెయ్యి చాపింది.

"నేనంత పిరికిదాన్ని కాదమ్మా! నీకు తెలుసు కదా. చాలా మొండిదాన్ని! ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన రాజా చచ్చిపోయినా నేను మాత్రం ఇంకా జీవచ్ఛవం లాగే మిగిలాను. ఎప్పటికీ యిలాగే మిగిలి వుంటాను" రాణి కళ్ళలోకి చివ్వున కన్నీళ్ళు ఉబికివచ్చాయి.

రాణి తల్లికి, శ్యాంకి కూడా కళ్ళు తడి అయ్యాయి.

రాణి గదిలోకి రాగానే "శ్యాం పాత పేపర్లన్నీ ఓసారి నాకు యిలా యివ్వు!" అన్నది.

శ్యాం పాత పేపర్లు తెచ్చి యిచ్చాడు. రాణి వారం రోజుల క్రితం నుంచీ అన్నీ వివరంగా చూసింది. కృష్ణా పురంలోని పులివాతపడిన వాళ్ళ వివరాలు చదివింది. అందులో తనకు కావలసిన అంశమేదీ కనిపించలేదు. వేదగిరి సంఘటన కూడా చదివింది.

"శ్యాం, జక్కుల గూడెంలో జరిగిన సంఘటనలు ఏవీ పేపర్లో రానట్టుందే యింకా!" అన్నది.

శ్యాం వెంటనే, "మొన్న రాత్రి సంఘటన యీ రోజు పేపర్లో వచ్చిందక్కా. నిన్న జరిగిన సంఘటన రేపటి పేపర్లో వస్తుందేమో! కృష్ణాపురంలో పులిని బంధించిన విషయం కూడా యీ రోజు పేపర్లో రాలే దింకా!....ఇదుగో, యివాల్టి పేపరు" అంటూ ఓ పేప రందించాడు.

రాణి వివరాలు చదువుతుండగా ఆమె ముఖంలో వేగంగా రంగులు మారాయి. ఏదో మనిష్కంలో

మెరుపులా మెరిసింది. శ్యాం అక్క ముఖంలంకే చూస్తు న్నాడు. రాణి పేపరు మడిచి పక్కన పెట్టి ఆలోచనలో పడింది.

అప్పటికి చీకటిపడి ఎంతో సేపు పట్టలేదు.

## 8

"హల్లో రాణీ, నువ్వా? ఎంతటి సుదినం!" అన్నాడతను తల కొద్దిగా వంచి అభివాదం చేస్తున్న ధోరణిలో.

"నీ కళ్ళు చల్లబడ్డాయా? రాజాను పొట్టన పెట్టుకున్నావు. జగన్నాధంగార్ని చంపేశావు. ఇప్పుడు ఆనందంగా వున్నావనుకుంటాను" అన్నది రాణి సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ.

అతను ఖంగుతిన్నట్టు చూశాడు.

"ఏమిటి నువ్వనేది? రాజాను, జగన్నాధంగార్ని నేను చంపట మేమిటి? వాళ్ళిద్దర్నీ పులి చంపింది. నేను పులి వేషం వేసుకున్నాననుకున్నావా, లేక పులి మా యింటి పెంపుడు జంతువనుకున్నావా?" వికటంగా నవ్వాడు.

"నువ్వు తలుచుకుంటే ఏమైనా చెయ్యగలవని నాకు తెలుసు. నువ్వు పులికంటె క్రూరమృగానివని నాకు బాగా తెలుసు. నీకు తప్ప మరొకరికి రాజాను చంపాల్సిన అవసరంలేదు. జగన్నాధంగార్ని కూడా నువ్వే చంపి వుంటావు!"

"నీ ఊహాగానాలు కట్టిపెట్టు! రాజాని పులి చంపగా జనం కళ్ళారా చూశారు. పక్కనే నువ్వు కూడా వున్నావటగా. యిక నేను వేరే చెప్పాల్సిందేముంది? నువ్వు చూడకపోయివుంటే, నేనే రాజాను హత్య చేశానని ప్రచారం చేసి, నన్ను పోలీసులకి అప్పగించేదానివేమో!"

వ్యంగ్యం ధ్వనించిందతని కంఠంలో.

"నువ్వు స్వయంగా చంపనక్కర్లేదు. చంపించావు. ఎలా చంపించావో నాకు తెలీదుగాని రాజాను, జగన్నాథంగార్ని నువ్వే కక్షకట్టి చంపించావు. అది మాత్రం నిజం!"

"రాజా నిన్ను ప్రేమించి పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. కాని ఒకప్పుడు నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటానని మాటిచ్చావు. రాజా కనిపించగానే నామీది ప్రేమంతా ఎక్కడ ఎగిరిపోయిందో, వాడివెంటబడ్డావు. అయినా నేను సహించాను. కాని వాడిముందు ఒకసారి నన్ను తీవ్రంగా అవమానించావు. నాకు కక్ష అంటూ వుంటే అది నీమీదేగాని, రాజామీద కాదు. ఇప్పటికైనా నమ్ముతావా నేను రాజాని చంపలేదని!"

"నమ్మనుగాక నమ్మను! నిన్ను నేనెప్పుడు ప్రేమించాను? నువ్వే అనుక్షణం నన్ను వెంబడించి వేధించి, నిన్ను ప్రేమించానని చెప్పకపోతే ఛస్తాననీ, చచ్చేముందు నీ చావుకి నేనే కారణమని అందరికీ ఉత్తరాలు రాస్తాననీ నన్ను బెదిరించి, నిన్ను పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకోనంటే నన్ను నాశనం చేస్తానని, పదిమందిలోను నేను చెడిపోయిన ఆడదాన్నని ప్రచారంచేసి నన్నికయెన్నడూ జన్మలో తలెత్తుకోకుండా చేస్తాననీ—ఎన్నో రకాల బెదిరించావు. నీ బాధ పడలేక నిన్ను ప్రేమించినట్టు నటించాను. అది కేవలం నటన! నేను మొదట్నుంచీ మనసావాచా రాజానే కోరుకున్నాను. అతన్నే పెళ్ళి చేసుకోవాలనుకున్నాను.

"కాని నువ్వు హద్దు మీరావు. అతనితో నేను మాట్లాడుతున్న సమయంలో నన్ను పట్టుకుని అల్లరిచేయ

బోయావు. అసభ్యంగా ప్రవర్తించావు. అందుకే రాజా చూస్తూండగానే నీ ముఖాన ఉమ్మాను. నీ చెంప పగల కొట్టాను—నా అసహ్యం అలా వెళ్ళగక్కాను. అది నా తప్పుకాదు. నీ పొగరే, నీకా శిక్ష విధించేలా చేసింది. అందుకు రాజామీద కక్ష కట్టావు" ఆవేశంతో రెండు క్షణాలు ఆగింది రాణి.

"రాజామీద కక్ష కట్టాల్సిన పని నాకేముంది? నేను చంపాలనుకుంటే నిన్ను చంపుతాను గాని, అతన్ని చంపను కదా!"

"రాజాయే నా జీవిత సర్వస్వమని, అతను లేకుండా నేను బతకలేననీ నీకు తెలుసు. అందుకే అతన్ని చంపేస్తే నేను జీవచ్ఛవంలా మిగిలిపోతానని ఆ విధంగా కక్ష తీర్చుకోవచ్చుననీ ప్లాన్ చేశావు. నేను చావనైనా ఛస్తాను గాని నీలాంటి నరరూప రాక్షసుడికి ఎన్నడూ లొంగను. అది గుర్తుంచుకో!"

అతను వికటంగా నవ్వాడు. "ఊఁ, సరే జగన్నాథం పట్ల నాకెందుకు కక్ష? అతన్నెందుకు చంపుతాను?" అన్నాడు క్రూరంగా రాణివంక చూస్తూ.

"జగన్నాథంగారికి తరువాతి వారసుడివి నువ్వే కాబట్టి! నువ్వు ఆయనకు మేనల్లుడివి కాబట్టి. ఆయన కూతుర్ని పెళ్ళిచేసుకోవాలని మాస్టర్ ప్లాన్ వేశావు కాబట్టి! నీ ఆటలు ఆయన దగ్గర సాగివుండవ్. అందుకే ఆయన్ని కూడా చంపించావు. ఆసలు ఆయన్ను చంపటం వల్లే నా అనుమానం నీ పైకి మళ్ళింది. మిస్టర్ చలపతీ, నీ మోసాలు, హత్యాకాండలు బయటపడే రోజొచ్చింది. తొందరపడకు. ఇంతకింతా అనుభవిస్తావ్!" అన్నది రాణి ఆడపులిలా.

చలపతి వికటంగా నవ్వాడు. "నీకు చాలా విషయాలు తెలుసే! అయితే నిన్న జక్కులగూడెంలో మరో ప్రాణి పులికి బలై పోయింది. ఆ విషయాలు నీకు తెలుసా?" అన్నాడు.

"తెలుసు. ఎవరో తెలీదుగాని, ఆ వ్యక్తికూడా నీ మృగత్వానికే బలై పోయుండాలి!"

"ఎవరో కాదు, నువ్వు యింతసేపు యెవరి తరఫున వకాల్తా పుచ్చుకుని వాదించావో ఆ జగన్నాథం కూతురే! నా మేనకోడలు లత! పాపం పులి చంపేసింది. వాళ్ళ నాన్నను చంపిన పులే. ఆ పులే నీ రాజాను కూడా చంపింది" నవ్వుతున్నాడు చలపతి.

"ఆ పులి నువ్వేనని నాకు తెలుసు! కృష్ణాపురంలో పులి నిజంగా ఆకలివేసి మనుషుల్ని పశువుల్ని చంపింది. కాని నువ్వు పగతీర్చుకోవటానికి, ఆస్తి దక్కించుకోవటానికీ, మూడు నిండు ప్రాణాల్ని బలి తీసుకున్నావు. ఆ పులికన్న నీ రక్తదాహమే నికృష్టమయినది! నువ్వు క్రూర మృగంకన్న కంద రెట్లు క్రూరమృగానివి! నీకన్న ఆ పులే నయం!"

"తెల్సుకున్నావు కదా! ఇప్పటికైనా నా మాటవిని నా దానివి కా! ఇప్పుడు నేను లక్షాధికారిని. ఓ విధంగా కోటీశ్వరుడ్ని. లత నా మాట వినుంటే నా భార్య స్థానంలో వుండాల్సింది. ఎదురుతిరిగింది. పాపం, పులి వూరుకుంటుందా, చంపేసి ఆ భార్య స్థానాన్ని నీకు రిజర్వు చేసింది."

"నా కంఠంలో ప్రాణముండగా అది జరగదని నీకూ తెలుసు. కాని నిన్ను ఉరికంబం ఎక్కించకుండా మాత్రం వదిలేది లేదు, అది గుర్తుంచుకో!"

చలపతి వికటంగా నవ్వి, "నేరాలు చేసింది నేనని నోరు చిత్తే గొట్టుకుని నువ్వు చెప్పుకున్నా ఎవరూ నిన్ను నీ మాటల్నీ నమ్మరు. పులి చంపేసిందని అందరికీ తెలుసు. నువ్వు పిచ్చిదానివని నీ అంతట నువ్వు చాటుకోవటమే అవుతుంది, గుర్తుంచుకో!" అన్నాడు.

"అన్ని రోజులు నీవి కాదు, ఆ మాట నువ్వు గుర్తుంచుకో!" గిరుక్కున తిరగబోయింది.

చలపతి మళ్ళీ నవ్వాడు. "ఇరవై నాలుగ్గంటలు టైమిస్తున్నాను. ఈలోపల నువ్వు నీ అంతట నువ్వు నా దగ్గరకొచ్చి లొంగిపోయినా సరే, లేకపోతే యిరవై అయిదోగంట రాకుండా నీ కుటుంబ సభ్యులంతా పులికి ఆహారమైపోతారు. నేను చేతలవాడినే గాని, మాటల వాడిని కాదు" అన్నాడు.

"రోజుకి యిరవై నాలుగ్గంటలే. ఇరవై అయిదోగంట నీ చావుతోనే మొదలవుతుంది!" అంది రాణి క్రోధంగా చూస్తూ.

"అంత పొగరుగా వుందా? అయితే నీ బతుక్కి చరమగీతం పాడేస్తానిప్పుడే!" ఒక్క అంగలో ఆమెనందుకున్నాడు.

అయితే రాణి ఊహించని వేగంతో అతని చెయ్యి కండ ఊడొచ్చేలా కొరికేసింది.

"అబ్బా!" అంటూ రక్తం కారుతున్న చేతిని ఎడమ చేత్తో అదిమిపట్టుకున్నాడు చలపతి.

మరుక్షణం సుడిగాలిలా బయటకి పరుగెత్తి రోడ్ చేరుకున్నది రాణి.

"ఒసేవ్ నీకు టైమివ్వటం, బతిమాలటం నేను చేసిన

పొరపాటు. ఈ రోజే మీ అందరికీ మంగళ హారతి పాడేస్తాను!" అరిచి చెప్పాడు చలపతి.

అయితే అతని మాటలు ఆమెకు చేరాయో లేదో గాని, అంతదాకా గుమ్మం పక్కనే పొంచి చూస్తూ అన్ని సంగతులు క్షుణ్ణంగా విన్న శ్యాంకి వినిపించాయి.

అక్కకి ఏదైనా ప్రమాదం జరిగితే చలపతిమీదపడి చంపేద్దామని సిద్ధంగా వున్నాడు. అక్క తనకు చెప్పకుండా బయటకి అర్జంటుగా వెళ్ళిపోవటం గమనించి, అంత రాత్రివేళ ఎందుకు వెళుతున్నదో ఎలాంటి అఘాయిత్యం చేసుందోనని, శ్యాం అక్కను వెంబడిస్తూ చలపతి యింటికి చేరుకున్నాడు. బయటకీ నీడలో నించుని అంతదాకా అక్కకూ చలపతికి మధ్య జరిగిన సంభాషణ పొల్లు పోకుండా విన్నాడు. అన్ని సంగతులు అతని కరతమయిపోయాయి.

చివర్లో చలపతి అక్క చెయ్యి పట్టుకోవటం చూసి ముందుకి ఉరకాలనుకున్నాడు. కాని యింతలోనే రాణి చలపతి చెయ్యి కొరికి బయటికి పరుగెత్తటం జరిగిపోయింది. అక్కకి కనిపించకుండా గుమ్మం పక్కకి ఒదిగి నించున్నాడు.

శ్యాం ఒకే ఒక్క క్షణం డైలమాలో పడ్డాడు—అటు అక్కను అనుసరించాలా, యిటు చలపతి ఏం చేస్తాడో చూడాలా అని! అక్క ధైర్యవంతురాలు. యెలాగైనా యింటికి చేరుకోగలదు. కాని చలపతి చివర్లో అన్నమాటలు యింకా శ్యాం చెవిలోనే మారుమోగుతున్నాయి. తన కుటుంబానికి కీడు తలపెట్టాడు చలపతి—ఎప్పుడో కాదు, ఈ రాత్రే!

# 9

చలపతి చకచక దుస్తులు మార్చుకున్నాడు. డ్రాయరు సొరుగుతీసి రివాల్వర్ తీసుకుని జేబులో వేసుకున్నాడు. అయిదు నిమిషాల్లో గారాజ్ లోనుంచి జీప్ ను బయటకు తీశాడు.

జీప్ వెనక ట్రయిలర్ ఎటాచ్ చేసివుంది. అది ఎందుకో శ్యాంకి అర్థంకాలేదు. తనే మాత్రం ఆలస్యం చేసినా చలపతి తనకి మళ్ళీ కనిపించకుండా వెళ్ళిపోతాడు. తర్వాత తన కుటుంబాన్ని సర్వ నాశనం చేసేస్తాడు. అందులో ఏమాత్రం అనుమానంలేదు!

జీప్ యింటి గేట్లోంచి వెళ్ళేముందు స్లో చేశాడు చలపతి. ఆ క్షణాన్ని సద్వినియోగం చేసుకున్నాడు శ్యాం. చప్పుడు కాకుండా ఒక్క గెంతులో ట్రయిలర్ లోనికి దుమికాడు.

ఇంజన్ హోరులో ఆ విషయం గుర్తించలేదు చలపతి! అతనికి అనుమానం రాలేదు.

జీప్ మహావేగంగా ఘాట్ రోడ్ వైపు దూసుకుపోయింది.

శ్యాం ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు. అది తమ యింటికిపోయే దారికాదు!

జీప్ ఊరు పొలిమేరలు దాటిపోయింది. అది జక్కుల గూడెం పోయే రోడ్డు!

జీప్ అడవిలోకి వెళుతున్నదేమోననుకున్నాడు శ్యాం. కాని అది సరాసరి రోడ్ నే పోతోంది.

జక్కుల గూడెం ఎనిమిది కిలోమీటర్లుందన్న మైలురాయి శ్యాంకి జీప్ హెడ్ లైట్సు వెలుగులో కనిపించింది. రోడ్ కి పక్కగా ఒత్తుగా పెరిగిన జీడి మామిడి

తోపు, దానికి అనుకుని చెట్లు విపరీతంగా పెరిగున్నాయి.

జీప్ రోడ్ దిగి ఆ తోపులోకి సునాయాసంగా వెళ్ళి పోతోంది.

జీప్ ఆపి దిగాడు చలపతి.

జీప్ స్లో అవుతుండగానే యిసకలోకి గెంతేశాడు శ్యాం. మెత్తటి యిసక, జీడి మామిడి తోటకు యిసక నేలలు శ్రేష్ఠమని తను చదువుకున్న పాఠాలు గుర్తొచ్చాయి శ్యాంకి.

జీప్ లైట్సు ఆన్‌లో వుంచి డ్రయివర్ సీటునుంచి దిగాడు చలపతి. వేగంగా ముందుకు నడిచాడు.

అక్కడ ఓ తాటాకు గుడిసె వుంది.

"రవూఫ్" అంటూ పిలిచాడు చలపతి.

నల్లగా దృఢంగా వున్న ఓ వ్యక్తి పరుగునవచ్చాడు.

"రెడీయా?" అనడిగాడు చలపతిని హిందీలో.

"నువ్వీ రోజు కూడా ఉండాలి. పని పూర్తయిన వెంటనే ఎంత రాత్రయినా నిన్ను మీ టెంట్‌లో వదిలి వస్తాను!" అన్నాడు చలపతి తనూ హిందీలోనే.

"రేపు సాయంత్రం సర్కస్ ప్రారంభమవుతుంది సార్. ఆ సమయానికి టైగర్‌తో నేను అక్కడికి చేరు కోకపోతే మా మేనేజర్ వూరుకోడు!"

"ఒక్క రోజుకి కొంపలేం మునగవులే! మీ మేనే జర్‌కి లక్ష రూపాయలిచ్చాను. నువ్వెప్పుడు వెళ్ళినా నోరు మెదపడు. మిగతా పులుల్తో 'షో' చూపించు కుంటాడులే. నువ్వేం వర్రీకాకు! ఇదిగో నీకిస్తానన్న లక్ష తెచ్చాను తీసుకో!" అని తనతో తెచ్చిన బ్రీఫ్‌కేసు అతనికిచ్చి "టైగర్ ఏం చేస్తుంది" అని అడిగాడు చలపతి.

"మీరేం పని చెప్తారా అని ఎదురుచూస్తోంది!" నవ్వుతూ అన్నాడు రవూఫ్.

"ఆల్ రైట్! నువ్వు వెంటనే వేదగిరి బయల్దేరాలి. ఇంటి వివరాలు చెప్తాను. ఒక్క అయిదు నిమిషాలు ఆ యింట్లో ఉన్న అందర్నీ టైగర్ చంపేసి మళ్ళీ జీప్ ఎక్కెయ్యాలి. ఓ.కే!?"

"అలాగే సార్! అయితే అందర్నీ ఖతంచెయ్యాలి కదా. ప్రత్యేకం ఏ మనిషినో టైగర్‌కి గుర్తుచెప్పాల్సిన పనిలేదు—అంతే కదూ!"

"అవును, అంతే! ఇదివరకటిలాగే చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ఇదివరలో వేదగిరిలో పార్కులో ఓ కుర్రాడ్ని టైగర్‌కి ఎరవేశావు చూడు! అప్పుడో పిల్లను చూశావుకదా పక్కన! వాళ్ళింటికే! ఆ పిల్లతోపాటు అందర్నీ చంపెయ్యాలి!"

"అదేమిటి సార్, ఆ పిల్లను తమరు....?"

"ఇంకేం మాట్లాడొద్దు. ఆ బంధం యీ పూటతో తెగిపోయింది. దాన్ని వదిలితే మనల్ని పోలీసులకి పట్టిచ్చేలా వుంది. అందుకే అందర్తోపాటు దాన్నికూడా ఖతం...."

"ఓ.కే.సార్! టైగర్‌ని తీసుకొస్తాను" అంటూ రవూఫ్ ఆ తాటాకుల పాకలోకి వెళ్ళాడు. అది తాత్కాలికంగా తాటాకుకమ్మలతో నేసిన పాక!

శ్యాం కళ్ళు చికిలించి ఆ వేపే చూస్తున్నాడు. లోపల ఏదో బోను తెరిచిన చప్పుడు, పులి గుర్రుమన్న శబ్దం వినిపించాయి శ్యాంకి. అంటే బోనులోనుంచి పులిని బయటకు తీసుకొస్తున్నారన్నమాట!

వాళ్ళిద్దరి మాటల్నిబట్టి శ్యాంకి ఆ పులిని ఏదో సర్కస్ కంపెనీనుంచి హెచ్చు మొత్తంలో డబ్బు యిచ్చి చలపతి అద్దెకు తెచ్చుకున్నాడని దాన్ని మచ్చిక చేసుకున్న రింగ్ మాష్టర్ రవూఫ్ అనీ, రవూఫ్ ఏం చెపితే అది ఆ పులి తు.చ. తప్పకుండా ఆచరిస్తుందనీ, ఎవర్ని చంపమంటే వాళ్ళని చంపేస్తుందనీ అర్థంచేసుకున్నాడు శ్యాం!

రవూఫ్ వెనక పెద్ద పులి మచ్చికచేసిన పిల్లిలా, కుక్కపిల్లలా నడిచి వచ్చేస్తోంది. శ్యాంకి దాన్ని చూడగానే గుండెలు దడదడలాడాయి. తనకాబోయే బావను చంపిన మహమ్మారిని, తన అక్క గుండెల్లో చిచ్చు రగిల్చిన మారణహోమాన్ని ప్రత్యేకంగా చూశాడు, శ్యాం!

కొద్ది నిమిషాల్లో తన కుటుంబాన్ని సర్వ నాశనం చెయ్యాలని వీళ్ళిద్దరు కృతనిశ్చయంతో ఉన్నారు. తన వాళ్ళు పోయాక తను బతికి ప్రయోజనంలేదు! వాళ్ళని రక్షించే కార్యక్రమంలో తన ప్రాణంపోయినా ఫరవా లేదు. తనవాళ్ళని రక్షించుకోవటంతోబాటు, వాళ్ళని చట్టానికి అప్పగించాలి.

ఎలా? ఎలా?

రవూఫ్ పులితో ట్రయిలర్ లోపల కూచున్నాడు. పైనుంచి టార్పలిన్ కప్పేశాడు చలపతి. యెవరైనా చూసినాకూడా అందులో ఓ క్రూరమృగం దాగి వున్న సంగతి కనీసం ఊహించనైనాలేరు!

జీవ్ బయల్దేరటానికి సిద్ధంగా వుంది.

తను అంతదాకా ట్రయిలర్ లోపల కూచుని ప్రయాణంచేశాడు. ఇప్పుడు దాంట్లో పులితోకూడ రవూఫ్

ప్రయాణం చేస్తున్నాడు. తను శివ తో ఫాలో అయ్యే అవకాశం లేదిక!

ఇంకొద్ది క్షణాల్లో వాళ్ళు అక్కడ్నుంచి వెళ్ళి పోతారు.

ఎలా? ఎలా?

శ్యాం మెదడులో మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

చెట్ల చాటునుంచి బయటికొచ్చాడు. కింద చకచక నాలుగు రాళ్ళు ఏరుకున్నాడు. మళ్ళీ చెట్ల వెనక్కి వెళ్ళిపోయాడు.

తాటాకు పాకమీదికి ఓ రాయి విసిరాడు.

దబ్బున చప్పుడయింది.

శివ్ స్టార్టు చేయబోతున్న చలపతి చివ్వున అటు తలతిప్పి చూశాడు.

పాకపై మరో రాయి చప్పుడు చేసింది.

చలపతికి అనుమానం బలపడింది. సీట్లోంచి దిగాడు. ఈ లోపల మరో రాయి పాకమీద పడింది.

చలపతి జేబులోనుంచి రివాల్వర్ తీశాడు. చేత్తో పట్టుకుని అడుగులు వేగంగా పాకవైపు వేశాడు.

ఆ కొద్ది సమయాన్ని తనకి అనుకూలంగా చేసుకున్నాడు శ్యాం.

జేబులోనుంచి చాకు తీశాడు. అది కూరలు తరుక్కునే చాకు! అక్కని అనుసరించి వచ్చేటప్పుడు ఆమెకేదైనా ప్రమాదం జరుగుతుందేమోననే అనుమానంతో అందుబాటులో ఉన్న ఆ చాకును జేబులో వేసుకుని చలపతి యింటికి అనుసరించి వచ్చాడు. అదిప్పుడు ఉపయోగపడింది.

చకచక శివ్ టైర్లు కోసేశాడు. తుస్సుమంటూ

జీప్ చక్రం యిసకని కరుచుకున్నది.

తృప్తిగా గాలి పీల్చుకుని మళ్ళీ చెట్ల గుబురులోకి పోయి దాక్కున్నాడు శ్యాం.

పాకవరకు పోయి అన్నీ సరిగానే ఉండటంతో తృప్తిపడి వెనుతిరిగి వచ్చాడు చలపతి.

టార్పాలిన్ కింద ముగ్గిపోతున్న రవూఫ్ ఆలస్యానికి కారణం వూహించలేక టార్పాలిన్ తప్పించి "ఏమయింది సాబ్?" అనడిగాడు చలపతిని, హిందీలోనే.

"కుఛ్ నై" అన్నాడు చలపతి.

జీప్ స్టార్టు చేశాడు.

చక్రాలు చర్రున చప్పుడు చేశాయేగాని యిసకలో కూరుకుపోయి కదల్లేదు.

"అరె, ఏమయింది?" అంటూ కిందికి దిగాడు చలపతి. టార్చి ఫోకస్ చేసి చూశాడు.

"అరె, చక్రాల్లో గాలి పోయిందే! రవూఫ్ ఇక్కడికెవరైనా వచ్చారా?" అనడిగాడు చలపతి.

రవూఫ్ టార్పాలిన్ తొలగించుకుని పైకి వచ్చి, "ఎవరూ రాలేదు సాబ్!" అన్నాడు ఆశ్చర్యంగా.

"దార్లో ఏవో కోసుగా వున్న రాళ్ళు టైర్లను కోసేసినట్టుంది! గాలి పూర్తిగా పోయింది. డామిట్, కథ అడ్డం తిరిగింది!" అన్నాడు చలపతి.

రవూఫ్ ఉస్సురని నిట్టూర్చి, "మరేం చెయ్యాలి సాబ్ యిప్పుడు?" అన్నాడు.

చలపతి అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చి, "మరేం ఫరవాలేదు. మా ఫ్రెండు జీప్ తీసుకుని ఓ గంటలో తిరిగొస్తాను. ఇప్పుడు పదికావస్తోంది. జక్కులగూడెం నుంచి కృష్ణాపురంపోయే లాస్టు బస్ వేదగిరిమీదుగానే

కదా పోయేది? ఈ జంక్షన్‌లో ఆగి దాన్ని కేచ్ చేస్తాను. ఓ అరగంటలో వేదగిరి చేర్తాను. మరో అర గంటలో జీప్ తీసుకుని వస్తాను” అన్నాడు.

“అయితే మీరొచ్చేదాకా టైగర్‌ని బోనులో దాచి పెడతాను!” అన్నాడు రవూఫ్.

చలపతి రివాల్వర్, టార్చ్ తీసుకుని రోడ్ వైపు చకచక అడుగులు వేస్తున్నాడు.

రవూఫ్ పులిని తీసుకుని పాకలోకి వెళ్ళిపోయాడు.

# 10

శ్యాం సర్వే చెట్ల వెనకనే చలపతికి అనుమానం కలక్కుండా అనుసరిస్తున్నాడు. చలపతి టార్చ్ వెలుర్లో చకచక రోడ్ వైపు వెళ్తున్నాడు. ఆ వెలుగు ఆధారం చేసుకుని శ్యాం నడుస్తున్నాడు. అతని గుండె కొట్టు కోవటం అతనికే స్పష్టంగా వినిపిస్తోంది.

ఓ గంటలో చలపతి అనుకున్నది సాధిస్తాడు. తను యీలోపల ఏదైనా చేయాలి.

చలపతి రోడ్ ఎక్కాడు. రోడ్ నిర్మానుష్యంగా వుంది.

శ్యాం రోడ్ మీదికి వెళ్ళే అవకాశంలేదు. జీడిమామిడి తోపులో వున్నంతసేపూ తను చలపతికి కనిపించే అవ కాశంలేదు. తోపు దాటితే దొరికిపోతాడు!

శ్యాంకి చక్కటి ఆలోచన వచ్చింది. ఈ సమయంలో చలపతి చెప్పిన బస్ తప్ప ఆ దారినపోయే వాహనాలు చాలా అరుదు! తన అదృష్టం బావుంటే తనకు ఏదైనా దొరుకుతుంది. లేకుంటే లేదు! ఆ బస్‌లో చలపతి వేదగిరి వెళ్ళిపోతే, యిక తనవాళ్ళని ఆ భగవంతుడు కూడా రక్షించలేడు!

శ్యాం తోపుకి అడ్డుపడి జక్కులగూడెంవైపు గబగబ పరుగెత్తుతున్నంత వేగంగా నడవసాగాడు. కాళ్ళకు ముళ్ళు గీరుకుపోతున్నాయి. రాళ్ళు తగిలి ముందుకు పడబోయి నిలదొక్కుకుంటూ, చిన్నచిన్న కంచెల్ని తప్పించుకుంటూ తోపులో అలా నడుస్తూనే వున్నాడు.

ఏ క్షణంలోనైనా బస్ వచ్చేస్తూంది!

అక్కడ రోడ్ మలుపు తిరుగుతుంది. ట్రైంజ్ కర్వ్!

అదే తనకు అనుకూలమైన స్థలం!

శ్యాం తోపులో నుంచి బయటికొచ్చాడు. రోడ్ ఎక్కాడు! అక్కడికి చలపతి కనిపించటంలేదు. చాలా దూరం నడిచాడు తను తోపులో పడి!

రోడ్‌కి పక్కగా నించున్నాడు శ్యాం!

దూరంగా హెడ్‌లైట్స్ వెలుగు కనిపించింది.

బస్ దగ్గరయ్యింది. రోడ్‌కి అడ్డుగా నించున్నాడు.

బస్ ఆగింది. కండక్టరు ఆశ్చర్యంగా చూశాడు. పాసింజర్లు అప్పుడే నిద్రమత్తులో జోగుతున్నారు.

శ్యాం చెప్పినది వినగానే కండక్టరు, డ్రయివర్‌తో పాసింజర్లంతా బిర్రబిగుసుకుపోయారు. బస్ ఆపేశాడు డ్రైవరు.

"ఏమిటి, నువ్వు చెప్పేది నిజమా?" అన్నాడు కండక్టర్.

"దయచేసి గట్టిగా గొడవ చేయకండి. మీకు ఆ హంతకుడ్ని యిప్పుడే చూపిస్తాను. అతని దుస్తుల్లో రివాల్వర్ వుంది, కావాలంటే వెరిఫై చేసుకోవచ్చు! ఈ పర్వే తోటలో పులి బోనులో సిద్ధంగా వుంది! మీరిప్పుడు అల్లరిచేస్తే ఆ హంతకుడూ దొరకడు, ఆ పులీ దొరకదు!" దీనంగా చెప్పాడు శ్యాం.

అందరి ముఖాల్లోనూ స్పష్టంగా అలజడి కనిపిస్తోంది. ఆ వస్రాడి మాటల్లో నిజాయితీ కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఈమధ్య జరిగిన పులి ఘాతుకాలు అందరికీ తెలుసు!

"సరే, బస్ ఆపు చేసి అందరం తోపులోకి వెళ్ళి చూద్దాం!" అన్నాడొకతను.

"మీరిప్పుడు తొందరపడితే వాళ్ళు చిక్కరు! ఆ వ్యక్తి రోడ్డు నే వున్నాడు. ఆ వ్యక్తి జేబులో రివాల్వరుందో, లేదో వెరిఫై చేసుకోండి! అతన్ని తిన్నగా పోలీస్ స్టేషన్‌లో అప్పగించండి! పులిని వాళ్ళే స్వాధీనం చేసుకుంటారు" అన్నాడు శ్యాం అందరికీ చేతులు జోడించి దీనంగా.

కండక్టరు వెంటనే, "సరే! నీ మాటల్లో నిజం ఇప్పుడే తేలిపోతుంది. ఆ వ్యక్తి దగ్గర రివాల్వర్ వుందో లేదో మేం వెరిఫై చూసుకుంటాం. ఉంటే సరాసరి పోలీస్ స్టేషన్‌లో అతన్ని అప్పగిస్తాం. లేకుంటే నిన్నప్పగిస్తాం!" అన్నాడు.

శ్యాం ముఖం వికసించింది. "అలాగే!" నేను వెనక సీట్లో కూచుంటాను.

డ్రయివర్ బస్ స్టార్టు చేశాడు.

చలపతి రోడ్ పక్కన చెయ్యి చాపి ఆపుతున్నాడు.

బస్ ఆగింది. చలపతి ఎక్కాడు. "బస్ బాగా లేటయినట్టుందే!" అన్నాడు కండక్టర్‌తో.

డ్రయివర్ బస్ స్టార్టుచేశాడు. ప్రయాణీకు లంతా టెన్షన్‌తో చూస్తున్నారు.

"వేదగిరి" అన్నాడు చలపతి కండక్టర్‌కి నోటు అందిస్తూ.

బస్ పదిగజాలు వెళ్ళగానే చప్పున నలుగురు ప్రయా

ణీకులు చలపతిమీదపడి పెడరెక్కలు విరిచి పట్టుకు న్నారు. అతని జేబులో రివాల్వర్ దొరికింది.

"ఏమిటి, ఏమిటీ దౌర్జన్యం?" అరిచాడు చలపతి.

"నోర్మూసుకుని కూచో! అన్నీ నీకే తెలుస్తాయి." అన్నారు ముక్త కంఠంతో ప్రయాణీకులు.

చలపతి అసహనంగా కదులుతున్నాడు. సీటుకి అదిమి పట్టేశారు ప్రయాణీకులు.

డ్రయివర్ మహావేగంగా బస్‌ని తోలున్నాడు.

వేదగిరి రాగానే సరాసరి పోలీస్ స్టేషన్‌కి తీసుకు పోయాడు బస్‌ని డ్రయివర్.

క్షణాలమీద రెండు పోలీసు వాహనాలు శ్యాంని యెక్కించుకుని స్పాట్‌కి దూసుకుపోయాయి. వెంట చలపతిని తీసుకుపోయారు. చలపతి శ్యాం వంక గుర్రుగా చూస్తున్నాడు. శ్యాం, రాణి తమ్ముడని అతనికి తెలుసు!

జీప్ శబ్దం విని రవూఫ్ వచ్చాడు బయటికి.

ఇన్‌స్పెక్టర్ గాల్లోకి రివాల్వర్ పేల్చాడు. ఒక్క సారిగా పోలీసులు ఆయుధాలతో రవూఫ్‌ని చుట్టేశారు.

రవూఫ్ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ ఆదేశంమీద పాకలో వున్న పులిని బోనుతోసహా తీసుకొచ్చి వేన్‌లో యెక్కించాడు— రవూఫ్. బోనును వేన్‌లో చేర్చటంలో పోలీసులు సాయ పడ్డారు.

శ్యాం విజయగర్వంతో చూశాడు చలపతి వంక.

చలపతి అవమానంతోను, ఉక్రోషంతోను బోనులో చిక్కిన పులిలాగా గుర్రుమన్నాడు.

వాహనాలు వేదగిరివైపు దూసుకుపోయాయి.

—:ఐ పో యిం ది:—

# ద్రోహి

టెంపోరావ్

హాల్లో ఫ్లోరోసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. పెద్ద సోఫాలో వనిత, గిరిజ పక్కపక్కనే కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

ఇద్దరూ కాలేజిలో బి. ఎ. ఫస్టియ్యర్ చదువుతున్నారు. ధనవంతుడి ఏకైక కుమార్తె వనిత. గిరిజ ఆమె ప్రాణ స్నేహితురాలు. పేదపిల్ల. ఆమె తండ్రి ఒక మార్వాడీ దగ్గర గుమస్తాగా పనిచేస్తున్నాడు. ఎనమండుగురు పిల్లల్లో గిరిజ పెద్దది.

హైస్కూలునించీ వాళ్ళిద్దరూ కలిసి చదువుకున్నారు. టెన్త్ స్టేండర్డు పాసవగానే గిరిజ చదువు మానేస్తానంది.

"ఎందుకు మానెయ్యాలి?" వనిత అడిగింది.

"మా నాన్న చదివించలేడు. ఎనమండుగురు పిల్లలం. నాన్నకొచ్చేది మా తిండికే చాలడంలేదు" అంది గిరిజ.

ఆమెవైపు నవ్వుతూ చూసింది వనిత.

"మా నాన్న చదివిస్తే చదువుకుంటావా?"

"ఆయన కెందుకా శ్రమ!" అంది గిరిజ.

"ఇందులో శ్రమ ఏముంది? నువ్వు లేకపోతే నాకు చదవ బుద్ధి కాదు. నువ్వూ చదవాలి" అంది వనిత.

కృతజ్ఞతతో ఆమె వనితవంక చూసింది. వనిత కోరినది తండ్రి వద్దనడు. వనితకు ఏం కావలసినా తండ్రి కొని యిస్తాడు.

"చదువుతానులే, నీకోసం!" అంది గిరిజ.

అప్పటినుంచీ వనిత తండ్రి గోపాలరావు సహాయం తోనే గిరిజ కాలేజీ చదువు సాగుతోంది.

వనిత టైమ్ చూసింది. ఏడు దాటింది.

"ఇంకా నాన్న రాలేదు!" అంది వనిత.

"ఆయన బిజీ యిండస్ట్రియలిస్టు, వనితా, డోంట్ ఫర్ గెట్!" అంది గిరిజ.

అప్పుడే కారొచ్చి పోర్టికోలో ఆగింది. కారు తలుపును సెక్రటరీ తెరిచాడు. ఆతడు కిందకు దిగాడు. నవ్వుతూ హుషారుగా హాల్లోకి నడిచి మొదట తన కూతుర్నీ, తర్వాత గిరిజనీ చూశాడు.

"హై బేబీస్ ఎలా వున్నారు?" అన్నాడతను.

వెళ్ళి వాళ్ళమధ్య కూర్చున్నాడతను. వనిత భుజం మీద చెయ్యివేసి, బుగ్గమీద ముద్దెట్టుకున్నాడు.

"ఆలస్యంగా వచ్చావు నాన్నా!" అందామె.

"పనమ్మా! తరగని పని!"

సెక్రటరీ వాళ్ళముందు కొచ్చాడు.

"ఈ పాకెట్లు మీ గదిలో పెట్టనా?" అడిగాడతను.

సెక్రటరీ మోహన్ యువకుడు, అదే భవనంలో కింద

నున్న ఒక గదిలో ఉంటున్నాడతను. అక్కడే భోజనం చేస్తూ ఉంటాడు. అందువలన ఎప్పుడు కావలసినా అతను గోపాలరావుకు అందుబాటులో వుంటాడు.

"మోహన్, అవి యిలా పట్రా!" అని గోపాలరావు కూతురివైపు తిరిగాడు.

"ఢిల్లీ నుంచి నీకు ఏం తెప్పించానో చూడు!" అన్నాడతను.

ఆమె తండ్రివైపు ఆత్రంగా చూసింది.

ఒక పాకెట్ తెరిచి మెరుస్తూన్న హేండ్ బాగ్ ను అతడు కూతురికి యిచ్చాడు.

"చాలా బాగుంది, నాన్నా. ఐ లైకిట్!" అంది నవ్వి.

"నీకు నచ్చుతుందని నాకు తెలుసు. అందుకే ఒక మిత్రుడిని తెచ్చిపెట్టమన్నాను."

ఆమె తండ్రికేసి చూసింది.

"గిరిజకో?" అందామె.

గోపాలరావు నవ్వుతూ మరో పాకెట్ తెరిచాడు. మరో హేండ్ బాగ్ ను గిరిజ కిచ్చాడు.

"చాలా బాగుంది, అంకుల్" అందామె.

అతడు సంతోషంగా యిద్దర్నీ గమనిస్తూ క్షణకాలం వుండిపోయాడు. తన కూతురికి ఏమిచ్చినా గిరిజకు కూడా యివ్వాలి. అంతవరకూ ఆమె ఆనందించదు! వాళ్ళిద్దరి స్నేహం ఏ నాటిదో! ఎన్ని జన్మలనుంచి సాగుతున్నదో!

"సార్, నేను నా గదికి పోవచ్చా?" అడిగాడు సెక్రటరీ.

"ఆల్ రైట్ వెళ్ళు! గుడ్ నైట్!" అన్నాడు గోపాలరావు.

వనత్ష తిరిగి వెళ్ళిపోతున్న అతడివైపు గోపాలరావు మౌనంగా చూశాడు.

గోపాలరావు సోఫాలోంచి లేచాడు.

"నేను ఇంటికి పోతాను" అంది గిరిజ లేస్తూ.

ఆమె చెయ్యి పట్టుకుని లాగి కూర్చోబెట్టింది వనిత.

"వెళ్ళి అక్కడ ఏం చేస్తావు? భోజనం చేశాక వెళ్దువుగాని" అంది వనిత.

"ఎవరో నన్ను దింపాలి!"

"గిరిజను వుండమను నాన్న. నేను కారులో వెళ్ళి దింపుతాను" అంది వనిత.

"ఉండమ్మా, గిరిజా! ఇద్దరూ మాట్లాడుకుంటూ వుండండి. నేను పైకి వెళ్ళి స్నానం చేస్తాను" అని అతడు మెట్లవైపు నడిచాడు.

విశాలమైన పడగ్గదిలోకి వెళ్ళాడు. గోడకు అమర్చిన లైఫ్‌సైజు ఆయిల్ పెయింటింగ్ వైపు చూస్తూ నిలబడి పోయాడు. పద్మ పట్టుచీరతో వుండి, మెళ్ళో నగలు మెరుస్తున్నాయి. ఆమె ప్రశాంతంగా నవ్వుతోంది.

"పద్మా! పద్మా!" అనుకుంటూ అతడు సోఫాలో కూర్చుని, పెయింటింగ్ వైపు చూస్తూ ఉండిపోయాడు.

ఆమె అతడి జీవితంలోంచి శాశ్వతంగా తొలగి పోయింది. పధ్నెనిమిదేళ్ళు దాటాయి. వనితను కని ఆమె కళ్ళు మూసింది. అప్పటినుంచీ వనితకు తల్లీ, తండ్రీ తనే!

అతడి మెదడులో ఏవో జ్ఞాపకాలు మెదులుతున్నాయి. ఆమెను ప్రేమించి అతడు పెళ్ళిచేసుకున్నాడు. ఆమె ధనవంతుల బిడ్డ కాదు.

ఒకనాటి రాత్రి జోరుగా వర్షం కురుస్తోంది. అతడు కారులో వెళుతున్నాడు. బస్టేండులో ఒంటరిగా ఒక

యువతి నిలబడివుంది. వర్షంలో ఆమె ధరించిన దుస్తులు బాగా తడిశాయి. కారు హెడ్ లైట్ల కాంతిలో నక్షత్రంలా మెరుస్తూన్న ఆమె మొహం అతడికి కనిపించింది. అతడు అమాంతంగా కారు ఆపాడు. కారులోంచి ఆమె వైపు చూశాడు.

"తడిసిపోతున్నారు. ఇలా కూర్చోండి" అన్నాడు కారు తలుపు తెర్చి.

ఆమె కారులో కూర్చోలేదు. అలాగే నిలబడింది. సీటుమీద జరిగి ఆమె వున్నవైపు అతడు దిగాడు. ఆమె ముందుకు వెళ్ళాడు.

"కారులో ఎక్కి కూర్చోండి, తడిసిపోతున్నారు" అన్నాడతను.

"మీరూ తడుస్తున్నారు!" అందామె.

"మీరు భయపడకండి. కాస్సేపు కార్లో కూర్చుంటే వాన తగ్గాక దిగిపోవచ్చు."

రోడ్డు లైటు కాంతిలో ఆమె అతడివైపు చూసింది. ఇంకా ఆమె సంశయిస్తోంది.

చటుక్కున ఆకాశంలో మెరుపు మెరిసింది. కాస్సేపట్లో భయంకరమైన ఉరుములు ధ్వనించాయి. అతడు కారువైపు కదిలాడు. ఆమె కారులో ఎక్కాక తలుపు మూశాడు. అటువైపుకు వెళ్ళి అతడు కారులో కూర్చుని తలుపు మూశాడు.

కారు అద్దాలన్నీ ఎత్తి వున్నాయి. ముందు అద్దంలోంచి చూస్తే ఏమీ కనపడ్డంలేదు. అతడు లోపలున్న ఫాన్ ఆన్ చేశాడు. కారు లోపల చల్లటిగాలి వీస్తోంది.

అతడు ఆమెవైపు తిరిగాడు.

"మీరు ఎక్కడి కెళ్ళాలి?"

"అమ్మకి జ్వరంగావుంది. డాక్టర్ కోసం వెళ్తున్నా" అందామె.

"మీ డాక్టర్ ఎక్కడున్నాడు?"

"మూసా స్ట్రీట్, నంబర్ 10."

"అక్కడకు తీసుకువెళ్ళనా?"

"మీకు శ్రమకల్పించడం నాకిష్టంలేదు."

"డోంట్ బాదర్" అని అతడు కారును పోనిచ్చాడు.

ఆమె మౌనంగా కూర్చుంది. పక్కనున్న వ్యక్తి ఎటువంటివాడో! తన్ని ఏం చేస్తాడో!

డాక్టర్ యింటిముందు అతడు కారాపాడు. ఆమె దిగి వేగంగా వెళ్ళిపోయింది. పది నిమిషాలు తర్వాత ఆమె తిరిగొచ్చింది. అతడు తలుపు తెరిచాడు.

"మీరింకా యిక్కడే వున్నారా?"

"ఎక్కండి. మీ యింటి దగ్గర దింపేస్తాను."

ఈసారి సంశయించకుండా ఆమె ఎక్కింది.

"మీ యిల్లు ఎక్కడ?"

"మీరు సాహేబ్ పేట, నాల్గో వీధి."

అతడు కారును పోనిచ్చాడు. వర్షం యింకా కురుస్తోంది.

"డాక్టరు ఏమన్నాడు?"

"రేపు ఇంటికొచ్చి చూస్తానన్నాడు. ఇప్పుడు యివ్వడానికి ఏవో మందులు రాసిచ్చాడు."

ఒక మందుల షాపుముందు కారాపి ఆమె చేతిలో ఉన్న చీటీ అతడు తీసుకున్నాడు.

"ఇది మీకెందుకు?" అడిగిందామె.

"మందులు కొనాలిగా" అని అతడు కారు దిగి వెళ్ళిపోయాడు.

కాన్వెంట్లో ఒక పాకెట్ తెచ్చి ఆమెకిచ్చి కారును పోనిచ్చాడు.

"నేను ఎంతివ్వాలి?"

"దిగాక యిద్దురుగాని."

ఆమె యింటిముందు కారు ఆగింది. అతడివైపు ఆమె కృతజ్ఞతతో చూసింది.

"లోపలకు రండి! అమ్మను చూడొచ్చు" అందామె.

ఆమె వెనకనే అతడు లోపలకు వెళ్ళాడు. అరవై ఏళ్ళ వృద్ధురాలు మంచంమీద పడుకుని మూలుగుతోంది.

"అమ్మా, వచ్చావా?"

ఈ వర్షంలో మొద్దయిపోయిన నన్ను ఈయన కాపాడారమ్మా. కారులో తీసుకొచ్చి ఇక్కడ దింపారు" అంది పద్మ.

తల్లి మంచం పక్కనే ఒక కుర్చీవేసి అతడిని కూర్చోమంది.

ఆ విధంగా ప్రారంభమైన పరిచయం ప్రేమగా మారింది. తండ్రితో చెప్పి అతడు పద్మను పెళ్లాడాడు. పద్మతో అతను ప్రపంచమంతా తిరిగివచ్చాడు. మూడేళ్ళ పాటు జీవితం ఆనందమయంగా సాగిపోయింది.

సీజరియన్ ఆపరేషన్ చేసి డాక్టరు బిడ్డను బయటకు తీసింది. కాని పద్మ కోలుకోలేదు.

పోతూ పోతూ ఆమె అన్న మాటలు అతడి హృదయంలో శాశ్వతంగా నిల్చిపోయాయి.

"నేను బతకను. బిడ్డకోసం, వాడికోసం మీరు మళ్ళా పెళ్ళిచేసుకోండి. చేసుకుంటారుగా!" అని అతడు జవాబిచ్చేలోపలే ఆమె మరణించింది.

అతడు మరో పెళ్ళి గురించి ఎప్పుడూ ఆలోచించ

లేదు. పద్మ యిచ్చిన బిడ్డను ప్రాణంగా చూసుకుంటూ, భార్య పేరునే స్మరిస్తూ అతడు జీవితాన్ని గడుపుతూ వచ్చాడు.

టెలిఫోన్ మ్రోగింది. తృళ్ళిపడ్తూ అతడు రిసీవర్ని ఎత్తాడు.

"నాన్నా, కిందనుంచి నేను. స్నానం చేశావా? వడ్డించమన్నాను. భోజనం చేద్దాం, కిందకు రా" అంది వనిత.

"వస్తున్నానమ్మా" అని అతడు రిసీవర్ పెట్టేశాడు. బట్టలు మార్చుకుని, మొహం కడుక్కుని అతను కిందకు వెళ్ళాడు.

## 2

గదిలో వెతుకుతూ కదులుతోంది గిరిజ.

"దేనికోసం అంతగా చూస్తున్నావు?" అడిగింది తల్లి గోదారమ్మ.

"నా కొత్త హేండ్ బాగ్ కనపడ్డంలేదు!" అంది గిరిజ.

"ఇంకెక్కడి హేండ్ బాగ్! ఆయన కంటబడింది. ఎత్తుకుపోయి, అమ్మేసి తాగేసి వుంటారు" అందామె.

గిరిజ తల్లివైపు చూసింది.

"ఈ కొంపలో బతకడం ఎలా అమ్మా? యెవరో యిచ్చిందికూడా నాన్న ఎత్తుకుపోతాడు" అంది గిరిజ విసుగ్గా.

"ఈ ఇంట్లో పుట్టడం నువ్వు చేసిన తప్పమ్మా" అంది తల్లి విచారవదనంతో.

తల్లివైపు దీనంగా చూసింది గిరిజ.

"అమ్మా, పుట్టుక, చావు మన చేతుల్లో లేవు. మనిషి

ఎక్కడో పుట్టాడు, మరెక్కడో చస్తాడు. అమ్మా, నేను చదువు ముగించి ఏదో ఉద్యోగం చేసి నీకు సహాయ పడ్తాను."

"నీ మాటకు సంతోషిస్తున్నాను" అంది తల్లి.

పుస్తకాలు తీసుకుని గిరిజ బయటకు నడిచింది. రోడ్డు మ్మట నడుస్తోంది.

తన తండ్రి గుమాస్తాగా పనిచేసే సేట్ గోకులదాస్ ఇంటిముందునుంచి వెళ్తోంది. అప్పుడే కారులో వెళ్తూన్న గోకులదాస్ ఆమెవైపు ఆత్రంగా చూశాడు.

"ఈ అమ్మాయిని ఎక్కడో చూసినట్టుంది!" అన్నాడు డ్రయివర్ తో.

"మన ఆఫీసులో పనిచేసే గంగరాజుగారి కూతు రండి" అన్నాడు డ్రయివర్.

కారు రోడ్డమ్మట దూసుకుపోయింది. గోకులదాస్ మెదడులో గిరిజ రూపం మెరుస్తూనే వుంది.

సాయంత్రం గంగరాజు ఇంటికి వెళ్ళబోతున్నాడు. గోకులదాస్ అతడిని పిల్చి తన గదిలోకి తీసుకెళ్ళాడు.

విశాలమైన గది. సోఫాలో కూర్చోమని గంగరాజుతో అన్నాడు. గదిలో లైటు వెలుగుతోంది. ఎదురుగా కూర్చు న్నాడు సేట్. ఒక పాకెట్ ను తెర్చి అందులోని విస్కీ బాటిల్ ను గంగరాజు కిచ్చాడు.

"ఇది నీకోసం! తృప్తిగా తాగు!"

"చాలా థాంక్స్ సేట్ జీ" అన్నాడు గంగరాజు.

పదిరూపాయలు అడ్వాన్స్ అడిగితే ఇవ్వని సేట్ ఖరీదైన విస్కీ బాటిల్ని తనకివ్వడం విచిత్రంగా అగు పించింది.

"గంగరాజూ, సంవత్సరం దాటింది నా భార్య చనిపోయి. నాకు పిల్లలులేరు. పది లక్షలుపైన నాకుంది ఆస్తి. కాని ఏం లాభం? నా తర్వాత నా ఆస్తికి వారసులు లేరు!" అన్నాడతను.

సేట్ లేచి గంగరాజుకు గ్లాసు, ఒక చెంబులో మంచినీళ్ళు యిచ్చాడు.

"తాగుతూ నేను చెప్పేది విను. అప్పుడు నీ బుర్రలోకి బాగా దిగుతుంది."

గంగరాజు బాటిల్ తెర్చి గ్లాసులో విస్కీ పోసి, నీళ్ళు కలిపాడు.

"మీకూ ఇవ్వనా?" ప్రశ్నించాడు.

"ఈ మత్తు ద్రవాలు నన్ను ఆకర్షించవు. నాకు కావల్సింది ఆల్కహాల్ కాదు.

గ్లాసులోని విస్కీని అతడు గడగడ తాగేశాడు.

"నీ పెద్దమ్మాయిని చూశాను. చాలా అందంగా వుంది. ఆమె పెళ్ళి గురించి ఆలోచించావా?"

మళ్ళా గ్లాసులో విస్కీ పోసుకుని, కొద్దిగా నీళ్ళు కలిపి అతడు తాగేశాడు. రెండు సిగరెట్ పాకెట్లను సేట్ అతడివైపు విసిరాడు.

"విస్కీ, సిగరెట్—మంచి జోడీ!" అని గంగరాజు సిగరెట్ వెలిగించాడు.

"నీ కూతురు పెళ్ళి విషయం చెప్పు."

"అది చదువుకుంటోంది, సార్."

"ఇంకా చదివితే ఆమె నీ మాట వినదు. ఆమెకు పెళ్ళిచేసేయడం మంచిది."

"పెళ్ళికి డబ్బు కావాలిగా!" అన్నాడు గంగరాజు.

"నేను సమకూరుస్తాను."

"పెళ్ళికొడుకు దొరకాలి గా?"

సేట్ విచిత్రంగా నవ్వాడు.

"పదిలక్షలు ఆస్తున్న నేను వున్నానుగా!"

మూడో గ్లాసు విస్కీ తాగేసిన గంగరాజుకి సేట్ మాటలు వెంటనే అర్థంకాలేదు.

"మీ సహాయం వున్నా, అబ్బాయికి అమ్మాయి నచ్చాలి!"

"నీ కూతురు నాకు నచ్చింది. నువ్వు సరే అంటే నేనామెను పెళ్ళాడ్తాను. నా వయసు నలభయ్యే. అటు పైన నీకు ఏ సమస్యలూ వుండవు. నీకు కావలసినన్ని బాటిల్సు నేను కొని యిస్తాను. మీ ఇంటికికూడా మాసం మాసం కొంత డబ్బు యిస్తాను. ఒకమ్మాయి పెళ్ళితో నీ జీవితం మారిపోతుంది. నీ కుటుంబం రూపం మారు తుంది. అంతకంటె నీకూ, నీ భార్యకూఏం కావాలి?"

"నా భార్యతో చెప్తాను."

"ఆడవాళ్ళను అడగడం పురుష లక్షణం కాదు. మనం చెప్పింది స్త్రీలు చెయ్యాలి."

"నా భార్య నేను చెప్పినట్లే చేస్తుంది, సార్" అన్నాడు గంగరాజు నిషాలో.

రాత్రి తొమ్మిదింటికి గంగరాజు యింటికి చేరు కున్నాడు. బాటిల్ని భద్రంగా అలమారులో దాచుకుని అతడు వంటగదిలోకి వెళ్ళాడు.

గిరిజ చదువుకుంటోంది. తతిమ్మా పిల్లలు నిద్రపో తున్నారు.

సేట్ చెప్పినదంతా అతడు భార్యతో చెప్పాడు.

"మంచి సంబంధం. పోతే రాదు. దమ్మిడీ ఖర్చు లేకుండా పెళ్ళయిపోతుంది" అన్నాడతను.

"అమ్మాయి ఒప్పుకోవాలిగా?" అంది అతడి భార్య.

"దాన్ని నే నడగను. ఈ పెళ్ళి అయితే మనందరి గతీ బాగుపడ్తుంది. మనకి అది ముఖ్యం. మనం సుఖంగా జీవిస్తాం."

"మీ యిష్టం" అందామె.

చదువు మాని గిరిజ వాళ్ళ మాటలు విన్నది. గాభరాగా వంటింట్లోకి వెళ్ళింది.

"నా పెళ్ళి విషయం మాట్లాడుతున్నట్లున్నారు!" అందామె.

"అప్పుడే శుభవార్త నీ చెవిన పడిందన్నమాట!" అన్నాడు గంగరాజు.

"ఇది అశుభవార్త! గోకులదాస్ లాంటి దూదిబస్తాని నేను పెళ్ళాడను.

"మాటిచ్చేశాను. పెళ్ళి చేసుకతీరాలి. నువ్వు యీ పెళ్ళికి ఒప్పుకోకపోతే నా ఉద్యోగం వూడుతుంది. ఈ ఇల్లు మనం ఖాళీచెయ్యాలి. అద్దె లేకుండా సేట్ మన్ని యీ ఇంట్లో వుండనిస్తున్నాడు" అన్నాడు తండ్రి.

"మీ సుఖంకోసం నన్ను బలిచేస్తారా?" అర్చిందామె.

"ఇది బలి కాదమ్మా. ఇంటిల్లిపాది నీ ఉద్ధరించిన దేవతగా నువ్వు అగుపిస్తావు" అంది తల్లి.

గిరిజ అక్కడనుంచి వెనక్కి తిరిగి వచ్చేసింది. తండ్రి బాగా తాగివున్నాడు. అతడితో ఎక్కువగా వాదిస్తే అరుస్తాడు. ఇరుగుపొరుగువాళ్ళు నవ్వుతారు.

గిరిజ పుస్తకాలను పక్కన పడేసి చాపమీద పడుకుంది. ఆలోచిస్తూ అలాగే వుండిపోయింది. ఈ పెళ్ళికి

తను ఒప్పుకోగూడదు! ఏదో చేసి తను తలిదండ్రుల అడ్డ క త్తెరలోంచి బయటపడాలి!

# 3

చీకటిపడ్తోంది. ఆ నాటి రాత్రి సేట్ గోకులదాస్ తండ్రితో యింటికొస్తాడు. యెక్కడికేనా పోవాలని ఆమె ఆలోచిస్తోంది.

కారు హారన్ విని ఆమె బయటకు వెళ్ళింది. గోపాలరావు మెర్సిడిస్ కారు ఆగివుంది. ఆమె కారు దగ్గరకు వెళ్ళి చూసింది. కారులో వనిత లేదు!

స్టీరింగ్ వీల్ వెనక గోపాలరావు వున్నాడు.

"ఎక్కమ్మా!" అన్నాడతను.

కారులో ఎక్కి ఆమె తలుపు మూసింది. అతడు కారును పోనిచ్చాడు.

"వద్దంటే వినకుండా వనిత మోపెడ్ మీద వెళ్ళి కిందపడింది. లక్కీ, కొద్దిగా దెబ్బలు తగిలాయి" అన్నాడతను.

"నా దగ్గర దాచకండి! బాగా దెబ్బలు తగిలేయా?" అడిగిందామె, కన్నీళ్ళతో.

"నువ్వే చూస్తావుగా!"

గూర్ఖా గేటు తెర్చాడు. మెర్సిడిస్ కారు లోపలకు వెళ్ళి పోర్టికోలో ఆగింది. ఇద్దరూ కిందకు దిగి, మెట్లెక్కి, పైకి వెళ్ళారు.

వనిత మోకాలుమీద, చేతిమీద కట్లు వున్నాయి. ఆమె బాగా నిద్రపోతోంది.

"నీకోసం వనత ఎన్నిసార్లో అడిగింది. డాక్టర్ ఇచ్చిన యింజక్షన్ మూలంగా ఆమె నిద్రపోయి వుంటుంది" అన్నాడు గోపాలరావు.

"పడుకోడం మంచిది" అంది గిరిజ.

అంతవరకూ అక్కడ కూర్చున్న మోహన్ వాళ్ళు రాగానే లేచి నుంచున్నాడు.

"మోహన్, అమ్మాయి ఏదేనా అడిగిందా?" గోపాలరావు అడిగాడు.

"గిరిజా! అని పిలుస్తూ నిద్రలోకి జారిపోయింది, సార్" అన్నాడు మోహన్.

వనిత పక్కనే కూర్చుంది గిరిజ. తండ్రి అక్కడే సోఫాలో కూర్చున్నాడు. మోహన్ కిందకు వెళ్ళిపోయాడు.

పదికావస్తోంది. వనిత యింకా లేవలేదు.

"మీరు వెళ్ళి భోజనం చేయండి, అంకుల్" అందామె.

"దెబ్బల బాధ తెలియకుండా వుండేందుకు డాక్టర్ యింజక్షన్ యిచ్చాడు. పడుకుని అది ఎప్పుడో లేస్తుంది. నువ్వూరా, భోజనం చేద్దాం" అన్నాడతను.

"అంకుల్, నే నిప్పుడు తినలేను. మీరు వెళ్ళండి"

గోపాలరావు కిందకు వెళ్ళాడు. భోజనం ముగించి హాల్లోకి వచ్చాడు. మోహన్ ఎదురయ్యాడు.

"సార్, ఏదేనా కావలిస్తే నాకు ఫోన్ చేసి చెప్పండి. ఎంత రాత్రయినా ఫరవాలేదు" అన్నాడు మోహన్.

గోపాలరావు అతడి చెయ్యి పట్టుకుని ఆప్యాయంగా నిమిరాడు.

"గుడ్ బాయ్!" అన్నాడు.

క్షణకాలం అతను మోహన్ వైపు చూస్తూ వుండిపోయాడు.

రెండేళ్ళ క్రితం తన కారుకు యాక్సిడెంట్ అయింది. అతను స్పృహతప్పి కారులోనుంచి కిందపడ్డాడు.

సైకిలుమీద పోతున్న మోహన్ అతడిని హాస్పిటల్ కు చేర్చి, యింటికి ఫోన్ చేసి వనితతో అంతా చెప్పాడు. కోలుకున్నాక గోపాలరావు అతడికి వెయ్యి రూపాయలు యివ్వబోయాడు.

"మీరిచ్చే డబ్బు కరిగిపోతుంది, సార్. నేను బి.ఏ. పాసయ్యాను. నాకేదేనా ఉద్యోగం యివ్వండి. సాయశక్తులా పని చేస్తాను" అన్నాడు మోహన్.

మోహన్ కి ఎవ్వరూ లేరు. అనాధాశ్రమంలో పెరిగి బి.ఏ. పాసయ్యాడు. అదంతా విని గోపాలరావు అతడిని తన సెక్రటరీగా వుండమన్నాడు.

"మోహన్, పదకొండు కావస్తోంది. వెళ్ళి పడుకో" అన్నాడు గోపాలరావు, మెల్లిగా లేస్తూ.

వనిత గాఢనిద్రలో వుంది. గిరిజ సోఫాలో పడుకుని ఏడుస్తోంది.

ఎదురుగా నిలబడి గిరిజవైపు అతను చూశాడు.

"ఎందుకమ్మా, అంతగా ఏడుస్తావు? వనితకు ఏమీ అవదు. మరి కొన్ని గంటల్లో ఆమె లేచికూర్చుని నీతో కబుర్లు చెప్తుంది."

"వనిత గురించికాదు, అంకుల్!"

అతడామె పక్కనే సోఫాలో కూర్చున్నాడు.

"ఏమిటో చెప్పమ్మా!" అన్నాడతను.

ఆమె ఏడుస్తూ వుండిపోయింది.

"ఏం జరిగిందో చెప్పు!"

"సేట్ గోకులదాస్ అనే దూది బస్తాకి నన్ను భార్యగా బలివ్వాలని అమ్మా, నాన్నా నిశ్చయించారు" అందామె.

"నువ్వు వద్దంటే అది ఆగిపోతుంది. దానికోసం

ఏడ్వడం అనవసరం" అన్నాడతను.

"అది ఆగదు. బలాత్కారంగా నా పెళ్ళి సాగిపోతుంది."

"నాన్ సెన్స్, నేను నిన్ను రక్షిస్తాను!"

"ఒక విధంగా రక్షించగలరు."

"ఎలాగో చెప్పు అలాగే రక్షిస్తాను."

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"మీరు నన్ను పెళ్ళాడండి!"

అతను తృళ్ళిపడ్డాడు. ఎదురుగా గోడమీదున్న పద్మ ఆయిల్ పెయింటింగ్ వైపు చూశాడు.

"గిరిజా ఏమిటి నువ్వనేది?"

"ముందుగా మీతో నా పెళ్ళి అయిపోతే వాళ్ళు ఏమీ చెయ్యలేరు."

"నా వయస్సు 46 యేళ్ళు. నువ్వు చిన్న పిల్లవి. నా కూతురులాంటి దానవు."

ఆమె గోడమీదున్న పద్మ ఆయిల్ పెయింటింగ్ వైపు చూసింది.

"మీరొక గొప్ప ప్రేమమూర్తి. మూడేళ్ళ జీవితంలో ఎన్ని జన్మలెత్తినా తరగనంత ప్రేమను మీ భార్యకు అందించారు. మీలాంటి ప్రేమికుడికి వయస్సు లేదు!"

"గిరిజా, ఈ జీవితంలో నేనెవర్నీ పెళ్ళాడను. నా హృదయంలో పద్మరూపం జ్యోతిలా వెలుగుతోంది!"

"మీ కామెమీద ఎంత ప్రేముందో నాకు తెలుసు. నేను రోజూ చూస్తున్నాను. మీ భార్య స్థానాన్ని యెవ్వరూ ఆక్రమించుకోలేరని నాకు తెలుసు. నన్ను కాపాడ్డంకోసం మీరు నన్ను పెళ్ళాడాలి" అందామె.

"అదంత సులువుగా చేయగల్గిన పనికాదు."

"అంకుల్, డోంట్ బాదర్!" అయేదేదో అవుతుంది."

గోపాలరావు సమీపంలో వున్న తన పక్కమీద వాలి పడుకున్నాడు. అతడికి నిద్ర రావడంలేదు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. యెప్పుడు నిద్రపట్టిందో అతడికే తెలియదు.

ఏవో మాటలు విని అతడు మేలుకొని పక్క మంచం వైపు చూశాడు. గిరిజ, వనిత నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఎంత మైత్రి వాళ్ళది!

బ్రెడ్ ముక్కలను, బిస్కట్లను గిరిజ ఆమె నోటికి అందిస్తోంది. వనిత హుషారుగా తింటోంది.

"ఇటువైన ఆ మోపెడ్ మీద వెళ్ళకు!" అంది గిరిజ.

"సిల్లీ గిరిజా! అలా యాక్సిడెంట్లు అవుతూనే వుంటాయి. మనం భయపడకూడదు. ఐ డోంట్ కేర్!" అంది వనిత చులకనగా.

## 4

తెల్లవారింది. గోపాలరావు మొహం కడుక్కుని కిందనున్న డైనింగ్ హాల్లోకి వెళ్ళాడు. అక్కడ వనిత, గిరిజ సిద్ధంగా కూర్చుని వున్నారు.

"నీ రాకకోసం యెదురుచూస్తున్నాం, నాన్నా" అంది వనిత.

అతడు కుర్చీలో కూర్చుని గిరిజవైపు చూశాడు.

"నిన్న రాత్రి నీ స్నేహితురాలు భోజనం చేయలేదు. నీ పక్కన అలాగే కూర్చుని వుండిపోయింది" అన్నాడతను.

"గిరిజా, యిప్పుడు ఎక్కువగా తినాలి!" అంది వనిత.

ముగ్గురూ ఆకలితో టిఫిన్ తిన్నారు.

"అమ్మాయి, ఇవాళ కాలేజికి వెళ్ళకు!" అన్నాడతను.

"నేనూ వెళ్ళను" అంది గిరిజ.

"గిరిజా, నువ్వెళ్ళు. ఏం చెప్పాలో నాకు తెలుసుంది. నాన్నా, నువ్వు ఆఫీసుకు వెళ్ళేటప్పుడు గిరిజను కాలేజి దగ్గర డ్రాప్ చెయ్యి" అంది వనిత.

"అలాగేనమ్మా" అన్నాడతను.

వనిత దుస్తులు ధరించి, గిరిజ వెళ్ళి కారులో ముందు సీటుమీద కూర్చుంది. మోహన్ కారు పక్కనే నిలబడ్డాడు.

కారు ఎక్కబోతూ గోపాలరావు పక్కనున్న మోహన్ వైపు చూశాడు.

"మోహన్, నువ్వు కింగ్ అండ్ కంపెనీకి వెళ్ళి నేను చెప్పిందిచేసి ఆఫీసుకురా" అన్నాడతను.

"ఎస్సార్" అన్నాడు మోహన్ వినయంగా.

స్టీరింగ్ వీల్ వెనక గోపాలరావు కూర్చున్నాడు.

"బైబై !" అంది వనిత.

మెర్సిడిస్ కారును గోపాలరావు పోనిచ్చాడు. ఓరగా ఆమెవైపు చూశాడు. వేగంగా కారు రోడ్డమ్మట కదులోంది.

"గిరిజా, నీకు ఏ ప్రమాదం రాదు. ఒక విధంగా నీ పెళ్ళి జరుగుతుంది. నువ్వు ఆ గోకులదాస్‌కు బలవ్వవలసిన అవసరంలేదు" అన్నాడతను.

"అంకుల్, ధన్యవాదాలు" అందామె.

"గిరిజా, నీ కాలేజి బయటకు యెన్నింటికొస్తావు మధ్యాహ్నం?"

"నాలుగింటికి."

"నేను కాలేజి బయట వుంటాను. అక్కడినుంచి ఒక చోటకు వెళ్దాం" అన్నాడతను.

"ఎక్కడికి?"

"నువ్వే చూస్తావు" అని కారు ఆపాడతను.

ఆమె దిగి కాలేజివైపు వెళ్ళిపోయింది. అతడు కారును పోనిచ్చాడు.

నానాలాల్ అండ్ సన్స్ షాపు ప్రాంతంలో కారాపి అతడు దిగాడు. షాపులోకి వెళ్ళి కాస్సేపట్లో తిరిగి వచ్చాడు.

కారులో కూర్చుని తలుపు మూసి సిగరెట్ వెలిగించాడు. పొగ వదులూ క్షణకాలం ఆలోచించి టైమ్ చూశాడు. కారును స్టార్టుచేసి తన ఆఫీసువైపు వేగంగా పోనిచ్చాడు.

## 5

సేట్ గోకులదాస్ కోపంగా గంగరాజు వంక చూశాడు.

"ఎక్కడయ్యా నీ కూతురు? నన్ను యింటికి తీసుకెళ్ళావు. నీ భార్యకూ, పిల్లలకూ కొత్త గుడ్డలిచ్చాను. నీకు విస్కీటాటిల్ యిచ్చాను. కాని నీ కూతురు నాకు కనపడలేదు!" అరిచాడతను.

"అది స్నేహితురాలి ఇంటికి వెళ్ళింది. అది రాగానే మిమ్మల్ని మళ్ళా తీసుకెళ్తాను" అన్నాడు గంగరాజు.

"నేను రాను. దాన్నే యిక్కడకు తీసుకురా! తను కాపరం చేయబోయే యిల్లు ఒకసారి చూస్తుంది" అన్నాడు సేట్.

"అలాగే చేస్తాను" అన్నాడు గంగరాజు.

మధ్యాహ్నం నాలుగింటికి గోపాలరావు తన మెర్సిడిస్ కారును కాలేజి రోడ్డు మీద ఆపి కూర్చున్నాడు. కాస్సేపట్లో గిరిజ కారులో కూర్చుంది. అతడు కారును పోనిచ్చాడు.

పదినిమిషాల్లో ఒక యింటిముందు కారు ఆపాడు. చిన్న ఇల్లు. చుట్టూ కాంపౌండ్ వుంది. మోహన్ పరుగెత్తుకొచ్చాడు.

గోపాలరావు, గిరిజ దిగారు. కారులో వున్న పాకెట్లను మోహన్ తీసుకున్నాడు.

అందరూ ముందు హాల్లోకి వెళ్ళారు. చక్కటి సోఫాలున్నాయి. గోపాలరావు కూర్చుని, వాళ్ళను కూర్చోమన్నాడు. క్షణకాలం నిశ్శబ్దంగా వుంది.

గోపాలరావు మోహన్ వైపు సూటిగా చూశాడు.

"మోహన్, నీమీద నాకు చాలా నమ్మకం వుంది. అందుకే నిన్ను యిక్కడకు రమ్మన్నాను. గిరిజ తలిదండ్రులు బలవంతంగా ఆమెను ఎవడో సేట్ కిచ్చి పెళ్ళి చేయాలని నిశ్చయించారు. ఈ పెళ్ళంటే ఆమెకు ఇష్టం లేదు. మరో విధంగా తన పెళ్ళి ముగించి ఆ పెళ్ళిని ఆపాలని ఆమె ఆరాటం."

గోపాలరావు ఆగాడు. మోహన్ వైపు సూటిగా చూశాడు. మోహన్ ఎందుకో గాభరాపడ్తున్నాడు.

"మోహన్, నువ్వు ఆమెను పెళ్ళాడాలని నా కోరిక."

"నన్ను క్షమించండి. నేను ప్రస్తుతం యెవర్నీ పెళ్ళాడను. ఈ విషయంలో మీరు మరో విధంగా భావించకండి" అన్నాడు మోహన్.

"మోహన్, ఖచ్చితంగా చెప్పినందుకు సంతోషం.

పెళ్ళి విషయంలో యెవరూ యెవర్నీ బలాత్కారించ కూడదు."

టేబుల్ మీదున్న పాకెట్ విప్పి అందులో వున్న పట్టుచీరను అతడు గిరిజ కిచ్చాడు.

"గిరిజా, ఆ గదిలోకెళ్ళి పట్టుచీర కట్టుకుని రా!" అన్నాడతను.

ఆమె పక్క గదిలోకి వెళ్ళి కాసేపట్లో తిరిగొచ్చింది.

"మోహన్, యిప్పుడు జరగబోయేదానికి నువ్వు సాక్షిగా వుంటావు. రేపు ఎప్పుడేనా అవసరమైతే నువ్వు నిజంచెప్పి గిరిజ భవిష్యత్తును కాపాడాలి."

"అలాగే సార్" అన్నాడు మోహన్.

గోపాలరావు ఆమెకు ఒక గొలుసును యిచ్చాడు. మంగళసూత్రాలు గొలుసులో అమర్చబడి వున్నాయి.

మోహన్ ఆ గొలుసువైపు ఆశ్చర్యంగా చూశాడు.

"గిరిజా, ఆ గొలుసును మెళ్ళో వేసుకో!"

ఆమె నవ్వుతూ వేసుకుంది.

"మోహన్, ఈ క్షణంనుంచీ మేము భార్యాభర్తలుగా నటించబోతున్నాం. మా యిద్దరి మధ్యా భార్యాభర్తలకుండే సంబంధాలు వుండవు. ఆమె నా యింట్లో వుంటుంది. కాని మేం వేరు వేరు గదుల్లో పడుకుంటాం. ఆమెను కాపాడ్డంకోసం నీ సమక్షంలో యీ విధంగా ఆమె పెళ్ళి జరిగింది. నువ్వంతా చూశావు."

"విచిత్రంగా వుంది, సార్" అన్నాడు మోహన్.

గోపాలరావు ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"గిరిజా, ఇది చాలుగా?" ప్రశ్నించాడు.

"చాలు, అంకుల్" అందామె.

ఆ నాటి రాత్రి ఎనిమిదింటికి గోపాలరావు ఆమెను

కారులో యింటికి తీసుకెళ్లాడు. ఆమె కారు దిగింది. గంగరాజు కారు దగ్గరకు పరుగెత్తాడు.

"ఎక్కడికి పోయావేి?" అడిగాడు తండ్రి.

"పెళ్ళికి" అంది గిరిజ కుల్లాసంగా.

కారులో కూర్చున్న గోపాలరావు అంతా మౌనంగా వింటున్నాడు.

"ఎవరి పెళ్ళి?"

"నా పెళ్ళి" అందామె బుల్లెట్ లా.

"మాకు తెలియకుండా నీ పెళ్ళా?"

"ఇప్పుడు తెలిసిందిగా!" అందామె మంగళసూత్రాలను పైకి చూపిస్తూ.

"నిన్ను పెళ్లాడిన వాడెవరు?"

"ఆయనే—నా భర్త!" అందామె గోపాలరావు వైపు చూపిస్తూ.

గిరిజ యింట్లోకి వెళ్ళింది. గంగరాజు నవ్వుతూ గోపాలరావువైపు చూశాడు.

"ఎన్నో ఆశలతో యీ పిల్లను పెంచాను. దాన్ని జాగ్రత్తగా చూసుకోండి" అన్నాడు గంగరాజు.

"సేట్ గోకులదాస్ కంటె బాగానే చూస్తాను" అన్నాడు గోపాలరావు నవ్వుతూ.

"మాది పేద కుటుంబం. కాస్త మీరు మాకు సహాయం చేస్తూ వుండాలి."

"అదంతా గిరిజ చేతుల్లో వుంది."

గంగరాజు యింటివైపు పరుగెత్తాడు. కొంతసేపయ్యాక గిరిజ కారు దగ్గరకు వచ్చింది. తలిదండ్రులు, తమ్ముళ్ళు, చెల్లెళ్ళు మూకుమ్మడిగా ఆమె వెనకనే వచ్చారు.

గిరిజ కారులో కూర్చుని తలుపు మూసింది. ఎన్నేళ్ళ పాటో తను కలిసి జీవించిన వాళ్ళవైపు ఆమె దీనంగా చూసింది.

గోపాలరావు కారును పోనిచ్చాడు. ఆమె కిల కిల నవ్వసాగింది.

"గిరిజా, ఎందుకలా నవ్వుతున్నావు?"

"గోకులదాస్ యీ వార్త విని గుండెలు బాదు కుంటాడు. అదంతా ఆలోచిస్తే నవ్వొస్తోంది" అందామె.

## 6

పోర్టికోలో మెర్సిడిస్ కారు ఆగింది. వనిత ముందు వరండామీద నిలబడివుంది. కారులోంచి దిగిన గిరిజవైపు వనిత విచిత్రంగా చూసింది.

"హాయ్ గిరిజా! ఏమిటి పెళ్ళికూతురిలా వున్నావు?" అంది వనిత.

"పెళ్ళయిందిగా!" అంది గిరిజ.

"డోంట్ ఫుల్ మై లెగ్స్! పెళ్ళేమిటి?"

"నా పెళ్ళి యివాళే అయిపోయింది" అంది గిరిజ.

మౌనంగా గోపాలరావు వరండామీద నిలబడ్డాడు.

"నిన్ను పెళ్ళాడిన ఆ మూర్ఖుడెవడు?" అంది వనిత నవ్వుతూ.

"ఆయనే—మీ నాన్న!" అంది గిరిజ.

కోపంతో వనిత మొహం ఎర్రబడింది. ఆమె తండ్రి వైపు కోపంతో చూసింది.

"నాన్నా!" అని భయంకరంగా అర్చింది.

"ఏమిటమ్మా, ఎందుకా ఖంగారు?" అన్నాడు గోపాలరావు మెల్లిగా.

"ఈ బోడిముండను పెళ్ళాడావా? అది నిజంకాదని

చెప్పు నాన్నా! ఈ చిరుగుడ్డల దిష్టిపిడతను పెళ్లాడ లేదని చెప్పు!" అర్చింది వనిత.

ఆమె యిలా ప్రవర్తిస్తుందని అతడు కలలో కూడా వూహించలేదు. వాళ్ళ అన్యోన్యత ఒక్క క్షణంలో పటాపంచలవుతుందని అతడికి తట్టలేదు.

"వనితా, ఆమెను, నీ స్నేహితురాల్ని కాపాడ్డం కోసం యిది జరిగింది" అన్నాడు గోపాలరావు.

వనిత అమాంతంగా పైకి పరుగెత్తింది. తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుంది.

ఆమె వెనకనే పరుగెత్తాడు గోపాలరావు. తలుపు మీద దబదబ కొట్టాడు.

"అమ్మాయి, నేను చెప్పేది విను!" అర్చాడు.

ఆమె తలుపు తెరవలేదు. గోపాలరావు గుమ్మం బయట పచార్లు చేస్తున్నాడు.

గిరిజ పైకి వచ్చింది. అతడివైపు విచారవదనంతో చూసింది.

"గిరిజా, మీ స్నేహాన్ని ఏదీ దెబ్బకొట్టలేదని నేను అనుకునేవాడిని. ఆమె ప్రాణ స్నేహితురాలైన నిన్ను కాపాడాలని యిదంతా జరిపించాను. మనం చేసినది మన్నే బెడిసి కొట్టింది!" అన్నాడు గోపాలరావు.

గిరిజ తలుపును తట్టింది.

"వనితా, నన్ను లోపలకు రానీ!" అందామె.

"పో, నీ మొహం నాకు చూపించకు!"

"యూ ఫూల్, నా మాట విను!"

"నేను ఫూల్నే. అందుకే నిన్ను ఆదరించాను. నువ్వు నంగనాచివి. నాన్నను నీ వలలో యిరికించావు. పధెనిమిదేళ్ళ పవిత్ర ప్రేమను మంటగలిపి నాన్న హృదయంలోకి

పుమ్మరిపురుగులా దొల్చుకుపోయావు! నీకు కావలసింది నేను కాదు, నా స్నేహంకాదు, నాన్న. నాన్న ఆస్తి అదే నీకు కావాలి!" అర్చింది వనిత లోపలనుంచి.

కన్నీళ్ళతో గిరిజ అతడి దగ్గరకు తిరిగివచ్చింది.

"దురాలోచనలతో ఆమె మెదడు మండుతోంది. ఈ క్షణంలో ఏం చెప్పినా ఆమె వినదు!" అన్నాడు గోపాలరావు.

"అంకుల్, మీరు నన్ను క్షమించాలి. మిమ్మల్నీ, ప్రాణ సమానంగా పెంచిన మీ బిడ్డనీ విడగొట్టేనన్న అపకీర్తిని నేను భరించలేను" అందామె.

గోపాలరావు ఆమె వంక చూశాడు. కళ్ళమ్మట ధారలుగా నీళ్ళు కార్తున్నాయి. అంతా అయోమయంగా వుంది. చివరకి యిలా పరిణమిస్తుందని తను అనుకోలేదు.

"అంకుల్, నేను మా యింటికి వెళ్ళిపోతాను."

గోపాలరావు ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"తొందరపడకు. ఆమెలో చెలరేగే తుఫాను మాయమవుతుంది. అటుపైన మనం చెప్పేది ఆమె సవ్యంగా వింటుంది."

"ఇదంతా చూస్తూంటే నాకు చాలా బాధాకరంగా వుంది. వనితంటే నాకెంతో ప్రేమ. కాని ఆమె నన్ను మరో విధంగా చూస్తోంది."

గోపాలరావు ఆమెను సమీపంలో వున్న పక్క గదిలోకి తీసుకెళ్ళాడు. ఆ గదిలో మంచం, బీరువా వగైరాలన్నీ వున్నాయి.

"గిరిజా, నువ్వు యీ గదిలో వుండు!"

ఆమె తలాడించింది.

"ముందు నాకు చెప్పకుండా తొందరపడి ఏమీ చెయ్యకు! త్వరలో అంతా బాగుపడుతుందని నా నమ్మకం."

"అలాగే, అంకుల్" అందామె.

గోపాలరావు బయటకు నడిచాడు. మోహన్ అతడి కెదురుగా వచ్చాడు.

"ఆమెతో నే వెళ్ళి నిజం చెప్పనా?" అన్నాడు మోహన్.

"నిజం చెప్పినా వినే స్థితిలో లేదు వనిత. తర్వాత చూద్దాం" అన్నాడు గోపాలరావు.

# 7

ఎనిమిదైంది. గిరిజ మెల్లిగా పక్కనున్న గోపాలరావు గదిలోకి వెళ్ళింది.

అతడు సోఫాలో కూర్చుని పేపరు చూస్తున్నాడు.

"టిఫిన్ కి రండి!" అందామె.

"వనితను పిలువు!"

గిరిజ మెల్లిగా వనిత గది ముందుకు వెళ్ళింది. తలుపు మూసి వుంది. తోయ్యగానే తలుపు తెరుచుకుంది. ఆమె లోపలకు వెళ్ళింది.

వనిత పల్చటి మేక్సీలో వుంది. గదిలోకొచ్చిన ఆమె వైపు వనిత అసహ్యంగా చూసింది.

"బ్రేక్ ఫాస్టుకు రా!"

"ఇది నీ యిల్లని నన్ను పిలుస్తున్నావా? నేను రాను. మీ రిద్దరూ వెళ్ళి తినండి."

గిరిజ కదల్లేదు. ఆమెవైపు చూస్తూ వుండిపోయింది.

"వనితా, నువ్వెందుకిలా నాకు దూరమయిపోయావు!"

వనిత పరిహాసంగా నవ్వింది.

"నాన్న నీకు దగ్గరయ్యాడు, నే నెందుకు?"

కోపంగా గిరిజ ఆమెవంక చూసింది.

"వనితా, పిచ్చిగా వాగకు! నీ తండ్రిని ఏదేనా అంటే నేను భరించను. ఆయన హృదయం ప్రేమతో నిండివుంది...."

"నిండి నిండి నీ వైపు వరదలా ప్రవహిస్తోంది!" అంది వనిత ఆడ్డొస్తూ.

"నా వైపు కాదు, నీ తల్లి పద్మవైపు. నీ తల్లి రూపం ఆయన హృదయంలో జ్యోతిలా వెలుగుతోంది."

"ఆ ప్రేమ జ్యోతిని నువ్వు ఆర్పేశావు!"

"నేనే కాదు యెవ్వరూ ఆర్పలేరు. చిక్కుల్లో యిరుక్కున్న నన్ను కాపాడ్డానికి పెళ్ళికాని యీ పెళ్ళి జరిగింది. భార్యాభర్తల్లా నటిస్తున్నాం అంతే. మా యిద్దరి మధ్యా ఏ సంబంధమూ లేదు."

"గిరిజా, ఈ కథలన్నీ మీ అమ్మకు చెప్పు! ఆమె నమ్మొచ్చు! భార్యాభర్తలుగా నటించేవాళ్ళు వుంటారని నా కింతవరకూ తెలియదు."

గిరిజ వెనక్కు తిరిగింది.

"మళ్ళా ఎప్పుడూ నా గదిలోకి రాకు! ఈ యింటి మీద నాకూ హక్కుంది. నా జీవితం నేను జీవిస్తాను. మీ జీవితం మీది."

విచారవదనంతో గిరిజ గోపాలరావు గదిలోకి వెళ్ళింది. జరిగినదంతా అతడితో చెప్పింది.

"ఇప్పుడు ఏం చేద్దాం?" అడిగింది.

"వనిత చెప్పింది చేద్దాం. మనిద్దరం వెళ్ళి టిఫిన్ తిందాం" అన్నాడతను.

కిందనున్న డైనింగ్ హాల్లో యిద్దరూ టిఫిన్ తింటూ కూర్చున్నారు.

వంటామె ట్రేలో ఏదో పట్టుకుని వెళ్తోంది.

"ఎక్కడికమ్మా?" అడిగాడు గోపాలరావు.

"వనితమ్మ బ్రేక్‌ఫాస్టు తన గదికి తెమ్మన్నారు" అని ఆమె వెళ్ళిపోయింది.

"గిరిజా, చూశావా, అమ్మాయి తింటోంది. తినడం మానలేదు. మరి కొన్నిరోజులు గడిస్తే ఆమె కిందకొచ్చి మన పక్కనే కూర్చుని తింటుంది" అన్నాడతను.

గిరిజ అతడివైపు అదోలా చూసింది.

"ఆమె అంతగా మారుతుందనే నమ్మకం నాకు లేదు?" అందామె.

"ఎందువలన అలా అంటున్నావు?" అడిగాడతను.

"హైస్కూల్లో మేరీ అనే అమ్మాయితో ఆమె చాలా స్నేహంగా వుండేది. యెందువలనో వాళ్ళ స్నేహం చెడింది. మేరీ అదే స్కూల్లో చదివింది. కాని వనిత ఆమెతో మళ్ళా మాట్లాడలేదు. నాతో స్నేహం చేసింది. మేమిద్దరం స్నేహితులమయ్యాం. ఇప్పుడు మా స్నేహం కూడా దెబ్బతింది" అందామె.

ఇద్దరూ టిఫిన్ ముగించి హాల్లోకొచ్చారు. సోఫాలో కూర్చున్నారు. మోహన్ వాళ్ళముందుకొచ్చాడు.

"ఏమిటి మోహన్?"

"మీ అమ్మాయి వనితమ్మకి వెయ్యిరూపాయలు కావాలిట" అన్నాడు మోహన్.

"ఆమెకా డబ్బు కాష్‌బాక్స్‌లోంచి తీసి యివ్వు!"

"ఇస్తాను, సార్."

"మోహన్, మరో విషయం. మాకు దూరంగా వుండి వనిత పాడవడం నా కిష్టంలేదు. ఇటుపైన నువ్వు నాతో రావద్దు. వనితకు తెలియకుండా ఆమెను వెంటాడు. ఆమె

ఏం చేస్తున్నదీ, ఎవరెవర్ని కల్సుకుంటున్నదీ నాకు కావాలి" అన్నాడు గోపాలరావు.

"అలాగే సార్."

"నువ్వు వెంటాడుతున్నట్లు ఆమె తెలుసుకోకూడదు!"

"ఆమె కనుక్కోలేదు, సార్. మారు వేషంలో ఆమెను నేను వెంటాడతాను" అన్నాడు మోహన్.

"గుడ్ లక్, మోహన్" అన్నాడు గోపాలరావు.

# 8

ఫియట్ కారు తనే నడుపుతూ వనిత బయటకు వెళ్ళింది. ఆమె కారు గేటు దాటగానే మోహన్ స్కూటర్ మీద మాసుకుపోయాడు.

ఫియట్ కారు బీచ్ వైపు కదుల్తోంది. బీచ్ లోపల రోడ్డుమీద కారాపి ఆమె దిగింది. సముద్రంవైపు వయ్యారంగా నడుస్తూ వెళ్ళింది.

ఆమె కారుకు కొంచెం దూరంలో స్కూటర్ ఆపి దిగాడు మోహన్. చిరిగిన పైజామా, జుబ్బాలో అతడు పేదవాడిలా వున్నాడు. అతిడి వయసు యాభై పైన వుంటుందని చూసినవాళ్ళు అనుకుంటారు.

సముద్రంవైపు వెళ్తూన్న ఆమెను చూసి మోహన్ ఫియట్ కారువైపు కదిలాడు.

ఇద్దరు యువకులు బోనెట్ ఎత్తి ఏదో చేస్తున్నారు. వాళ్ళ పక్కనుంచి మోహన్ మెల్లిగా కదులుతున్నాడు.

"ఆ పిట్టవచ్చి కారును స్టార్టుచేస్తుంది. కారు స్టార్టు అవదు. అప్పుడు నేను రంగంలోకొచ్చి రిపేరు చేస్తాను. కారు వెంటనే స్టార్టు అవుతుంది" అన్నాడో యువకుడు.

"మంచి ఐడియా!"

"పిట్ట డబ్బున్నదిలా వుంది. మన వల్లో పడ్తే పిండుకు

తాగొచ్చు."

మోహన్ వాళ్ళ సంభాషణ విన్నాడు. వెనక్కి తిరిగాడు. బోనెట్ మూసి ఇద్దరు యువకులూ దూరంగా జరిగారు. వాళ్ళవైపు చూశాడు మోహన్.

ఒక యువకుడు చూడ్డానికి చక్కగా వున్నాడు. ఖరీదైన పాంట్, స్లాక్ ధరించాడు. చేతికి మెరుస్తూన్న వాచ్ వుంది.

సముద్ర పొద్దున యిసుకలో ఆమె కూర్చుంది. చీకటి పడింది. పక్కనుంచి నడుస్తూ ఆమె ఏడుస్తోందని మోహన్ గమనించాడు.

కొంతసేపయ్యాక వనిత కారువైపు నడిచింది. ఎంత ప్రయత్నించినా కారు స్టార్టు కాలేదు.

ఒక యువకుడు పక్కనుంచి వెళ్తూ, ఆగి ఆమెవైపు చూశాడు.

"మిస్, కారు స్టార్టు అవడంలేదా?" అడిగాడతను.

ఆమె తలాడించింది.

అతడు బోనెట్ ఎత్తాడు. పది నిమిషాలపాటు ఏదో చేశాడు. కారు స్టార్టు అయింది. అతడు బోనెట్ మూసి ఆమె పక్కకొచ్చాడు.

కృతజ్ఞతతో ఆమె అతడివైపు చూసింది.

"మీకు చాలా థాంక్స్" అందామె.

"డోంట్ బాదర్" అన్నాడతను.

అతడు పచ్చగా, పొడుగ్గా వున్నాడు.

"మీ పేరు?"

"విక్టర్ జోన్స్" అన్నాడతను.

"మీరు ఎందాకా వెళ్ళాలి?"

"మైలాపూర్" అన్నాడతను.

"ఎక్కండి, మిమ్మల్ని త్రోవలో దించేస్తాను" అందామె.

"ఎందుకులెండి, నడిచిపోతాను" అన్నాడతను.

"ప్లీస్, ఎక్కండి!"

అతడు కారులో ఆమె పక్కనే కూర్చుని తలుపు మూశాడు. ఆమె కారును పోనిచ్చింది.

ఫియట్ కారు వెనకనే మోహన్ తన స్కూటర్ని పోనిచ్చాడు.

ఫియట్ కారు రోడ్డమ్మట వేగంగా వెళ్తోంది.

విక్టర్ జోన్స్ మారు పేరు. అతడి అసలు పేరు గణేష్.

"మీరు కారు బాగా నడుపుతున్నారు. లైసెన్స్ వుందా?" అడిగాడతను.

ఆమె నవ్వింది.

"లైసెన్స్ లేకుండా నే నడుపుతున్నాను."

"150 రూపాయలు ఇస్తే టెస్టుకు వెళ్ళకుండా మీకు లైసెన్స్ వస్తుంది. నా మిత్రుడు ఆదినారాయణ ఇప్పించ గలడు."

"నాకు లైసెన్స్ యిప్పించండి" అందామె.

"మీ పేరూ, అడ్రెసూ చెప్పండి" అందామె.

ఆమె చెప్పింది.

"మిస్టర్ విక్టర్ జోన్స్, మీరు ఏం చేస్తున్నారు?" ప్రశ్నించిందామె.

"అశోక్ లేలండ్ కంపెనీలో యింజనీర్ని."

"మీతో పరిచయం అయినందుకు సంతోషం" అందామె.

"మిమ్మల్ని కల్సుకున్నందుకు నేను ఆనందిస్తున్నాను"

అన్నాడతను.

కారు మైలాపూర్ దాటిపోయింది.

"మైలాపూర్ దాటిపోయాం" అందామె.

"మీతో వుంటే ఎక్కడున్నామో తెలియడంలేదు. మీరు నన్ను హిప్నటైజ్ చేసేశారు!"

ఆమె నవ్వింది. కారు ఆపింది.

"దిగి వెనక్కి వెళ్ళాలి" అన్నాడతను.

"వెనక్కి తీసికెళ్ళి దింపనా?"

"సారీ, అంత శ్రమ మీకు కల్గించను" అన్నాడతను కిందకు దిగుతూ.

బయట నిలబడి అతడు ఆమెవైపు చూశాడు. హేండ్ బాగ్‌లోంచి రెండువందల రూపాయిలనోట్లు తీసి ఆమె అతడికిచ్చింది.

"ఇది లైసెన్స్‌కోసం" అందామె.

"నా దగ్గర ఛేంజిలేదు. మీకు యాభై యివ్వాలి" అన్నాడతను.

"తర్వాత ఇవ్వొచ్చు. మనం ఎప్పుడు కల్సుకుందాం?" అందామె.

"రేపు సాయంత్రం, బీచ్‌లో, అదేచోట" అన్నాడతను.

"గుడ్‌నైట్ మిష్టర్ విక్టర్" అని ఆమె కారును పోనిచ్చింది.

కొంచెం దూరం ఆగిన స్కూటర్ అతడి పక్కనుంచి దూసుకుపోయింది.

హాల్లో లైట్లు వెలుగుతున్నాయి. సోఫాలో గోపాలరావు, గిరిజ కూర్చొని వున్నారు.

"బీచ్‌లో ఒక యువకుడిని ఆమె కల్సుకుంది. అతడికి

కారులో లిఫ్ట్ యిచ్చింది" అన్నాడు మోహన్.

"ఎవరతను?" అడిగాడు గోపాలరావు.

"పేరింకా నాకు తెలియదు. కాని అతడు మోస గాడని చెప్పగలను" అని తను చూసినదంతా మోహన్ చిత్రించాడు.

"గుడ్ గాడ్!" అన్నాడు గోపాలరావు.

"అతడితో తిరగకుండా మనం చూడాలి" అంది గిరిజ.

"అతడు త్వరలో యిక్కడికి రావచ్చు. అప్పుడు ఆమెను హెచ్చరించండి" అన్నాడు మోహన్.

"అలాగే, మై గుడ్ బాయ్" అన్నాడు గోపాల రావు.

# 9

అడవి ప్రదేశం. టాంక్ వద్దన ఆమె కారు ఆపింది. ఇద్దరూ కిందకు దిగారు.

"ఈ చెరువులో స్నానం చేస్తే బాగుంటుంది" అన్నాడతను.

"లెటస్ స్విమ్, మిష్టర్ విక్టర్" అందామె.

అతడామె భుజంమీద చెయ్యివేశాడు.

"వనితా, నన్ను విక్టర్ అని పిలువు!" అన్నాడతను.

బేదింగ్ దుస్తులు ధరించి యిద్దరూ చెరువులోకి దూకారు. అరగంటపాటు ఈదుతూ స్నానం చేశారు. ఆమె పాదాలను అతను పట్టుకున్నాడు. ఆమె నవ్వింది. ఇద్దరూ వుషారుగా ఒడ్డుకు చేరుకున్నారు. పక్కపక్కనే గడ్డిమీద పడుకున్నారు.

"వనితా, ఐ లవ్ యు!" అన్నాడతను.

సమీపంలోంచి తుపాకీ పేలిన చప్పుడు వినపడింది.

"ఎవరో వున్నారు!" అన్నాడతను.

ఇద్దరూ తొందరగా దుస్తులు మార్చుకున్నారు. కారులో కూర్చున్నారు. ఒకతను తుపాకీ పట్టుకుని ప్రత్యక్షమయ్యాడు. ఆకాశంలో ఎగిరే పక్షివైపు అతడు షూట్ చేశాడు. కాస్సేపట్లో అతడు ఎక్కడికో వెళ్ళిపోయాడు.

అతడు ఆమెను తనవైపు లాక్కున్నాడు. ఆమె యెర్రటి పెదిమలను బలంగా, ఆవేశంతో ముద్దెట్టుకున్నాడు.

"యూ ఆర్ కిల్లింగ్ మి!" అందామె.

"కిల్లింగ్ విత్ లవ్" అన్నాడతను.

ఆమె తీయగా నవ్వింది.

"విక్టర్, రేపు మా యింటికిరా" అందామె.

"మీ నాన్న ఏమంటాడో!" అన్నాడతను.

"నాన్న నీ గురించి ఆలోచించడు. నా వయసు పిల్లని నాన్న యీ మధ్యనే పెళ్ళాడాడు. ఆమెలో లీనమై వుంటాడు నాన్న" అందామె.

"అయితే వస్తాను" అన్నాడతను.

"నా కారు డ్రయివింగ్ లైసెన్స్ ఎప్పుడొస్తుంది?"

"రెండు మూడు నెలలు పడ్తుంది. పోస్టులో మీ యింటికి వస్తుంది. 200 ఆదినారాయణకి యిచ్చాను. మిగిలిన యాభై అతడిని వుంచుకోమన్నాను" అన్నాడతను.

ఒక సాయంత్రం ఆదింటికి అతడు వనిత యింటికొచ్చాడు. పెద్దమనిషిలా కింద హాల్లోని సోఫాలో కూర్చున్నాడు.

గిరిజ అతడివైపు సూటిగా చూసింది.

"ఎవరు మీరు? ఏం కావాలి?" అడిగిందామె.

"నా పేరు విక్టర్ జోన్స్. మిస్ వనితకోసం వచ్చాను" అన్నాడతను.

అదే సమయంలో వనిత హాల్లోకొచ్చి అతడివైపు నవ్వుతూ చూసింది.

"హై విక్టర్, పద, వెళిపోదాం" అందామె.

"ఆమెను నాకు పరిచయంచేయి" అన్నాడతను.

"ఆమె నా స్టెప్ మదర్!" అంది వనిత.

విక్టర్, వనిత నవ్వుతూ మెట్లెక్కుతూంటే గిరిజ కింద నిలబడి వాళ్ళవైపు చూసింది. మోహన్ హాల్లో కొచ్చాడు.

"గిరిజగారూ!" అన్నాడు మోహన్.

"చెప్పండి" అందామె.

"విక్టర్ జోన్స్, అనే పేరుతో అతడు ప్రస్తుతం చలామణీ అవుతున్నాడు. అతడి అసలు పేరు గణేష్. ఒకసారి అతడు జైలుకి వెళ్ళి వచ్చాడు" అన్నాడు మోహన్.

ఆ రాత్రి విక్టర్ వనితతో ఆమె గదిలో భోజనం చేశాడు. రాత్రి పన్నెండుదాకా అతడు ఆమె గదిలో వున్నాడు. కారులో తీసుకువెళ్ళి ఆమె అతడిని దింపి తిరిగొచ్చింది. హాల్లోంచి ఆమె మెట్లవైపు వెళ్తోంది.

హాల్లోని పెద్ద సోఫాలో గోపాలరావు, గిరిజ కూర్చుని వున్నారు.

"వనితా!" పిల్చాడు గోపాలరావు.

ఆమె ఆగి తండ్రివైపు చూసింది. అతడు ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"ఎవరతను?"

"నా ప్రియుడు నేను అతడిని పెళ్ళాడబోతున్నాను"

"మాకు చెప్పకుండా పెళ్ళాడ్తావా?"

"నాకు చెప్పి మీరు పెళ్ళిచేసుకున్నారా?" అడిగిందామె.

"నువ్వు నా కూతురివి. అతడు మంచివాడు కాదు. మోసగాడు. నిన్ను చివరకి మోసగిస్తాడు. నిన్ను కాపాడే బాధ్యత నాది" అన్నాడతను.

"గిరిజ మోసగత్తె. ఆమెను మీరు వదిలేశారా? అతడు ఏమైనా నాకు ఫరవాలేదు. అతడు నాకు నచ్చాడు. నేను అతడినే పెళ్ళాడ్తాను" అందామె.

"అతడు నాకు నచ్చలేదు!" అన్నాడు గోపాలరావు.

"అతడిని పెళ్ళాడేది నేను, నువ్వు కాదు నాన్నా!" అందామె.

"అతడు ఓసారి జైలుకెళ్ళి వచ్చాడు."

వనిత తండ్రివైపు సూటిగా చూసింది.

"ఆ అబద్ధపు వార్త ఎవరు చెప్పారు, గిరిజా? నేను సుఖంగా వుంటే మీరు చూడలేరా? నన్నెందుకిలా పీడిస్తున్నారు? మీ యిష్టప్రకారం మీరు పెళ్ళాడారు. నా యిష్టప్రకారం నన్ను పెళ్లాడనీయండి."

"వనితా, నేను గిరిజను పెళ్ళాడలేదు. మెళ్ళో మంగళసూత్రాలు ఆమే వేసుకుంది. నేను కట్టలేదు!"

"అబద్ధాలాడకు నాన్నా!"

"వనితా, ఆమె నీ స్నేహితురాలు. ఆమె తలిదండ్రులు ఆమెను బలవంతంగా సేట్ గోకులదాస్ అనే వృద్ధుడికిచ్చి పెళ్ళిచేయాలని నిశ్చయించారు. ఏడుస్తూ ఆమె అదంతా నాతో చెప్పింది. ఆ గండంనుంచి తప్పించడం కోసం ఆమెను పెళ్ళాడినట్లు నేను నటించాను. నువ్వెంతో

ఆమె నాకంతే!" అర్చాడతను బాధతో.

"నాన్నా, ఇదంతా నాకు చెప్పకు. నేను ఫూల్ని కాను. గిరిజ నా కళ్ళు తెర్పింది. జీవితం అంటే ఏమిటో నాకు అర్థమైంది" అని ఆమె మెట్లమ్మట పైకి వెళ్ళి పోయింది.

## 10

రెండు రోజులనుంచి వనిత కనబడ్డంలేదు. గోపాల రావు ఆఫీసుకు వెళ్ళడం మాని యింట్లో వుండిపోయాడు. గిరిజ, మోహన్ అతడి పక్కనే వున్నారు.

"ఆమె ఆ విక్టర్‌తో వెళ్ళింది సార్. నేను చూశాను. వాళ్ళ కారును నేను మిస్ అయ్యాను. వెతికి వెతికి వెనక్కు తిరిగి వచ్చాను ఆ రోజున" అన్నాడు మోహన్.

"విక్టర్ అడ్రెస్ తెలుసా?"

"తెలియదు, సార్. అతడికి యిల్లు లేనట్లుంది. పేవ్ మెంటుమీద అతడు జీవిస్తూ వుండాలి."

"గుడ్ గాడ్!" అన్నాడు గోపాలరావు.

టెలిఫోన్ మ్రోగింది. మోహన్ రిసీవర్ని అందు కున్నాడు.

"మీకోసం, సార్" అన్నాడు మోహన్.

గోపాలరావు రిసీవర్ని అందుకున్నాడు.

"గోపాలరావు స్పీకింగ్!" అన్నా డతను.

"మిస్టర్ గోపాలరావు, నీ కూతురు వనిత మా దగ్గర క్షేమంగా వుంది. ఆమెతో వున్న విక్టర్ జోన్స్ మాతో పోట్లాడి కుక్కలా చచ్చాడు. నీకు ఆమె కావాలంటే మేం చెప్పినట్లు చెయ్యాలి" అందో కంఠం.

"ఏం చెయ్యాలో చెప్పండి."

"ఐదు లక్షలిస్తే ఆమె మీ యింటికి తిరిగివస్తుంది.

డబ్బు సిద్ధంగా వుంచండి. మళ్ళా ఫోన్ చేస్తాను. పోలీసులకు రిపోర్టిస్తే నీ కూతురు చెక్కలు, ముక్కలు అవుతుంది."

అటువైపునుంచి రిసీవర్ పెట్టేసిన శబ్దం వినబడింది. రిసీవర్ పెట్టేసి గోపాలరావు సోఫాలో కూలిపోయాడు.

"ఏమైంది?" అడిగింది గిరిజ.

అంతా అతడు చెప్పాడు.

"విక్టర్ జోన్స్ చచ్చాడంటే నేను నమ్మను. అతడే యిదంతా చేయిస్తూ వుండాలి" అన్నాడు మోహన్.

రాత్రి పన్నెండయింది. టెలిఫోన్ మ్రోగింది.

గోపాలరావు రిసీవర్ ఎత్తి, "గో పా ల రా వు స్పీకింగ్!" అన్నాడు.

"డబ్బు రెడీగా వుందా?" అందో కంఠం.

"వుంది."

"పది లేక యాభై రూపాయిల నోట్లలో వుండాలి."

"అలాగే యిస్తాను."

"వెంటనే డబ్బు బాగ్ లో పెట్టుకుని బయల్దేరు. విల్లివాకంరా. లెవల్ క్రాసింగ్ నుంచి ఐ.సి.ఎఫ్. రైలు పట్టాలు వెళ్తాయి. వాటమ్మట నడువు. ఫర్లాంగ్ దూరం వెళ్ళాక ఆగు. ఒక ముష్టాడు నీకు ఎదురవుతాడు. అతడికి ఆ బాగ్ యిచ్చి వెనక్కు వెళ్ళిపో. రెండులోపల వనిత మీ యింట్లో వుంటుంది."

"అలాగే చేస్తాను."

"మమ్మల్ని పట్టుకోడానికి ప్రయత్నిస్తే నీ కూతురి శవాన్ని పెట్లో పెట్టి నీ యింటికి పంపుతాం."

"ప్లీస్, అదంతా వద్దు. నేను మీకు డబ్బిస్తాను" అన్నాడు గోపాలరావు.

"కమ్ ఫాస్టు!" అందా కంఠం.

గోపాలరావు ఎదురుగా వున్న మోహన్ వైపు చూశాడు.

"మోహన్, బాగ్ లో ఐదులక్షలు రెడీగా వుందా?"

"వుంది, సార్."

"మనిద్దరం వెళ్దాం, పద" అన్నాడు గోపాలరావు.

"వాళ్ళకు యింత డబ్బు యిచ్చేద్దామా?" అడిగాడు మోహన్.

గోపాలరావు నవ్వాడు. ఒక పిస్టల్ని మోహన్ కి యిచ్చాడు. మరో పిస్టల్ని తన జేబులో వుంచుకున్నాడు.

"మోహన్, మనం పిరికిపందలం కాము. వాళ్ళని మనం పట్టుకుందాం" అన్నాడు గోపాలరావు.

"గుడ్ ఐడియా" అన్నాడు మోహన్.

గోపాలరావు కారు దగ్గరకు వెళ్ళాడు. గిరిజ కారు పక్కనే నిలబడింది. అతడామె భుజంమీద చెయ్యి వేశాడు.

"గిరిజా, వెళ్తున్నాను. ఏమవుతుందో నాకు తెలియదు" అన్నాడతను.

"అంకుల్, జాగ్రత్త! మీరాకకోసం నేను యెదురు చూస్తూ వుంటాను" అంది గిరిజ.

గోపాలరావు, మోహన్ కారు ఎక్కారు. మెర్సిడిస్ కారును అతడు పోనిచ్చాడు.

కారు విల్లివాకం చేరుకుంది. వెనక క్రాసింగ్ దగ్గర అతడు కారు ఆపాడు. ఇద్దరూ కిందకు దిగారు. మోహన్ చేతిలో డబ్బున్న బాగ్ వుంది. ఐ. సి. ఎఫ్. పట్టాలమ్మట యిద్దరూ నడవసాగారు.

దూరంలో లైట్లు వెల్గుతున్నాయి. వాళ్ళు పట్టాలమ్మట

నడుస్తున్నారు.

పట్టాలు మలుపు తిరుగుతున్నాయి. ఒక ముష్టాడు అమాంతంగా వాళ్ళకు కనిపించాడు.

"అయ్యా, దానం చేయండి!" అరిచాడతను.

మోహన్ చేతిలో వున్న బాగ్ ను గోపాలరావు తీసుకుని ముష్టివాడి కిచ్చాడు. అతడు గబగబా వెళ్ళిపో సాగాడు.

గోపాలరావు అతడి వెనకనే వెళ్తున్నాడు.

"వెళ్ళొద్దు! ప్రమాదం, సార్" అన్నాడు మోహన్.

"నాన్ సెన్స్, కమ్" అన్నాడు గోపాలరావు.

కొంచెం దూరం యిద్దరూ వెళ్ళారు.

"మిష్టర్ గోపాలరావు, చేతులెత్తు!" అరిచారెవరో గంభీరంగా.

తృళ్ళిపడ్తూ గోపాలరావు వెనక్కి చూశాడు. మోహన్ పిస్టల్ అతడివైపు కేంద్రీకరించబడింది.

"మోహన్, నువ్వా!" అన్నాడు గోపాలరావు.

"నేనే! నువ్వు వెనక్కి వెళ్ళిపో!" విక్టర్ చచ్చాడు. నీ కూతురు నా చేతుల్లో వుంది" అన్నాడు మోహన్

"ద్రోహీ!" అరిచాడు గోపాలరావు.

మరుక్షణంలో పిస్టల్ పేలింది. అరుస్తూ మోహన్ నేలమీద కూలిపోయాడు. అతడి పక్కనే వంగి కూర్చు న్నాడు గోపాలరావు.

"నా కూతురు ఎక్కడుంది?"

మోహన్ కొన ఊపిరితో వున్నాడు.

"విక్టర్ జోన్స్‌తో ఆమె కూడా మరణించింది."

"ఎలా?"

"అతడిని మేం చంపాం. ఆమె ఆత్మహత్య చేసు

కుంది" అని మోహన్ శాశ్వతంగా కళ్ళు మూశాడు.

గోపాలరావు వేగంగా పరుగెత్తాడు. ముష్టివాడి చేతిలో వున్న బాగ్ను లాక్కున్నాడు. వేగంగా వెనక్కి నడిచాడు.

లెవల్ క్రాసింగ్ దగ్గరకు చేరుకున్నాడు. మెర్సిడిస్ కారులో ఎక్కాడు. కారును శరవేగంగా తన ఇంటి వైపు పోనిచ్చాడు.

మెర్సిడిస్ కారు పోర్టికోలో ఆగింది. పరుగెత్తుకుంటూ గిరిజ కారు దగ్గరకొచ్చింది. గోపాలరావు కిందకు దిగాడు.

"మీరు క్షేమంగా తిరిగొచ్చినందుకు సంతోషం" అందామె.

ఇద్దరూ పైనున్న పడగ్గదిలోకి వెళ్ళారు. లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

బీరువాలో వున్న స్కాచ్ బాటిల్ని తీసి అతడు విస్కీ గ్లాసులో పోసుకుని, నీళ్ళు కలిపాడు. గడగడ తాగేశాడు. మళ్ళా విస్కీ గ్లాసులో పోసుకున్నాడు.

"మోహన్ ఎక్కడ?" అందామె.

"వనితతో వున్నాడు" అన్నాడతను.

"వనిత ఎక్కడుంది?" అడిగిందామె.

అతడు ఆమెవైపు సూటిగా చూశాడు.

"తన ప్రియుడు విక్టర్ జోన్స్తో ఆమె పైలోకానికి వెళ్ళిపోయింది. మోహన్ కూడా అక్కడికే వెళ్ళాడు" అన్నాడతను.

గిరిజ కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"అంకుల్, నా మూలంగా అందరూ నాశనమయ్యారు.

నేను యీ ఇంట్లో వుండకూడదు. నేను పాపిష్టిదాన్ని. నేను వెళ్ళిపోతాను" అందామె.

అతడామెవైపు తీక్షణంగా చూశాడు.

"గిరిజా!" పిల్చాడు గోపాలరావు.

"చెప్పండి అంకుల్" అందామె.

"నువ్వుకూడా వెళ్ళిపోతే నాకెవరుంటారు, గిరిజా?" అని అతడు ఏడ్వసాగాడు.

ఆమె అతడిని సోఫాలో కూర్చోబెట్టింది. పక్కనే కూర్చుంది. గ్లాసులోని విస్కీని అతడు క్షణంలో తాగేశాడు.

"ఇంకా పొయ్యి, గిరిజా!" అర్చాడతను.

"ఇంక తాగొద్దు" అందామె.

"పద్మలా చెప్తున్నావు!" అన్నాడతను.

"నేను మీ పద్మనేమో!" అందామె నవ్వుతూ.

గోపాలరావు ఆమెవైపు ఆప్యాయంగా చూశాడు.

"గిరిజా, యింతవరకూ మనం భార్యాభర్తలుగా నటించాం. ఇటుపైన నటించడం అనవసరమనిపిస్తోంది. నాకు పిల్లలు కావాలి. నువ్వు వాళ్ళను కనాలి" అన్నాడతను.

ఆమె అతడివైపు ఆప్యాయంగా చూసింది.

"మీ ప్రేమను రుచిచూసే అవకాశం నాకు లభించినందుకు ఆనందిస్తున్నాను" అంది గిరిజ.

—: అయిపోయింది: —

# స్వర్ణ మయూరం!

అజీజ్

"డిటెక్టివ్ దుర్యోధన్ గారు ఉన్నారా?" వీణా తంత్రులు మీటినట్టు వినిపించిన కమ్మని కంఠం విని, చటుక్కున తలెత్తి చూశాడు అర్జున్.

సుమారు పాతికేళ్ళుంటాయామెకి. గులాబిరంగు ఒళ్ళు. చారడేసి కళ్ళు. నిండుగా, పొందికగా యెదిగిన అవయవాలు. ఉంగరాలు తిరిగి ఏపుగా, ఒత్తుగా పెరిగిన శిరోజాలు. రోజారేకుల్ని మరిపించే పల్చని పెదాలు.

ఆకుపచ్చ రంగు పట్టుచీర, అదేరంగు బ్లౌజు ఆమె ఒంటి రంగును మరింత స్పష్టంచేస్తున్నాయి. కళ్ళల్లోనూ, నిల్చున్న తీరులోనూ గొప్పింటి అమ్మాయిలకుండే ఠీవీ, గాంభీర్యం వ్యక్తమౌతున్నాయి.

"ఉన్నారు. రండి. లోపలికి రండి" అన్నాడు అర్జున్ లేస్తూ.

ఆమె లోన అడుగుపెట్టి—"నా పేరు స్వప్నరాశి! దుర్యోధన్ గార్ని కలుసుకోవడానికి వచ్చాను" అంది.

"కూర్చోండి. లోపల ఉన్నారు. పిలుచుకొస్తాను" అన్నాడు అర్జున్. సోఫా చూపుతూ.

"నా వెంట ఫామిలీ లాయర్ కూడా ఉన్నారు. బైట టాక్సీవాడికి డబ్బిచ్చి వస్తున్నారు" అంది సోఫాలో చతికిలబడుతూ.

అంతలో కాంపౌండ్ గేటుగుండా ఫుల్ సూటులో ఉన్న ఓ వ్యక్తి కనిపించాడు. నలభై ఏళ్ళుంటాయతనికి. మామూలు ఒడ్డూపొడుగు.

రిస్టువాచీ చూసుకున్నాడు అర్జున్. ఉదయం పది గంటలు.

అతను గుమ్మంలోకి రాగానే, "వెల్‌కమ్ ప్లీజ్!" అన్నాడు అర్జున్.

అతను లోన అడుగుపెట్టి, "గ్లాడ్ టు మీట్ యూ మిస్టర్ దుర్యోధన్!" అన్నాడు చెయ్యి చాపుతూ.

అర్జున్ నవ్వి—"నేను దుర్యోధన్ని కాను. ఆయన అసిస్టెంట్ అర్జున్ని! కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అంటూ లోనికి నడిచాడు.

ఐదు నిమిషాల తరవాత దుర్యోధన్‌తో డ్రాయింగ్ రూంలో అడుగుపెట్టాడు. దుర్యోధన్ని చూడగానే క్లయింట్స్ ఇద్దరూ లేచి నిల్చున్నారు.

స్వప్నరాశి ముందు తనని పరిచయం చేసుకుని, "ఈయన మా ఫామిలీ లాయర్ దివ్యనాథ్ గారు" అంది ఆ వ్యక్తిని చూపుతూ.

దుర్యోధన్ అతనికి షేక్‌హాండ్ ఇచ్చి సోఫాలు చూపి, తనూ కూర్చున్నాడు. అర్జున్ తన టేబిల్ మీది షార్టుహాండ్ బుక్, పెన్సిల్ అందుకుని, వాళ్ళు చెప్పేది నోట్ చేసుకోడానికి సిద్ధంగా కూర్చున్నాడు.

ఆ యువతి ప్రారంభించింది. "మీ సహాయంకోసం చాలా దూరంనించి, విజయనగరంనించి వచ్చాం! మీ ద్వారా మా సమస్య తప్పక పరిష్కారమౌతుందన్న నమ్మకంతో."

దుర్యోధన్ తలూపి, చెప్పండి!" అన్నాడు.

స్వప్నరాశి కంఠం సవరించుకుని చెప్పసాగింది. "ముందు ఎక్కణ్నించి ప్రారంభించాలో అర్థంకావడం లేదు. మొదట మా వంశం గురించి వివరించడం మంచిది. మా నాన్న పేరు రఘుపతినాయుడు. స్వాతంత్ర్యానికి పూర్వం విజయనగరం చుట్టుపక్కల మాకు పెద్ద జాగీరు ఉండేది. ఇప్పుడంతా పోయిందనుకోండి.

"ప్రస్తుతం మా ఆర్థికపరిస్థితి అంతంత మాత్రమే! గతచిన పదిహేను సంవత్సరాలనించీ నాన్నగారు మా కట్టెసీ కాపాడటానికి ఇంట్లోని విలువైన నగలూ, వస్తువులూ ఒక్కొక్కటే అమ్ముతూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

"ఇది ఉపోద్ఘాతం! ఇక అసలు విషయానికి వస్తున్నాను. పాతికేళ్ళక్రితం మా నాన్నగారికి ఓ తమ్ముడుండేవారట. ఏదో విషయంలో వాళ్ళిద్దరికి పొసగక, స్వతహాగా ముక్కోపీ, ఆత్మాభిమానీ అయిన ఆయన ఇల్లువిడిచి ఎటో వెళ్ళిపోయారట. తరవాత ఎంత వెదికినా ఆయన జాడ తెలియలేదట.

"కానీ, ఇన్నేళ్ళ తరవాత కొద్దిరోజుల క్రితం అనుకోకుండా ఆయన వివరాలు తెలిశాయి మాకు. బొంబాయిలో ఒక ఉన్నతాధికారిగా మా చిన్నాన్న ఈ మధ్యే మరణించినట్టు, ఆయన లాయర్ అక్కణ్నించి మాకు టెలిగ్రాం ఇచ్చాడు.

"చిన్నాన్న మరణిస్తూ, తనయావదా స్తికీ నన్ను వారసురాలిగా నిర్ణయించి పోయారట. ఆయనకి నేనంటే పంచప్రాణాలట. విచిత్రం ఏమిటంటే ఇంతవరకూ నేనాయన్ని చూడనేలేదు! కారణం, ఆయన ఇల్లు విడిచినప్పుడు నేను పాలుగారే పసిదాన్ని!

"కట్టు చేతులతో ఇల్లు విడిచి వెళ్ళిన వ్యక్తి అదృష్ట దేవత కటాక్షంపొంది ఐశ్వర్యవంతు డయ్యాడు. ఆ డబ్బు ఆయన కష్టపడి సంపాదించి ఉండవచ్చు. లేదా అక్రమంగా సంపాదించి ఉండవచ్చు. అవన్నీ ఇప్పుడు అప్రస్తుతం!

"అదృష్టం వెనకే దురదృష్టంకూడా వెన్నంటి ఉంటుందనడానికి ఆయన జీవితమే ఓ తార్కాణం! డబ్బు సంపాదించాడు. పెళ్ళి చేసుకున్నాడు. అన్నీ ఇచ్చి భగవంతుడాయనకు సంతానభాగ్యం ప్రసాదించలేదు. అందుకే ఆ సిరి నన్ను వరించబోతోంది!"

"లక్షలకి అధికారి కాబోతున్న మీరు, ఇలా గాభరా పడుతూ అంత దూరంనించి ఇక్కడికెందుకు పరిగెత్తుకొచ్చారు?" అడిగాడు దుర్యోధన్ ఆశ్చర్యంగా.

ఆమె నిట్టూర్చి—"ఆ ఆస్తిని దక్కించుకోడానికి పెద్ద చిక్కు ఏర్పడింది మరి!" అంది.

"ఏమిటా చిక్కు?"

"చిన్నాన్న తన వీలునామాలో, తన ఆస్తికి ఎవరైతే వారసులుగా నిర్ణయించబడ్డారో, ఆ వ్యక్తి మా వంశ చిహ్నమైన ఒక వస్తువు కోర్టులో చూపించి, ఆస్తి స్వాధీన పత్రాలు స్వీకరించాలని షరతుపెట్టారు."

"ఏమిటా వస్తువు?" అడిగాడు దుర్యోధన్ ఆసక్తిగా.

"స్వర్ణ మయూరం!"

"బంగారు నెమలా?" దుర్యోధన్ కనుబొమలు ముడి పడ్డాయి.

"ఔను. ఆ బంగారు నెమలికి ఒక చరిత్ర వుంది. మా వంశ అగ్రజుడు ఆనాటి విజయనగర సామ్రాజ్యంలో ఒక సామంతరాజువద్ద సైన్యాధికారిగా ఉండేవారట. ఒకనాడు ఆ రాజుమీదికి దండెత్తివచ్చిన ఓ శత్రు సైన్యాన్ని తన అసమాన పరాక్రమాలతో ఓడించి తరిమినందుకు ఆ రాజుగారు ఆయనకా స్వర్ణ మయూరాన్ని, పెద్ద జాగీరు నూ జ్ఞాపకార్థం కానుకగా ఇచ్చారట.

"ఆనాటినించీ అది మా వంశ చిహ్నంగా ఒకరి తరవాత ఒకరికి చెందుతూ వస్తోంది!"

"ఇంకేం, ఆ మయూరాన్ని కోర్టులో చూపి మీ చిహ్నాన్న ఆస్తి స్వాధీనం చేసుకోవచ్చు కదా?"

"చేసుకోవచ్చు. కానీ, చిక్కంతా అక్కడే వుంది. ఆరేళ్ళక్రితం మా నాన్న ఆ స్వర్ణమయూరాన్ని అమ్మే శారు."

"ఎవరికి?"

"చరిత్రాత్మక వస్తువులు అమ్మిపెట్టే ఓ బ్రోకర్ ద్వారా ఓ కోటీశ్వరుడికి. అతను అండమాన్, నికోబార్ దీవుల కేంద్రమైన పోర్టుబ్లేయర్ నివాసిట. అతని పేరు గరుడప్పన్! కేరళీయుడు.

"అతనికి చరిత్రాత్మక వస్తువులు సేకరించే పిచ్చి ఉంది. మా స్వర్గ మయూరం చరిత్ర తెలియగానే, కోరినంత డబ్బు గుమ్మరించి దాన్ని కొనుక్కున్నాడు."

"ఇందులో సమస్య ఏముంది? మళ్ళీ అతని దగ్గర

ఆ మయూరాన్ని మీరు కొనుక్కో-వచ్చుకదా?"

"నో, నో! అదంత తేలికైన పని కాదు. ఆ వ్యక్తి ఒకసారి కొన్న వస్తువును మళ్ళీ అమ్మడం, తన ప్రతిష్టకి పెద్ద అరిష్టంగా భావిస్తాడుట. ఎట్టి పరిస్థితిలోనూ అతను దాన్ని ఎవ్వరికీ అమ్మడు.

"ఓహో, ఇప్పు డర్థమైంది. ఆ స్వర్ణ మయూరాన్ని ఎలాగైనాసరే మీరు తెచ్చిపెట్టాలనే మీరు నా దగ్గరికి వచ్చారన్నమాట!"

స్వప్నరాశి తలూపింది. "ఔను. మీరు కోరినంత ఫీజు చెల్లిస్తాను. ప్లీజ్, నాకు సహాయపడండి!"

"పోర్ట్ బ్లేయర్ లో నివసించే ఆ కోటీశ్వరుడు, యెట్టి పరిస్థితిలోనూ తను కొన్న వస్తువులు యెవరికీ అమ్మడు. అతనికి నచ్చజెప్పడానికి వ్యక్తిగతంగా అతనితో నాకెలాంటి పరిచయమూ లేదు. మరి ఎలా సంపాదించాలి దాన్ని? దొంగలించి తీసుకురమ్మంటారా?"

"ఎలా తీసుకురావాలో మీకు సలహా ఇచ్చేంతటి దాన్ని కాను. మీ మేధా సంపత్తిని ఉపయోగించి యెలాగైనా తీసుకురండి. లేకుంటే, నాకు రాబోయే ఆస్తంతా గంగపాలవుతుంది. ప్లీజ్!"

"సారీ! అయామ్ వెరీ సారీ మిస్ స్వప్నరాశి! నేను బాధ్యతగల ప్రైవేట్ డిటెక్టివ్ ని దొంగను కాను. మీరు ఏ కిరాయి దొంగనైనా కలుసుకుని మీ పని జరుపుకుంటే మంచిది!" అన్నాడు దుర్యోధన్ కాస్త తీక్షణంగా.

దాంతో వారి మొహాలు చిన్నబోయాయి. నిరాశతో లేచి, మౌనంగా చేతులు జోడించి బైటికి నడిచారు. గుమ్మంవరకూ వెళ్ళిన స్వప్నరాశి ఎందుకో చటుక్కున

వెనుదిరిగి, హాండ్ బ్యాగ్ తెరుస్తూ దుర్యోధన్ని సమీపించింది.

బ్యాగ్ లోంచి చిన్న నోట్ బుక్ తీసి, ఏదో రాసి, పేజీ చింపి అతనికిస్తూ, "ఇందులో ఇక్కడ మేము బస చేసిన హోటల్ పేరూ, రూం నెంబర్, ఫోన్ నెంబర్ ఉన్నాయి. మీ నిర్ణయం మార్చుకుంటే దయచేసి మాకు ఫోన్ చెయ్యండి" అని వెనుదిరిగి చకచక వెళ్ళిపోయింది.

ఆ కాగితంవైపు చూశాడు దుర్యోధన్.

హోటల్ కార్వాన్.

రూం నెంబర్ 156

ఫోన్ నెంబర్ 143.

## 2

"డిటెక్టివ్ దుర్యోధన్ గారు ఉన్నారా?" అన్న సుతిమెత్తని కంఠం విని తలెత్తి చూశాడు అర్జున్.

పాతికేళ్ళపైనా ఉంటాయామెకు. కొత్త టూత్ పేస్టు ట్యూబులా నిండుగా, తెల్లగా ఉంది. జరీ అంచు ఎర్రని షిఫాన్ చీర, అదే రంగు బ్లౌజు. చేతిలో ముదురు నీలం హాండ్ బ్యాగ్. కోల మొహం, కోటేరు ముక్కు. పెదాలకి ఎర్రని లిప్ స్టిక్. బాబ్ హేర్.

అందంగా నేవుందని చెప్పొచ్చు. సహజ సౌందర్యమూ, ఖరీదైన ఆ మేకప్ వల్లో అలా కనిపిస్తోంది. ఆమె వెనకే సుమారు ముప్ఫైఐదేళ్ళ వ్యక్తి నిల్చునున్నాడు. సన్నగా, పొడుగ్గా ఉన్నాడు. నల్లపాంటూ, దానిపై ఖరీదైన హాఫ్ బ్లూ జర్కిన్ వేశాడు.

బుల్ వర్కర్ కసరత్తు చేస్తాడేమో, మనిషి సన్నమే అయినా, చేతులు మాత్రం కండలు తిరిగి బలిష్టంగా ఉన్నాయి. కళ్ళకి అద్దాలు. కాళ్ళకి బూట్సు. ఫ్రెంచ్

కట్ గడ్డం పల్చని జుత్తు.

"ఉన్నారు. రండి" అన్నాడు అర్జున్ లేస్తూ.

ఇద్దరూ లోన అడుగుపెట్టారు. వాళ్ళని సోఫాలో కూర్చోబెట్టి, డిటెక్టివ్ దుర్యోధన్ని పిల్చుకొచ్చాడు అర్జున్.

ఇద్దరూ లేచి చేతులు జోడించి, "నమస్తే!" అన్నారు.

నమస్కారం చేసి, "కూర్చోండి" అన్నాడు దుర్యోధన్.

అందరూ కూర్చున్నాక, "మీతో ఓ ముఖ్యమైన పనుండి వచ్చాము" అందా యువతి నమ్రతగా.

తలూపి, "చెప్పండి" అన్నాడు దుర్యోధన్ సిగరెట్ తీసి నోట్లో పెట్టుకుంటూ.

ఆ యువతి నవ్వి—"ముందు మా గురించి పరిచయం చేసుకోవాలి. నా పేరు స్వప్నరాశి...."

డిటెక్టివ్ లిద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

నోట్లో పెట్టుకున్న సిగరెట్ తీసి, "ఏమన్నారూ?" అడిగాడు దుర్యోధన్.

అతని ప్రవర్తన ఆమెకు అసహజంగా తోచింది కాబోలు. "నా పేరు స్వప్నరాశి!" అంది మళ్ళీ.

తనలోని ఆశ్చర్యాన్ని వ్యక్తం కానివ్వకుండా తలూపి, "వీరెవరు?" అడిగాడు దుర్యోధన్ ఆ వ్యక్తి వైపు చూపుతూ.

"మా మేనేజర్ దివ్యనాథ్ గారు!"

మరోసారి మొహాలు చూసుకున్నారు డిటెక్టివ్ లు ఆశ్చర్యంగా. ఎంత విచిత్రం! గంట క్రితం ఇలాగే ఓ యువతీ! ఆమె వెంట ఓ వ్యక్తీ వచ్చారు. ఆ యువతి

కూడా తన పేరు స్వప్నరాశి అని చెప్పింది. తనతో ఉన్న వ్యక్తి పేరు కూడా దివ్యనాథ్ అని చెప్పింది. కాకతాళీయమంటే ఇదేనా?

ఆమె అవేమీ పట్టించుకోకుండా తన ధోరణిలో చెప్పుకుపోతోంది. "....మీ గురించి పత్రికల్లో చాలా చదివాం! మాకు మీ సహాయం కావాలి. మీమీద ఎన్నో ఆశలు పెట్టుకుని వరంగల్ నించి వచ్చాము."

తలూపి, "ఏ విషయంలో మా సహాయం కావాలి మీకు?" అడిగాడు దుర్యోధన్ ఆసక్తి కనబరుస్తూ.

"వరంగల్ లో మాకు ఓ టెక్స్టైల్ మిల్ ఉంది. మా నాన్నగారికి అక్కడి ధనిక వర్గంలో మంచి పరపతి ఉంది. మా ఇంట్లో తరతరాలుగా వస్తున్న, మా వంశ చిహ్నమైన ఓ వస్తువుండేది. దాన్ని మా నౌకర్లలో ఒకడు అతి చాకచక్యంగా దొంగలించి పారిపోయాడు. దాని ఖరీదు ఇప్పుడు పదిలక్షలకంటే తక్కువ ఉండదు."

"ఏమిటా వస్తువు?" అడిగాడు దుర్యోధన్ ఊపిరి బిగబట్టి.

"స్వర్ణమయూరం! ఐ మీన్ బంగారు నెమలి!!"

దిగ్భ్రాంతితో తమ ఆలోచనాశక్తి క్షణం స్తంభించి పోయినట్టు తోచింది డిటెక్టివ్ లకు. గంట వ్యవధిలో ఒకే పేరుగల ఇద్దరు యువతులూ, ఇద్దరు వ్యక్తులూ రావడం, ఇద్దరూ ఒకేరకం కథనం చెప్పడం కాకతాళీయం కాజాలదు. అంటే ఇద్దర్లో ఎవరో....

తన అనుమానం ముఖంలో వ్యక్తం కానివ్వకుండా జాగ్రత్తపడుతూ, "ఐసీ, ఐతే మీకా స్వర్ణ మయూరాన్ని వెతికిపెట్టాలన్నమాట!" అన్నాడు దుర్యోధన్.

ఈసారి ఆ వ్యక్తి కల్పించుకున్నాడు. "నో, నో!

మీకా శ్రమ అవసరంలేదు. అదెక్కడుందో మాకు తెలిసి పోయింది."

"మరి?"

"మీ పనల్లా ఆ నెమలి ఉన్న వ్యక్తినించి దాన్ని మాకు తెచ్చివ్వడమే! దీనికి మీరు కోరిన ఫీజు ఇచ్చు కుంటాము" అందా యువతి దీనంగా.

"ఎవరి దగ్గరుంది?"

"అండమాన్, నికోబార్ దీవుల కేంద్రమైన పోర్టు బ్లేయర్‌లో నివసించే ఓ కోటీశ్వరుడి దగ్గర! అతని పేరు గరుడప్పన్!

డిటెక్టివ్ లిద్దరూ మొహాలు చూసుకున్నారు మూడో సారి.

ఆమె తన ధోరణిలో చెప్పుకుపోతోంది. "అతనికి అమూల్యమైన వస్తువులు సేకరించే పిచ్చి ఉందిట. ముఖ్యంగా చరిత్రాత్మక వస్తువులు, ఆ దొంగ దగ్గరే అతను దాన్ని చవకగా కొనిపెట్టుకున్నాడు. అతను జగ మొండి అనీ, తను సేకరించిన ఏ వస్తువూ ఎట్టి పరిస్థితి లోనూ తిరిగి ఎవరికీ అమ్మడనీ తెలిసింది.

"అందుకే మీ శరణుజొచ్చాం! మాకు మీ మేధా సంపత్తిమీద పూర్తి గురి ఉంది. మీరు మా అభ్యర్థనను తప్పక స్వీకరిస్తారని నమ్ముతున్నాము."

"ఎక్కడో వరంగల్లో ఉన్న మీ ఇంట్లో ఆ బంగారు నెమలి దొంగతనం జరిగింది. ఇప్పుడది ఎవరిదగ్గరుందో కూడా తెలిసిపోయింది. పోలీసులకు ఫిర్యాదుచేస్తే వాళ్ళే నిక్షేపంగా దాన్ని ఆ వ్యక్తినించి స్వాధీనం చేసుకోవ డమేగాక, దొంగ వస్తువు కొనిపెట్టుకున్నందుకు చట్ట రీత్యా అతనిమీద చర్యకూడా తీసుకుంటారు కదా?

ఇంత దూరం మద్రాసువచ్చి నన్ను కలుసుకునే అవసరమే లేదు కదా?"

"అక్కడే ఉంది అసలు చిక్కు. అది మామూలు బంగారు నెమలికాదు. చరిత్రాత్మక వస్తువు. దేశ చరిత్రకు సంబంధించిన వస్తువులు ప్రభుత్వ సొత్తులుగా పరిగణింప బడతాయి. పురాతత్వశాఖకు వాటిపై పూర్తి హక్కు ఉంటుంది.

"ఆ మధ్య నిజాం నవాబు నగల గురించి తలెత్తిన దుమారం సంగతి నీకు తెలిసిందే కదా? ఆయన వారసులు ఆ నగల్ని అమ్మకానికి పెడితే, ఫ్రాన్స్‌కు చెందిన ఓ కోటీశ్వరుడు కోటానుకోట్లు గుమ్మరించి వాటిని కొనడానికి సిద్ధపడ్డాడు.

"ఐతే, ప్రభుత్వం జోక్యం చేసుకుని, కోర్టుద్వారా అమ్మకాన్ని ఆపేసింది. ఇప్పటికీ ఆ కేసు అమీతుమీ తేలకుండా న్యాయస్థానంలో నానుతోంది! అంతెందుకు, ఈ మధ్య కాశ్మీరులో అనాటి కాశ్మీరు మహారాజుకు చెందిన అపార నిధి నిక్షేపం బయల్పడి దేశంలో ఎంతటి సంచలనం సృష్టించలేదు?

మేము పోలీస్ కంప్లైంట్ ఇస్తే మా బంగారు నెమలి ప్రాశస్త్యం బైటపడి అనేక సమస్యలు ఉత్పన్నమౌతాయి. తరతరాలుగా మా వంశ చిహ్నంగా వస్తున్న ఆ వస్తువును ఎట్టి పరిస్థితిలోనూ వదులుకోడం మాకిష్టం లేదు."

"ఏమిటి దాని చరిత్ర? అభ్యంతరం లేకపోతే చెప్పండి. తెలుసుకోవాలని చాలా ఆసక్తిగా వుంది."

"చల్లకొచ్చి, ముంత దాచడం దేనికి? చెబుతాను. మేము వరంగల్ వాస్తవ్యులం! ఒకనాడు ఆ

నగరాన్ని ఓరగల్లుగా వ్యవహరించేవారు. అది ఆనాటి కాకతీయ సామ్రాజ్య రాజధాని. ఆ ఓరగల్లును ఏలిన రుద్రమదేవి గురించీ, ఆమె మనవడు ప్రతాపరుద్రుని గురించీ చరిత్రలో మీరు చదివే వుంటారు.

"మా వంశ అగ్రజుడు వారి రాజ్యంలో ప్రధాన కొత్వాలుగా పనిచేసేవారట. శాంతిభద్రతల పరిరక్షణలో ఆయన చేసిన సేవలకు మెచ్చి, చక్రవర్తి ఆయనకా స్వర్ణ మయూరాన్ని గౌరవ చిహ్నంగా బహూకరించారట. ఆనాటినించీ అది తరతరాలుగా మాకు చెందుతూ వస్తోంది. అందుకే పట్టుదలగా దానికోసం ఇంత ప్రయాస పడుతున్నాం!" అంటూ ముగించిందా యువతి.

దుర్యోధన్ మస్తిష్కం చురుగ్గా పనిచేయసాగింది. స్వర్ణ మయూరం గురించి ఆ ఇద్దరు యువతులూ చెప్పిన కథనంలో పెద్దగా తేడా కనిపించడంలేదు. మొదటి స్వప్నరాశి తాను విజయనగర వాస్తవ్యురాలనీ, తమ వంశ అగ్రజుడు విజయనగర సామంత రాజువద్ద సేనాపతిగా వుండేవాడనీ చెప్పింది.

ఈ స్వప్నరాశి తను వరంగల్ వాస్తవ్యురాలంటోంది. తమ వంశ అగ్రజుడు కాకతీయ రాజులవద్ద కొత్వాలుగా పనిచేసే వాడంటోంది. ఇద్దర్లో ఎవరు నిజం చెబుతున్నారు? అదే తెలుసుకోవాలి తను.

"ఆ రెండో స్వప్నరాశి రావడంతో దుర్యోధన్ కు ఆ విషయంలో స్వతహాగా చెప్పలేని ఆసక్తి యేర్పడింది. ఇద్దరు స్వప్నరాశులు! ఇద్దరికీ స్వర్ణమయూరం కావాలి. ఇద్దరు పోర్టుబ్లేయర్ లో నివసించే గరుడప్పన్ పేరు చెబుతున్నారు. సందేహంలేదు. వుంది. ఏదో మర్మం దాగి వుంది!

"సరే, మీ కేసు స్వీకరిస్తున్నాను. పోర్టుబ్లేయర్ వెళ్ళి ఆ బంగారు నెమలి తెచ్చివ్వడానికి నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడు తలూపుతూ.

దాంతో వారి కళ్ళు తళతళమన్నాయి.

"థాంక్యూ సర్!" అన్నారు ముక్తకంఠంతో.

"ప్రస్తుతం మీరెక్కడ బసచేశారు?"

"అపోలో హోటల్. థర్డ్ ఫ్లోర్. రూం నెంబర్ ట్వెంటీసెవన్!"

"ఓ.కే. ఇక మీరు వెళ్ళవచ్చు. రేపే నేను పోర్టు బ్లేయర్ బైలుదేరతాను" అన్నాడు దుర్యోధన్ సిగరెట్ పీక ఏష్ట్రేలో నొక్కుతూ.

ఖర్చుల నిమిత్తం అడ్వాన్సుగా ఎంతివ్వమంటారు?" అడిగాడు దివ్యనాథ్ నెంబర్ టూ.

చెప్పాడు అర్జున్.

బ్రీఫ్‌కేస్‌లోంచి డబ్బు తీసిచ్చి, రసీదు అందుకున్నాడతను.

తరవాత ఇద్దరూ లేచి, నమస్కారంపెట్టి బైటికి నడిచారు.

వాళ్ళలా వెళ్ళగానే టీపాయ్‌మీది టెలిఫోన్ ముందుకు లాక్కుని, హోటల్ కార్వాన్‌కు రింగ్ చేశాడు దుర్యోధన్. స్వప్నరాశి నెంబర్ వన్ ఆ హోటల్లోనే దిగినట్టు చెప్పింది.

"ఎస్, హోటల్ కార్వాన్ ప్లీజ్!" వినిపించింది అవతలినించి ఆపరేటర్ కంఠం.

"రూం నెంబర్ వన్ నాట్ సెవన్ కనెక్టు చెయ్యండి."

క్లిక్‌మన్న శబ్దం, "ఆఁ, మాట్లాడండి...."

"హలో! లాయర్ దివ్యనాథ్ స్పీకింగ్!" వినిపించింది అవతల.

"నేను డిటెక్టివ్ దుర్యోధన్ మాట్లాడుతున్నాను. ఉదయం మిమ్మల్ని డిసప్పాయింట్ చేసినందుకు క్షమించాలి. మీరు వెళ్ళాక నా నిర్ణయం మార్చుకున్నాను. మీరు కోరినట్టు పోర్టుబ్లేయర్ వెళ్ళి ఆ స్వర్ణ మయూరాన్ని తీసుకురావడానికి నిశ్చయించాం!"

"థాంక్యూ సార్! నేనూ, స్వప్నరాశీ నిజంగానే నిరాశపడ్డాం! సాయంత్రం విమానంలో తిరిగి వెళ్ళిపోడానికి తయారవుతున్నాం! మీ నిర్ణయం మారినందుకు చాలా సంతోషం! మీరు తిరిగి వచ్చేవరకూ మేమిక్కడే కాచుకుంటాం! ఎడ్వాన్స్‌గా మీకు డబ్బు కావలిస్తే చెప్పండి. ఇప్పుడే తెచ్చిస్తాను" అంటున్నాడతను ఉత్సాహంగా.

"మీరు రానవసరంలేదు. నా అసిస్టెంట్ వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాడు.... రేపు బైలుదేరి, సాధ్యమైనంత త్వరగా పని పూర్తిచేసుకుని, రెండు మూడు రోజుల్లో తిరిగి వచ్చేస్తాం!"

"అలాగే సార్! మీ అసిస్టెంట్ కోసం కాచుకుంటాను."

"ఓ.కే!" అంటూ రిసీవర్ దించి అర్జున్ వైపు తిరిగాడు దుర్యోధన్.

"ఈ కేసు విషయంలో నీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు సిగరెట్ తీస్తూ.

"వెరీ ఇంట్రెస్టింగ్ కేస్! నిజానికి ఈ రెండో స్వప్నరాశీ, దివ్యనాథ్‌లు రావడంతో నాలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది, ఇందులోని మిస్టరీ తెలుసుకోవాలని.

మొదటి దివ్యనాథ్ ఆ స్వప్నరాశి ఫామిలీ లాయర్ గా, రెండో దివ్యనాథ్ ఈమెగారి మేనేజర్ గా పరిచయమయ్యారు మనకు, చిత్రంగా లేదూ?"

తలూపాడు దుర్యోధర్. "ముందు మనం పోర్టుబ్లేయర్ నివాసి అయిన ఆ గరుడప్పన్ గురించి పూర్తి సమాచారం తెలుసుకుని మన కార్యక్రమాన్ని రూపొందించుకోడం మంచిది" అంటూ ఫోన్ రిసీవర్ ఎత్తి, క్రయిం బ్రాంచి హెడ్ క్వార్టర్స్ కు రింగ్ చేశాడు.

"హలో! ఇటీజ్ క్రయింబ్రాంచ్ హెచ్. క్యూ ప్లీజ్!" వినిపించింది అవతల ఆపరేటర్ కంఠం.

"ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డికి కనెక్టు చెయ్యండి" చెప్పాడు దుర్యోధన్.

రెండు నిమిషాలు నిశ్శబ్దం.

"హలో, ఇన్ స్పెక్టర్ యుగంధరరెడ్డి స్పీకింగ్!" వినిపించింది అవతల.

"నేను, డిటెక్టివ్ దుర్యోధన్ మాట్లాడుతున్నాను."

"చాలారోజుల తరవాత గుర్తొచ్చినట్టున్నాను. చెప్పండి. ఏం కావాలి?"

"సారీ రెడ్డిగారూ! పని వత్తిడివల్ల మిమ్మల్ని కలుసుకునే వీలు చిక్కలేదు. బావున్నారా?"

"ఏదో ఇలా ఘస్తున్నా! చెప్పండి అసలు విషయం!"

"పోర్టుబ్లేయర్ లో ప్రస్తుతం పోలీస్ ఇంఛార్జిగా ఎవరున్నారు?"

"డి.ఎస్.పి. స్థాయి అధికారి. పేరు తెలీదు. ఉండండి, కనుక్కుంటాను." ఐదు నిమిషాల నిశ్శబ్దానంతరం చెప్పాడు ఇన్ స్పెక్టర్. "డి.ఎస్.పి. మహేంద్ర

నాథ్ గారు!"

"థాంక్స్!" అంటూ రిసీవర్ దించి, ఆ తరవాత టెలిఫోన్ ఎక్స్ఛేంజికి రింగ్ చేసి, పోర్టుబ్లేయర్ పోలీస్ హెడ్‌క్వార్టర్స్‌కు అర్జంట్ లైటెనింగ్ కాల్ బుక్ చేశాడు దుర్యోధన్.

ఈమధ్య మనదేశం పంపిన అంతరిక్ష ఉపగ్రహాల చలవతో కమ్యూనికేషన్ సౌకర్యాలు చాలా శీఘ్రగతిన వృద్ధి చెందాయి. ఎప్పుడు, ఏ మూల ఎవరితో మాట్లాడా లన్నా పట్టుమని పదినిమిషాలు కూడా పట్టడం లేదు.

అరగంటలోపలే పోర్టుబ్లేయర్ కు లైన్ దొరికింది.

"హలో, హు ఈజ్ స్పీకింగ్?" వినిపించింది అవతల.

"మహేంద్రనాథ్ గారూ, నమస్కారం! నేను డిటెక్టివ్ దుర్యోధన్ మాట్లాడుతున్నాను మద్రాసు నించి."

"నేను మహేంద్రనాథ్‌ని కానండీ! ఆయన పి.ఏ. సబ్ ఇన్‌స్పెక్టర్ వాసుని. ప్రస్తుతం ఆయన ఊళ్ళోలేరు. ఇన్‌స్పెక్టర్ టూర్ మీద వెళ్ళారు. ముఖ్య విషయమైతే చెప్పండి. ఆయన వచ్చాక తెలియజేస్తాను."

"అబ్బే, అంత ముఖ్య విషయమేంకాదు పోర్టు బ్లేయర్లో నివసించే గరుడప్పన్ అనే వ్యక్తి గురించి కొంత ఇన్ఫర్మేషన్ కావాలి నాకు. అతని వ్యక్తిగత విషయాలతోసహా.

"ఆ వివరాలు నేనే ఇవ్వగలను. ఏభై ఏళ్ళుంటా యతనికి. పోర్టుబ్లేయర్‌లో బాగా పరపతి వుంది. సిలోన్, సింగపూర్, బర్మా దీవులకి అతని స్వంత మినీ ఓడలు నడుస్తాయి. నగర శివార్లలో విడిగా అతని ఎస్టేట్ వుంది.

"అందులోనే అతని పాతకాలపు కోటను పోలిన ప్యాలెస్ వుంది. ఆ ప్యాలెస్‌లో అతను సేకరించిన అనేక చరిత్రాత్మక వస్తువుల అందమైన మ్యూజియం కూడా వుందిట. ఎంతో ముఖ్య అతిథులు వస్తే తప్ప ఆ మ్యూజియం చూట్టానికి అతను ఎవ్వరినీ అనుమతించడుట.

"ఆ ఎస్టేట్ రక్షణార్థం అతను చిన్నసైజు సెక్యూరిటీ పటాలాన్ని పోషిస్తున్నాడు. దాదాపు అందరు ధనవంతుల లాగే అతనిలోనూ రెండు బలహీనతలున్నాయి. మగువా, మధువూ!" అంటూ నవ్వాడు ఇన్‌స్పెక్టర్.

"థాంక్స్! వీలైతే త్వరలోనే మేమక్కడికి వస్తున్నాం! అప్పుడు మహేంద్రనాథ్ గార్ని కలుసుకుంటాము. ఆయనతో చెప్పండి నా గురించి. మద్రాసు క్రైంబ్రాంచి ఇన్‌స్పెక్టర్ యుగంధర రెడ్డి నా ఆప్తమిత్రుడు."

"తెలుసు. ఒకటి రెండుసార్లు మీ గురించి విన్నాను."

"వివరాలు తెల్పినందుకు మరోసారి థాంక్స్."

"మెనన్ నాట్ ప్లీజ్!" అవతల క్లిక్‌మంది.

రిసీవర్ దించి, పచార్లు ప్రారంభించాడు దుర్యోధన్. ఆ పచార్లు పరమార్థం అర్జున్‌కు బాగా తెలుసు. అందుకే మౌనంగా చూస్తూ కూర్చున్నాడు.

అరగంట తరవాత ఆగి, అతనివైపు తిరిగాడు దుర్యోధన్. "ఈ కేసులో మనం ముందుకు సాగడానికి ఓ పథకం రూపుదిద్దుకుంది నాలో. పోర్టుబ్లేయర్ వెళ్ళాక అక్కడ మనం అమలు జరపాల్సిన కార్యక్రమంలో ఓ లేడీ ఇన్వెస్టిగేటర్ సహకారం అవసరం కావచ్చు.

"మద్రాసులో ప్రాక్టీసుచేసే లేడీ ఇన్వెస్టిగేటర్‌లో షీలకు మంచి పేరుంది. ముందు నువ్వు కారావాన్ హోటల్ కెళ్ళి, దివ్యనాథ్ సెంబర్ వన్ని కలుసుకో.

అతనివద్ద అడ్వాన్సు రూపంలో ఫిఫ్టీ పర్సెంట్ ఫీజు వసూలు చేసి, అక్కణ్నించి తిన్నగా షీల ఆఫీసుకెళ్ళి, ఆమె నిక్కడికి తీసుకురా. ముగ్గురం కలిసి పథకాన్ని ఫైనల్ చేద్దాం!"

తలూపి లేచాడు అర్జున్.

# 3

ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో పోర్టుబ్లేయర్ ఏర్‌పోర్టులో దిగింది విమానం! ముగ్గురు డిటెక్టివ్‌లూ తమ తమ లగేజీలతో ఏర్‌స్టేషన్ బైటికి నడిచి టాక్సీ ఎక్కారు.

అక్కడ ఒకేఒక టూరిస్టు హోటల్ వుంది. బ్లూ స్కై! ప్రోగ్రాం ప్రకారం మద్రాసునించి ముందే కేబుల్ పంపి ఆ హోటల్లో తమకోసం మారు పేర్లతో రెండు గదులు బుక్ చేసుకోడంవల్ల టాక్సీ ఎక్కి తిన్నగా అక్కడికి చేరుకున్నారు డిటెక్టివ్‌లు.

"నా పేరు చక్రపాణి! ఇరవైతొమ్మిదో తేదీన మద్రాసునించి కేబుల్ పంపాం, రెండు గదులు బుక్ చెయ్యమని. అందిందా?" అడిగాడు దుర్యోధన్ రిసెప్షనిస్టుని.

అతను రిజిష్టర్ తిరిగేసి తలూపాడు. "అందింది. సెకండ్ ఫ్లోర్లో త్రీ నాట్ సిక్స్, త్రీ నాట్ సెవన్ రూములు" అంటూ వెయిటర్ని పిల్చి, వారి సామాను ఆ గదుల్లోకి తీసికెళ్ళమని చెప్పాడు.

హాల్లో తిరుగుతున్న మగాళ్ళు ఒకటికి రెండుసార్లు తమవెంట వున్న షీలను పరకాయించి చూడటం క్రీగంట గమనించాడు దుర్యోధన్. ఆమె అందం అటువంటిది. ఒక్కసారి చూసినంతమాత్రాన తనివితీరనిది. అందంలో

పాటు అపార తెలివితేటలూ, ప్రమాదాల నెదుర్కొనే ధైర్యసాహసాలు కూడా ఆమె సొత్తు!

వివరాలు రాయడానికి రిజిష్టర్ని దుర్యోధన్ ముందుకు తోశాడు రిసెప్షనిస్టు.

పేరు చక్రపాణి, వృత్తి వ్యాపారం, నివాసం మద్రాసు. పోర్టుబ్లేయర్ వచ్చింది విహారయాత్రకు. అని రాసి సంతకం పెట్టాడు దుర్యోధన్.

అరుణ్ తన పేరు వరహాలరావనీ, బిజినెస్ పనిమీద అక్కడికి వచ్చానని రాసి సంతకం పెట్టాడు.

రెండో గది కేటాయించుకున్న షీల తన పేరు మీనాక్షి, వృత్తి లెక్చరర్, మద్రాసు నించి విహార యాత్ర నిమిత్తం వచ్చినట్టు రాసింది.

అద్వాన్సు పుచ్చుకున్నాక కీ బోర్డులోంచి గదుల తాళంచెవులు తీసి వారి కందించాడు రిసెప్షనిస్టు.

"హోటల్ తరఫున మాకోసం ఓ అద్దె కారు ఏర్పాటు చెయ్యగలరా?" అడిగాడు దుర్యోధన్.

అతను తలూపి, "ఇక్కడ అద్దె కార్లిచ్చే కంపెనీ ఒకటే వుంది. ఫోన్ చేసి కనుక్కుంటాను" అన్నాడు.

"థాంక్స్! మేము పైన ఎదురుచూస్తుంటాం! అరగంట తరవాత ముగ్గురికీ టిఫిన్లు పంపించండి" అంటూ లిఫ్ట్ వైపు నడిచాడు దుర్యోధన్.

గదుల్లో సామాను సర్దుకుని, స్నానాలు కానిచ్చి, బట్టలు మార్చుకోగానే ట్రాలీలో టిఫిన్లు తీసుకొచ్చాడు బేరర్. ముగ్గురూ ఒకే గదిలో కూర్చుని టిఫిన్ లారగిస్తుండగా, కిందినించి రిసెప్షనిస్టు ఫోన్ చేశాడు కారు వచ్చేసిందని.

టిఫిన్ పూర్తయ్యాక కిందికెళ్ళాడు దుర్యోధన్.

"డ్రైవర్ కావాలా?" అడిగాడు రిసెప్షనిస్టు.

"అవసరంలేదు."

"ఐతే ఇతనివెంట పోర్చ్‌లోకెళ్ళండి. కారు చూపిస్తాడు" అంటూ అక్కడే నిల్చున్న ఓ వ్యక్తిని చూపాడు రిసెప్షనిస్టు.

డ్రైవర్ వెంట బైటికెళ్ళి, పార్కింగ్ ప్లేస్‌లో ఆగివున్న చాక్లెట్ రంగు ఆస్టిన్ కారు చూశాడు దుర్యోధన్.

"మంచి కండిషన్‌లో వుంది. టాంకునిండా పెట్రోల్ పోయించుకొచ్చాను" అన్నాడతను.

తలూపి, తిరిగి రిసెప్షనిస్టు దగ్గరికెళ్ళి, డిపాజిట్ పైకం చెల్లించి, లిఫ్ట్‌వైపు నడుస్తూ రిస్టువాచీ చూసుకున్నాడు దుర్యోధన్. పదకొండు గంటలు.

"కారు వచ్చేసింది. ఇక ఆలస్యం చెయ్యకుండా మన పథకాన్ని అమలు చెయ్యడం మంచిది. అర్జున్! నువ్విక్కడే మాకోసం ఎదురుచూస్తూ వుండు. నేనూ, షీలా గరుడప్పన్ని కలుసుకోడాని కెళుతున్నాం!" అన్నాడు గదిలో అడుగుపెట్టి.

తలూపాడు అర్జున్.

షీల లేచి నిల్చుంది.

ఆమెతో కిందకెళ్ళి కార్లో కూర్చున్నాక, సిటీ మ్యాప్ విప్పాడు దుర్యోధన్. అక్కడి రోడ్లనూ, ముఖ్య ప్రదేశాలనూ పరిశీలిస్తూ, నగరం వెలపల వున్న గరుడప్పన్ ఎస్టేట్ దారిని క్షుణ్ణంగా మననం చేసుకుని, కారు స్టార్టుచేశాడు.

నగరంచుట్టి అక్కడికి చేరేసరికి గంటపట్టింది.

ఎత్తయిన ప్రదేశంలో పాతకాలపు రాజ నివాసంలా

కట్టిన ప్యాలెస్ అది. దాని చుట్టూ నిలువెత్తు ప్రహరీ గోడ. పెద్ద ఇనపఊచల గేటు. గేటుకిరుపక్కలా తుపాకులు పట్టుకుని, ఖాకీ యూనిఫాంలో కాపలా కాస్తున్న గార్డ్స్!

కారు గేటును సమీపించగానే, ఓ గార్డు దగ్గరికి వచ్చి, "ఎవరు కావాలి?" అనడిగాడు.

"గరుడప్పన్ గార్ని కలుసుకోడానికి వచ్చాం!" అన్నాడు దుర్యోధన్.

"మీ పేరు?"

"చక్రపాణి!"

"ఈ సమయంలో ఈ పేరుగల వారెవరూ ఇక్కడికి రాబోతున్నట్టు లోపలినించి మాకు వర్తమానం అందలేదే?"

"మేము యాత్రీకులం! అండమాన్, నికోబార్ దీవులు దర్శించడానికి వచ్చాం! గరుడప్పన్ గారి గురించి విన్నాక ఒకసారి వార్ని చూడాలనిపించింది."

గార్డు నఖశిఖ పర్యంతం వారిని పరీక్షగా చూడసాగాడు. షీలని చూస్తున్నప్పుడు అతని కళ్ళు తళతళ మెరవడం గమనించాడు దుర్యోధన్.

"ఉండండి. లోనికెళ్ళి కనుక్కొస్తాను. పేరేమిటన్నారూ?"

"చక్రపాణి! ఈమె మిస్ మీనాక్షి!"

అతను వెనుదిరిగి లోనికెళ్ళి, ఐదు నిముషాల తరవాత తిరిగివచ్చి, "రండి!" అన్నాడు గేటు తెరుస్తూ.

పాచిక పారింది! తనవెంట అందమైన అమ్మాయి ఉన్నట్టు తెలియగానే లోపలినించి తప్పక ఆహ్వానం వస్తుందని దుర్యోధన్‌కి తెలుసు. గేటుగుండా నెమ్మదిగా

కారుని కంపౌండ్లోకి పోనిచ్చాడు.

బృందావన్ గార్డెన్ని పోలిన కంపౌండది. ఎటు చూసినా రంగు రంగుల పూలతో విరబూసిన రకరకాల మొక్కలు, అందంగా కట్ చేసిన క్రోటన్ వరసలు. పోర్టికోని సమీపించేసరికి ఫుల్ సూటులో ఉన్న ఓ వ్యక్తి, అతని పక్కనే పోలీస్ ఇన్స్పెక్టర్ని పోలిన ఖాకీ యూనిఫాంలో ఉన్న పొడవాటి, వెడల్పాటి వ్యక్తి నిల్చుని కనిపించారు. అతని తోలుబెల్టు పౌచ్లో రివాల్వర్ వేలాడుతోంది.

బహుశా, అతను ఆ ఎస్టేట్ సెక్యూరిటీ ఇన్స్పెక్టర యుంటాడు, అనుకుంటూ పోర్టికోలో కారాపాడు దుర్యోధన్. వారిని చూడగానే సాదరంగా స్వాగతం పలికాడు ఫుల్ సూటులో వున్న వ్యక్తి. కారు దిగి, అతనికి షేక్హేండ్ ఇచ్చాడు దుర్యోధన్. శీల చేతులు జోడించింది.

"నా పేరు సదాశివం. ఈయన మేజర్ పైగల్. ఎక్స్ ఆర్మీ. ప్రస్తుతం మా సెక్యూరిటీ అధికారిగా పనిచేస్తున్నారు. నేను ఈ ఎస్టేట్ మేనేజర్ని!" అంటూ తమని పరిచయం చేసుకున్నాడతను.

"మేము యాత్రీకులం! ఇక్కడికి వచ్చాక తెలిసింది. గరుడప్పన్ గారికి చరిత్రాత్మక వస్తువులు సేకరించి తన హోమ్ మ్యూజియంలో భద్రపరిచే హాబీవుందని. అప్పటి నించీ మిస్ మీనాక్షి ఒక్కసారి ఆ మ్యూజియం చూడాలన్న కోరికతో ఉవ్విళ్ళూరుతోంది. మీరామెకా అవకాశం కల్పించగలరా?" అడిగాడు దుర్యోధన్.

అతనా మాటలు వింటున్నాడో లేదో తెలీదుగానీ, శీలని మాత్రం మెరిసే కళ్ళతో రెప్పవెయ్యకుండా

చూస్తున్నాడు. "తప్పకుండా మిస్టర్ పాణీ! గరుడప్పన్ గారు ప్రత్యేకమైన వ్యక్తులకే తన మ్యూజియం చూపించడాని కనుమతిస్తారు.

సెక్యూరిటీగార్డు వచ్చి చెప్పగానే నేనాయన పర్మిషన్ తీసుకున్నాను. తన మ్యూజియం మీకు చూపించమని చెప్పారు, రండి. లోపలికి రండి" అంటూ వెనుదిరిగాడు సదాశివం.

అతన్ని అనుసరిస్తూ పోర్టికో మెట్లెక్కి వరండామీది కెళ్ళారిద్దరూ. వరండా కుడిపక్కన ఓ గ్లాస్ క్యాబిన్ వుంది. అందులో ఓ టేబిల్, రెండు కుర్చీలూ వేసి వున్నాయి. కేబిన్ తలుపు దగ్గర ఇద్దరు రక్షకభటులు తుపాకులతో సహా నిల్చునున్నారు.

దాన్నిబట్టి ఆ ప్యాలస్ రక్షణ ఏర్పాట్లు చాలా పటిష్టంగా వున్నాయని అర్థం చేసుకున్నాడు దుర్యోధన్.

"క్షమించండి. ఇక్కడి ఆచారం ప్రకారం మీవద్ద విలువైన వస్తువులు, ఐ మీన్ వజ్రపుటుంగరాలూ, ఇతర వెండి, బంగారు వస్తువులేవైనా వుంటే వాటి వివరాలు ఈ క్యాబిన్‌లో పొందుపర్చాలి. ఆయుధాలేవైనావుంటే మాకప్పగించి లోనికెళ్ళాలి.

లోపలినించి బైటికి వచ్చాక, చాలా నిశితంగా మిమ్మల్ని సెర్చ్ చెయ్యవలసి వుంటుంది. గరుడప్పన్‌గారి విషయంలో తప్ప, ఆయన బంధువులుగానీ, ఎస్టేట్ మేనేజర్ సదాశివంగారుగానీ లోపలినించి పూచికపుల్ల కూడా బైటికి తీసికెళ్ళడానికి వీల్లేదు" అన్నాడు సెక్యూరిటీ అధికారి.

"కష్టపడి సంపాదించిన వస్తువుల్ని కాపాడుకునే హక్కు ప్రతి ఒక్కరికీ వుంది. మీ ఏర్పాట్లను శిరసావ

హించడమేగాక హార్రిష్ సున్నాను కూడా!" అంటూ తన వేలిమన్న వజ్రపు టుంగరాన్ని, చేతిగడియారానిమన్న బంగారు పట్టానూ, జేబులోంచి వెండి సిగరెట్ కేస్, రివాల్వర్ తీసి, రిజిష్టర్లో పొందుపర్చి సంతకం పెట్టాడు దుర్యోధన్. తరువాత రివాల్వర్ని అతని కప్పగించాడు.

షీల తన చేతి బంగారు గాజుల్నీ, వజ్రపుటుంగరాన్నీ, చెవి దుద్దుల్నీ, రత్నాల నెక్లెస్‌నీ, రాయించి సంతకం పెట్టింది. తరవాత సెక్యూరిటీ సిబ్బంది ఇద్దర్నీ నిశితంగా పరిశీలించి, వేరే ఆయుధాలేవీ లేవని నిర్ధారించుకుని, లోపలి కెళ్ళడాని కనుమతించారు.

సదాశివం వెంట ప్యాలెస్‌లో అడుగుపెట్టారిద్దరూ. క్షణంపాటు మరో యుగంలో ప్రవేశించినట్టు తోచింది ఇద్దరికీ. అక్కడి వస్తువులూ, వాటిని అలంకరించినతీరూ చూస్తుంటే, పదమూడవ శతాబ్దపు రాజుల కాలంలో ఉన్నామా? అన్న భ్రాంతి కలిగింది.

"ముందు మీ రేం చూడా లనుకుంటున్నారు?" అడిగాడు సదాశివం షీలని.

"నాకేం తెలుసండీ? మీ రేది చూపినా, చూసి ఆనందించడం మా పని!" అంది షీల వ్యంగ్యంగా నవ్వుతూ.

"నా ఉద్దేశంలో ముందు మీరు పాలరాతి విగ్రహాలు చూసితీరాలి. గరుడప్పన్ గారు వాటిని లక్షలక లక్షలు ఖర్చుపెట్టి సేకరించారు. అందులో కొన్ని రోమన్ రాజుల కాలంనాటివీ వున్నాయి. వాటి పనితనం అద్భుతమైనదే కాదు, అద్వితీయమైనది కూడా!"

"ఐతే, చూసితీరాల్సిందే!"

"చక్రపాణిగారూ! మీకూ చూడాలని ఆసక్తిగా

ఉందా?"

తలూపాడు దుర్యోధన్.

వాళ్ళను వెంటబెట్టుకుని మ్యూజియం హాల్లోకి తీసి కెళ్ళాడు సదాశివం!

అక్కడ షో కేసుల్లో, క్రమపద్ధతిలో అమర్చిన చిత్ర విచిత్రమైన వస్తువులు చూసి ఇద్దరి కళ్ళూ విప్పారాయి.

పుర్రెకో బుద్ధీ, మనిషికో అలవాటూ వుంటాయంటారు. కొందరికి పోస్టల్ స్టాంపులు సేకరించి ప్రాణప్రదంగా భద్రపరిచే అలవాటుంటే, మరికొందరికి తాతల నాటి నాణాలు సేకరించి సంతోషించే పిచ్చి వుంటుంది.

ఐతే, గరుడప్పన్ అభిరుచి చాలా ఖరీదైనది. అమూల్యమైనది. పాలరాతి ప్రతిమలనించీ, ప్రాచీన కాలపు పిన్నీసు వరకూ ప్రతి వస్తువూ అందంగా అమర్చివున్నాయక్కడ. అన్ని వస్తువులకిందా, అవి ఏ కాలంనాటివో, ఎవరికి చెందినవో, వాటి చరిత్ర ఏమిటో వివరించే ప్లేట్స్ పెట్టి ఉన్నాయి.

ఐతే, ఎక్కడా తమకావలసిన బంగారు నెమలి జాడ కనిపించకపోవడం ఆశ్చర్యాన్ని కలిగించింది డిటెక్టివ్ లకు. దాని గురించి అడగడం కొరివితో తల గోక్కున్నట్టే!

అందుకే మౌనంవహించి, కాసేపు అవీ ఇవీ చూసినట్టు నటించి, "రండి సదాశివంగారూ! మీనాక్షి నింపాదిగా అన్నీ చూస్తారు. అంతవరకూ మనం బైట కూర్చుని మాట్లాడుకుందాం!" అన్నాడు దుర్యోధన్.

తలూపి, ఆమెకు అన్నీ వివరంగా చూపించమని ఓ నౌకర్ని ఆదేశించి, దుర్యోధన్ వెంట బైటికి నడిచాడు సదాశివం. ముందు హాలుమధ్య మెత్తని మఖమల్

సోఫాలు వేసివున్నాయి.

"కూర్చోండి!" అంటూ ఓ సోఫాలో కూలబడ్డాడు సదాశివం.

దుర్యోధన్ కూర్చున్నాక, "ఏం తీసుకుంటారు? విస్కీయా లేక...." అడిగాడు.

"నో....నో! ఇప్పుడలాంటి డ్రింక్స్ తీసుకునే మూడ్ లేదు" అన్నాడు దుర్యోధన్ వారిస్తూ.

"ఐతే, కాఫీ తీసుకోండి" అంటూ చప్పట్లు చరిచి నౌఖర్లకు కాఫీలు తెమ్మని చెప్పి, "మీరేమీ అనుకోకుంటే ఓ వ్యక్తిగత ప్రశ్న అడగా లనుకుంటున్నాను" అన్నాడు సదాశివం రహస్యంగా.

"అడగండి."

"మిస్ మీనాక్షి మీ కేమౌతారు?"

సదాశివం వేసిన ఆ ప్రశ్నతో దుర్యోధన్ కనుబొమలు ముడిపడ్డాయి. "ఏమీ కాదు. మద్రాసునించి మే మిద్దరం ఒకే విమానంలో వచ్చాం! ఇక్కడ ఒకే హోటల్లో బస చెయ్యడంవల్ల పరిచయం ఏర్పడింది.

"ఆమెకి చరిత్రాత్మక వస్తువులు చూసి ఆనందించే పిచ్చి వుంది. మీ మ్యూజియం గురించి వినగానే చూసి తీరాలని పట్టుబట్టింది. ఆడది ఒంటరిగా రాలేదుకదా, నన్ను తోడురమ్మంటే వచ్చాను. అంతకిమించి ఆమెతో నా కెలాటి సంబంధం లేదు."

"అంతేనా! నేను మరేదో అనుకున్నాను. వెరీగుడ్! ఇక దాగుడుమూతలు అనవసరం! మీరు దీనికి యెంత తీసుకుంటారు?"

"దేనికి?" అడిగాడు దుర్యోధన్ ఆశ్చర్యంగా.

"ఐ మీన్, ఆమె విషయంలో మీరెంత తీసుకుం

టారు?"

కోపంతో దుర్యోధన్ మొహం జేవురించింది. "మిష్టర్ సదాశివం! కాస్త మర్యాదగా మాట్లాడండి. ఆమె నా ఆస్తి కాదు, అమ్మడానికి. ఇంటికి వచ్చిన అతిథులకు మీరిచ్చే మర్యాద ఇదేనా?"

"ఛ....ఛ! మీరు అనవసరంగా కోపం తెచ్చుకుంటున్నారు. నా మాటల్లోని అంతర్యాన్ని ఇంకా మీరు అర్థం చేసుకోలేదు. నా ఉద్దేశమల్లా ఆమె విషయంలో నిశ్శబ్దంగా ఉండటానికి మీరేం తీసుకుంటారని!

గరుడప్పన్ గారికి అమూల్య వస్తువులు సేకరించడంతో బాటు అందమైన అమ్మాయిల పిచ్చి కూడా వుంది. మీనాక్షిది నిజంగా మగాణ్ని పిచ్చెక్కించే అందం! ఆమె మీకేమీ కాదని చెప్పారు కదా, మిగతా విషయాలు మాకు వదిలెయ్యండి. మీరు కేవలం నోరు విప్పకుండా వుండటానికి ఐదు వేలు ఇవ్వబడతాయి. ఏమంటారు?"

వళ్ళు మండిపోయింది డిటెక్టివ్ కు. "ఆమెతో నాకెలాటి సంబంధం లేదన్నది నిజమే! కానీ, ఆమె నన్ను నమ్మి, తోడు రమ్మంది. నైతిక దృష్ట్యా ఆమెను కాపాడే బాధ్యత నా పైన ఉంది."

"ఒక పరాయి యువతికోసం ఇలాటి బంగారు అవకాశాన్ని వదులుకుంటున్నారు మీరు. ఆమె కొంతకాలం ఈ ప్యాలెస్ లో గడిపి వెళ్ళేటప్పుడు నిజంగా ఎంతో సంతోషిస్తోంది. కారణం, అప్పుడు ఆమెవద్ద కావలసినంత డబ్బూ, నగలూ వుంటాయి. మీపట్ల ఆమెకు యెలాటి కోపమూ వుండదు. గరుడప్పన్ గారు తనతో గడిపిన స్త్రీని బంగారంలో తూచి మరీ పంపి

స్తారు. ఆలోచించండి...."

చివాల్న లేచి నిల్చున్నాడు దుర్యోధన్. "సదా శివం! ఇక హద్దుదాటింది. మర్యాదగా మీ నాతిని పిలి పించండి. ఇహ ఒక్క క్షణంకూడా ఉండదలుచుకోలేదు" అన్నాడు పళ్ళుకొరుకుతూ.

సరిగ్గా అదే క్షణంలో వెనకనించి ఓ కంఠం విని పించింది. "సదాశివం! మా అతిథికి కోపం తెప్పించి నువ్వు చాలా తప్పుచేశావు."

ఛటుక్కున వెనుదిరిగి చూశాడు దుర్యోధన్.

ఏడైై ఏళ్ళుంటాయతనికి. అజానుబాహుడు. కారు నలుపు. లావుపాటి పెదాలు. మొహంమీద స్ఫోటకం మచ్చలు. పైకి దువ్వుకున్న పల్చని జుత్తు. ఖరీదైన సిల్కు చొక్కా. జరీ అంచు పట్టులుంగీ. చేతివేళ్ళకి ధగధగా మెరిసే వజ్రపుటుంగరాలు.

అతనే గరుడప్పన్!

"కూర్చోండి మిస్టర్ చక్రపాణీ! సదాశివం కారణంగా మీ మనసు నొచ్చుకుంటే అందుకు నేను క్షమా పణ చెప్పుకుంటున్నాను. మీ మాటల్నిబట్టి మా నివేదన మీకు నచ్చినట్టు తెలుస్తోంది" అన్నాడు గరుడప్పన్ ఓ సోఫాలో కూలబడుతూ.

"ఔను. మేము కేవలం మీ మ్యూజియం చూడ్డానికి వచ్చాం! ఈయన మాపట్ల ఇంత అమర్యాదగా ప్రవర్తి స్తారని ఊహించలేదు" అన్నాడు దుర్యోధన్ తిరిగి కూర్చుంటూ.

"ఇందులో అమర్యాద ఏమీలేదు మిస్టర్ చక్రపాణీ! నాకు అందమైన అమూల్య వస్తువులు సేకరించడంతో బాటు, సజీవమైన అందాన్ని ఆస్వాదించే అలవాటుంది.

డబ్బంటే వాడు లక్ష్యంలేదు. అలాగే మీకూ ఆమెపట్ల ఎలాటి బాధ్యతా లేదు."

"నైతికంగా ఆమెని కాపాడే బాధ్యత నాపైన వుంది" అన్నాడు దుర్యోధన్ కటువుగా.

గరుడప్పన్ నవ్వి — "మీరు పొరబడుతున్నారు. ఆమెకిక్కడ యెలాటి ఆపదా వుండదు. ఆమె సగౌరవంగా కొన్నాళ్ళు మా ప్రత్యేక అతిథి రూపంలో వుంటుంది. ఇక మీ విషయం, ఐదువేల ఆఫర్ని పెంచి పదివేలు చేస్తాను. ఏమంటారు?"

"అయామ్ సారీ! ఇక ఈ విషయంలో మీతో ఏమీ మాట్లాడదలచుకోలేదు" అన్నాడు దుర్యోధన్ దృఢస్వరంతో.

గరుడప్పన్ కనుబొమలు ముడివడ్డాయి. "అంటే మీ దృష్టిలో డబ్బుకు ఎలాంటి ప్రాధాన్యత లేదన్నమాట?"

"లేదు!"

"డబ్బుకు బదులు ఇంకేదైనా వస్తువు కావాలంటే, నేను సంతోషంగా ఇవ్వగలను. ఉదాహరణకి, నా మ్యూజియంలోని అమూల్యమైన బంగారు నెమలి ఇస్తే రాజీపడగలరా?"

గరుడప్పన్ అన్న మాటతో పక్కన ఆటంబాంబు పేలినట్టు అదిరింది గుండె. కాకతాళీయంగానే అతనా బంగారు నెమలి ప్రస్తావన ఎత్తాడా? లేక ....

"నేను మిమ్మల్ని చాలా ఆశ్చర్యపర్చినట్టున్నాను, మిష్టర్ పాణీ! ఇందులో దిగ్భ్రాంతి చెందాల్సిన పని లేదు. నా చేతులూ, చెవులూ చాలా పొడవైనవి. కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అంటూ లేచి లోపలికి నడిచాడు గరుడప్పన్.

"బంగారు నెమిలేమిటి? ఎక్కడుందది? మ్యూజియంలో కనిపించలేదే?" అడిగాడు దుర్యోధన్ ఆశ్చర్యాన్ని అభినయిస్తూ.

సదాశివం నవ్వి—"అటువంటి విలువైన వస్తువులాయన తమ ప్రత్యేక లాకర్ రూంలో భద్రపరుస్తారు. అతిథులకు వాటిని చూపాలంటే ఆయనే స్వయంగా చూపాలి. ఆ లాకర్ రూం తెరవడం అన్యులకసాధ్యం! పేరుమోసిన బ్యాంకుల్లో కూడా అటువంటి బలిష్టమైన లాకర్ గది లేదనుకుంటాను. బ్రహ్మాండమైన ప్రేలుడు శక్తిగల డైనమైట్స్ కూడా దాన్ని చెక్కుచెదర్చలేవు" అన్నాడు.

అంతలో గరుడప్పన్ వచ్చేశాడక్కడికి. అతని చేతిలో తళతళ మెరుస్తున్న బంగారు నెమలిని చూడగానే దుర్యోధన్ కళ్ళు విప్పారాయి. అతను సోఫాలో కూర్చుని, దాన్ని దుర్యోధన్‌కిస్తుండగా, మధ్యలో కలగచేసుకున్నాడు సదాశివం!

"మిస్ మీనాక్షి మ్యూజియంలో శిల్పాలు చూస్తోంది. ఆమెకూడా దీన్ని చూస్తే ఆనందించవచ్చు."

"ఔను! తీసికెళ్ళి చూపెట్టిరా!" అంటూ నెమలిని సదాశివాని కందించాడు గరుడప్పన్.

అతను లేచి, లోపలికెళ్ళి పది నిమిషాల్లో తిరిగి వచ్చాడు.

"ఏమంది మీనాక్షి?" అడిగాడు గరుడప్పన్ నవ్వుతూ.

"అటువంటి అసమాన కళాఖండాన్ని చూసినందుకు ఎంతగానో కృతజ్ఞతలు చెప్పమంది!" అంటూ నెమలిని తిరిగి అతని కందించాడు సదాశివం.

"కేవలం చూసినందుకే ఆమె అంతగా కృతజ్ఞతలు చెప్పుకుంటే, దీన్ని బహుమతిగా స్వీకరిస్తున్న చక్రపాణి యేమంటాడో చూడాలి" అంటూ నెమలిని దుర్యోధన్ కందించాడు గరుడప్పన్.

నిండుగా పురివిప్పి, గుండ్రని గ్లోబ్ మీద నిల్చున్న నెమలి అది! గ్లోబ్ కింద టేబిల్ మీద అమర్చడానికి అనువుగా నాలుగు మూలల దిమ్మె వుంది. అంతా బంగారమే! నెమలి రెండు కళ్ళ స్థానంలో రెండు యెర్రని వజ్రాలు మెరుస్తున్నాయి.

"డిటెక్టివ్ దుర్యోధన్! ఈ బంగారు నెమలిని తెచ్చిస్తే స్వప్నరాశి ఏమిస్తానంది మీకు?" అన్న గరుడప్పన్ ప్రశ్నతో పిడుగు పడ్డట్టు అదిరిపడ్డాడు దుర్యోధన్.

"అలా ఆశ్చర్యపడకండి. నేను ముందే చెప్పాను. నా చేతులూ, చెవులూ చాలా పొడవైనవని. మీ వెంట వచ్చిన మిస్ మీనాక్షి యెవ్వరో కూడా నాకు తెలుసు. మద్రాసులో పేరుపొందిన లేడీ ఇన్వెస్టిగేటర్ షీలా కదూ?" అడిగాడు గరుడప్పన్.

ఇక దాచి లాభంలేదు. అతనికంతా తెలుసు. అతను సామాన్యుడు కాదనీ, అవులిస్తే పేగులు కొలిచే ఘటమనీ అర్థమైంది దుర్యోధన్ కు.

నవ్వి—"డబ్బు రూపేణా ఇంకా ఏ ఒప్పందమూ కుదరలేదు. పని పూర్తయ్యాక చెబుతానన్నాను. గరుడప్పన్ గారూ! నిజంగా మీరు సామాన్యులుకారు" అన్నాడు.

"ఆమాత్రం గ్రహించినందుకు థాంక్స్! స్వప్నరాశి

మిమ్మల్ని కలుసుకుని ఏమందో ముందు వివరంగా చెప్పండి. ఆ తరవాత నా కథనం వినిపిస్తాను" అన్నాడు గరుడప్పన్ కాలుమీద కాలు వేసుకుని నింపాదిగా కూర్చుంటూ.

"తను విజయనగరంలో నివసించే రఘుపతినాయుడనే మాజీ జమీందారు కుమార్తెననీ, ఒకప్పుడాయనకో తమ్ముడుండేవాడనీ, తన బాల్యంలో ఆయన ఇల్లువిడిచి వెళ్ళిపోయాడనీ, ఇన్నేళ్ళ తరవాత బొంబాయిలో గొప్ప ధనవంతుడిగా ఆయన మరణించినట్లు తెలిసిందనీ.

"పిల్లలు లేని కారణంగా ఆయన ఆస్తంతా తనకు చెందేట్టు రాసిపోయాడనీ, ఐతే కోర్టువారిని నమ్మించడానికి వారసురాలు వారి వంశ చిహ్నమైన ఈ బంగారు నెమలిని చూపితీరాలని షరతు పెట్టాడనీ, ఆమె తండ్రి దీన్ని మీకు అమ్మేసినందువల్లా, ఒకసారి కొన్న వస్తువును మీరు మళ్ళీ అమ్మడానికొప్పుకోనందువల్లా యెలాగైనా దీన్ని మీనించి సంపాదించి తెమ్మనీ కోరింది!" అంటూ ముగించాడు దుర్యోధన్.

గరుడప్పన్ నవ్వాడు గట్టిగా. "బావుంది. చాలా బావుంది కథ! విజయనగర వాస్తవ్యుడైన రఘుపతి నాయుడు కుటుంబంతో నాకు చాలా సన్నిహిత సంబంధాలున్నాయి. ఆయన మరణించి చాలా కాలమైంది. ఇద్దరు కొడుకులు తప్ప ఆయన కసలు కూతుళ్ళే లేరు! అంతేకాదు, ఆయన తండ్రికి ఆయనొక్కడే కొడుకు. తమ్ముడు లేనే లేడు!

రఘుపతినాయుడు మరణానంతరం ఆయన యిద్దరు కొడుకులు ఆస్తి పంచుకుని విడిపోయారు. అందులో పెద్దవాడు విలాసాలు మరిగి అనేక అప్పులు నెత్తిన వేసుకుని

తనకు చెందిన అమూల్య వస్తువులు అమ్మకోసాగాడు.

"అప్పుడే అతను తన వాటాలో వచ్చిన ఈ బంగారు నెమలిని నాకు పదివేల కమ్మేశాడు. ఇప్పుడు చెప్పండి. నాకు తెలిసిన ఈ వాస్తవానికీ, మీరు చెప్పిన కథనానికీ ఎక్కడైనా పొంతన వుందా?"

ఆశ్చర్యంతో దుర్యోధన్ బుర్ర స్తంభించిపోయింది కాసేపు. కేవలం పదివేలు ఖరీదుచేసే బంగారు నెమలి కోసం ఇద్దరు స్వప్నరాశులు, ఇద్దరు దివ్యనాథ్‌లు రెండు విభిన్న కట్టుకథలు చెప్పి, కోరినంత ఫీజు చెల్లించి దాన్ని స్వంతం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నారా?

"ఇందులో యేదో నిగూఢ రహస్యం ఇమిడివున్నట్లు స్పష్టమాతోంది. ఆ రహస్యమేమిటో నేనూ తెలుసుకోవాలనుకుంటున్నాను. ఈ బంగారు నెమలిని మీ వెంట తీసికెళ్ళండి! మద్రాసునించి స్వప్నరాశిని పోర్టుబ్లేయర్‌కు రప్పించండి. దీన్ని మీరు సాధించారని తెలియగానే ఆమె రెక్కలు కట్టుకు వాలుతుంది. మీ ఫీజేమిటో పుచ్చుకుని ఆమెకు నెమలిని ఇచ్చెయ్యండి.

"తరవాత నీడలా ఆమెను వెంబడించి, దీన్ని ఎక్కడికి తీసికెళుతుందో, ఏం చేస్తుందో కనుక్కోండి. ఈ పని చేసిపెట్టినందుకు నేనూ మీరు కోరిన ఫీజు ఇవ్వగలను. యేమంటారు?"

నవ్వాడు దుర్యోధన్. "ఈ నెమలికోసం ఒక్కరు కాదు, ఇద్దరు స్వప్నరాశులు నన్ను కలుసుకున్నారు. ఇద్దరూ వేరువేరు కథలు చెప్పారు. అందుకే నేనిందులో ఇంట్రెస్టు తీసుకున్నాను. ఆ ఇద్దర్లో యే స్వప్నరాశికి ఇవ్వమంటారు దీన్ని?"

అది వినగానే గరుడప్పన్ కనుబొమలు ముడిపడ్డాయి.

క్షణం ఆలోచించి అన్నాడు—"అలాగా! ఆ విషయం తెలీదు నాకు. ఐతే ఇందులో నిజంగా యేదో మర్మం దాగివుందన్నమాట. వాళ్ళిద్దర్లో యే స్వప్నరాశికి దాన్ని వ్వాలో మీరే నిర్ణయించుకోండి. నాకు మాత్రం ఆ మిష్టరీ యేమిటో తెలిసితీరాలి."

"దురదృష్టవశాత్తూ స్వప్నరాశి నా కళ్ళల్లో కారం చల్లి దీన్ని తీసుకు పారిపోతే?"

"నాకు మీ సామర్థ్యంమీద పూర్తి నమ్మకం వుంది. అలా యెన్నటికీ జరగదు!"

"ఒక వేళ నేనే ఈ నెమలి తీసికెళ్ళి యెన్నటికీ తిరిగి రాకుంటే?"

పకపక నవ్వాడు గరుడప్పన్. "నాకూ ఆ ఆలోచన రాకపోలేదు. అందుకే ఓ నిర్ణయానికి వచ్చాను. ఈ నెమలి మీ దగ్గరున్నంత కాలం మిస్ షీలా జామీను రూపంలో మా దగ్గరే వుంటుంది!"

కోపాన్ని ఆపుకోలేక చిఱుతలా అతనిమీదికి లంఘించబోయాడు దుర్యోధన్. ఆ క్షణంలో అతని నడుంమీద పిస్తోలు మొనగుచ్చుకుంది. ఓరగా చూశాడు. మేజర్ సైగల్!

"మిష్టర్ దుర్యోధన్ ప్లీజ్, శాంతించండి. మీరు గొప్ప బలశాలి కావచ్చు- ముష్టియుద్ధంలో ఆరితేరిన వారు కావచ్చు. కాని, ఈ పిడికెడు పిస్తోలుముందు మీ శక్తి సామర్థ్యాలు యేపాటి?" అంటున్నాడు సేఫ్టీ కాచ్ వెనక్కి లాగుతూ.

"ఆవేశపడకండి దుర్యోధన్. నాకు పోట్లాటలంటే గిట్టవు. ప్రమాణ పూర్వకంగా చెబుతున్నాను. షీలా ఇక్కడున్నంత కాలం ఆమెనెవ్వరూ చెడు దృష్టితో

చూడరు. నా భార్యల దగ్గర ఆమె సగౌరవంగా మా ప్రత్యేక అతిథిగా వుంటుంది. ఆమెకే ఇబ్బందీ కలక్కుండా చూసే బాధ్యత నాది!" అన్నాడు గరుడప్పన్ శాంతంగా.

షీలపట్ల తనకు పూర్తి విశ్వాసం వుంది. కరాటే, జూడోవంటి మార్షల్ ఆర్ట్సులో ఆమె ఆరితేరింది. తనని తాను సులువుగా రక్షించుకోగలదు. సాలోచనగా తలూపాడు దుర్యోధన్.

"ఆల్‌రైట్! మీరింతగా భరోసా ఇస్తుంటే మీ షరతుకు ఒప్పుకుంటున్నాను. మనిషిని మనిషే కదా నమ్మాలి. సరే, షీలను పంపించండి. ఆమెతో మాట్లాడాలి."

"తప్పకుండా. సదాశివం! వెళ్ళి ఆమెను పిల్చుకురా!" అన్నాడు గరుడప్పన్.

అతను వెళ్ళి షీలను పిల్చుకొచ్చాడు. దుర్యోధన్ వివరించాడు పరిస్థితి అంతా!

గరుడప్పన్ మాత్రం కన్నార్పకుండా ఆమెనే చూస్తున్నాడు.

కాసేపు ఆలోచించి, తలూపింది షీల. "ఆల్‌రైట్! నేనిక్కడుండటానికి సిద్ధమే! మీరు వెళ్ళిరండి."

జాగ్రత్త సుమా, అన్నట్టు కన్నుగీటి, అందరివద్దా సెలవు తీసుకుని, బంగారు సెములితో బైటికి నడిచాడు దుర్యోధన్. అతన్ని గేటువరకూ సాగనంపడానికి వెనకే బైలుదేరాడు మేజర్ సైగల్.

కారెక్కి హోటల్ చేరగానే రిసెప్షనిస్టుని కలుసుకుని, మద్రాసునించి పోర్టుబ్లేయర్ వచ్చే విమానం టైమింగ్స్ కనుక్కున్నాడు. ఉదయం ఎనిమిదిగంటలకు

మద్రాసు వెళ్ళి, సాయంత్రం ఆరుగంటలకు మద్రాసునించి బైలుదేరి, యేడుగంటలకు ఇక్కడికి చేరి, మళ్ళీ తొమ్మిది గంటలకు వెళ్ళిపోతుందట.

టైం చూసుకున్నాడు దుర్యోధన్. మధ్యాహ్నం మూడుగంటలు.

మద్రాసులోని హోటల్ కారవాన్, ఫోన్ నెంబర్ 14331 అర్జంట్ పెర్సనల్ కాల్ బుక్ చేశాడు. ముందు స్వప్నరాశి నెంబర్ వన్ వచ్చి ఆ బంగారు నెమలికోసం తనని ప్రాథేయపడింది గనక, ముందు ఆమెనే పిలిపించి పరీక్షించాలని నిర్ణయించుకున్నాడు.

ఎక్కువ యెదురుచూడకుండానే దొరికింది లైన్. దివ్యనాథ్ పలికాడు అవతల. స్వర్ణమయూరాన్ని సాధించాననీ ఆరుగంటల ఫ్లైట్‌లో స్వర్ణరాశితో బైలుదేరి రమ్మనీ చెప్పగానే ఆనందం పట్టలేక దాదాపు అరిచినంత పని చేశాడతను.

రిసీవర్ పెట్టేసి, అర్జున్ని కలుసుకోడానికి గబగబ లిఫ్ట్‌వైపు నడిచాడు దుర్యోధన్.

4

రాత్రి సరిగ్గా ఎనిమిది గంటలకి తలుపు తట్టిన చప్పుడైంది.

అర్జున్ వెళ్ళి తలుపు తెరిచాడు.

స్వప్నరాశి, లాయర్ దివ్యనాథ్‌లు!

"రండి!" అన్నాడు దుర్యోధన్ పూర్తయిన సిగరెట్ ఏష్‌ట్రేలో నొక్కుతూ.

ఇద్దరూ లోనికి వచ్చారు. దివ్యనాథ్ చేతిలో బ్రీఫ్ కేస్ వుంది.

"కూర్చోండి" అన్నాడు అర్జున్ తలుపు మూసి.

సోఫాలో కూర్చుని—"ఆ బంగారు నెమలిని మీరు తప్పక సాధిస్తారని నాకు తెలుసు. మీ ఫోన్ అందగానే నిర్జీవమైన నా శరీరంలో మళ్ళీ ప్రాణం వచ్చినట్టైంది" అంది స్వప్నరాశి.

"డబ్బు తెచ్చారా?"

"మీ ఫీజేనా? ఇదుగో, కూడా తెచ్చాం!" అంటూ బ్రీఫ్ కేస్ తెరిచి చూపాడు దివ్యనాథ్.

"ఖర్చులు కలిపి మొత్తం పదివేలు తీసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు దుర్యోధన్ నిర్మొహమాటంగా.

"దానికేం ముందోసారి నాకా నెమలిని చూపించండి. ఇలా అంటున్నందుకు అన్యథా భావించవద్దు. నా తృప్తికోసం! అంతే" అంది స్వప్నరాశి.

సాలోచనగా తలూపుతూ వెళ్ళి, సూట్ కేస్ లోంచి నెమలిని తెచ్చి ఆమె కందించాడు.

స్వప్నరాశి రెండు నిమిషాలు దాన్ని పరీక్షగా చూసి, "మోసం! ద్రోహం! ఇది నకిలీ నెమిలి! మా అసలు నెమలి కాదు!!" అంది ఎర్రబారిన మొహంతో.

డిటెక్టివ్ లింకా ఆశ్చర్యంలోంచి తేరుకోనే లేదు. అప్పుడే బాల్కనీ దగ్గర "ఢాం!"మని పిస్తోలు పేలడం, గుండు "రయ్"మంటూ దుర్యోధన్ పక్కనించి దూసుకుపోవడం ఒకేసారి జరిగాయి. "అందరూ కిందపడిపోండి!" అంటూ రెప్పపాటులో నేలమీదికి దొర్లాడు.

దివ్యనాథ్ కిందపడి, జేబులోంచి రివాల్వర్ తీసి, గదిలో వెలుగుతున్న బల్బు పేల్చేశాడు. చీకటి! గదిలో యెవరెక్కడున్నారో కనిపించని కటిక చీకటి!

అంతలో "ఢాం!" మంది పిస్తోలు.

ఎవ్వరో వాటర్ పైప్ గుండా బాల్కనీలోకి దిగి కాలుస్తున్నారు. ఎవ్వరు?

ఐదు నిమిషాలు నిశ్శబ్దం!

మరో ఐదునిమిషాలు ఓపిగ్గా కాచుకున్నారు. వారి ఊపిర్లు తప్ప ఎలాటి అలికిడీ లేదు. ఇహ లాభంలేదని నిశ్శబ్దంగా బాల్కనీవైపు పాకసాగాడు దుర్యోధన్. బాల్కనీ దగ్గరికి చేరి పరీక్షగా చూశాడు. ఎవ్వరూ లేరు! పారిపోయాడా?

చటుక్కున లేచి కిందికి చూశాడు. మసక చీకట్లో ఓ మానవాకారం, హోటల్ ముందు భాగంవైపు పరిగెత్తుతోంది. వెళ్ళి వెతకడం వ్యర్థం! కిందికెళ్ళేలోగా ఆ చుట్టుపక్కల అతని ఛాయలు కూడా కానరావు.

తీవ్రంగా యోచిస్తూ బాత్ రూంలోకెళ్ళి, అక్కడి బల్బుతీసి గదిలో అమర్చాడు.

"ఇక లేవండి. పారిపోయాడు రాస్కెల్!"

అందరూ లేచి నిల్చున్నారు. "వాడెవడోగానీ ఈ నెమలి కాజెయ్యడానికే వచ్చుంటాడు" అంటూ పిస్తోలు జేబులో వేసుకున్నాడు దివ్యనాథ్.

స్వప్నరాశి, చేతిలో ఉన్న నెమలిని టీపాయ్‌మీద పెట్టి, "ఇహ పదండి లాయర్‌గారూ! నాకు చచ్చే భయంగా ఉందిక్కడ. మహం ఇంత దూరంవచ్చి దండగే అయింది" అంది.

"దుర్యోధన్‌గారూ! మమ్మల్ని మీరిలా మోసం చేస్తారని కల్లో కూడా ఊహించలేను" అన్నాడు దివ్యనాథ్ బ్రీఫ్‌కేస్ మూస్తూ.

"గరుడప్పన్ స్వయంగా దీన్ని నా చేతికిచ్చాడు. ఇది అసలైనదో, కాదో నాకేం తెలుసు?" అన్నాడు

దుర్యోధన్ జేవురించిన మొహంతో.

"మీరు మా ఆశలన్నీ వమ్ముచేశారు. సరే, యేం చేస్తాం? ఇక వెళతాము. గుడ్ బై పద స్వప్నా!" అన్నాడు దివ్యనాథ్ బ్రీఫ్ కేస్ అందుకుంటూ.

వెళ్ళిపోతున్న ఇద్దర్నీ గుడ్లు తేలేసి చూస్తుండి పోయారు డిటెక్టివ్‌లు.

"చాలా ఆశ్చర్యంగా వుంది. పిస్తోలు పేల్చినవాడు యేమీ సాధించకుండానే ఎందుకు పారిపోయాడు?" అడిగాడు అర్జున్.

"నాకూ అదే అర్థం కావడంలేదు" అన్నాడు దుర్యోధన్ సోఫాలో చతికిలబడుతూ.

"ఆ గరుడప్పన్ గాడే మిమ్మల్ని మోసం చేసుండాలి. అంత విలువైన వస్తువు అటువంటి కిలాడీ మీకెందు కిస్తాడు? మొదటినించీ ఈ కేసే అగమ్యగోచరంగా వుంది!"

దుర్యోధన్ పలకలేదు. టీపాయ్‌మీది బంగారు నెమిలి అందుకుని అటూ ఇటూ తిప్పిచూస్తూ ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. గరుడప్పన్ ఇంట్లో చూసినప్పుడు దాని ఎడమకాలి వేళ్ళలో ఒకటి కిందికి వంగి వుండటం గమ నించాడు తను.

బహుశా పెట్టేటప్పుడూ, తీసేటప్పుడూ దేనికో తగిలి వంగి వుంటుందనుకున్నాడు. కాని, ఈ నెమలి వేళ్ళన్నీ సరిగ్గానే వున్నాయి. ఇంతసేపూ ఇది తన దగ్గరే వుందే! ఆ వంకర వేలు ఎలా చక్కబడింది? అప్పుడు స్ఫురిం చింది అసలు సంగతి!

"అర్జున్! మనం మోసపోయాం! నిలువునా బోల్తా పడ్డాం!" అన్నాడు పట్టరాని ఉద్వేగంతో.

"ఏం జరిగింది?" అడిగాడు అర్జున్ అర్థంగాక.

"ఇది నకిలీ నెమలి!"

"ఆ సంగతి స్వప్నరాణి ఇంతకుముందే చెప్పిందిగా?"

"నీకర్థం కాలేదు. నేను గరుడప్పన్ దగ్గర్నించి తెచ్చిందే అసలు నెమలి! ఇప్పుడు నా చేతిలో వున్నది నకిలీ నెమలి!! వాళ్ళిద్దరూ మనల్ని బోల్తా కొట్టించి అసలు నెమలి కాజేసి ఈ నకిలీ నెమలి వదిలిపోయారు. ఆ విధంగా వాళ్ళు అసలు నెమలిగా నేగాక, మన ఫీజా తన్నుకు పోయారు!"

"ఎలా?"

"మద్రాసునించి వచ్చేటప్పుడే వాళ్ళు తమవెంట ఓ మనిషిని తెచ్చుకునుంటారు. లేదా, ఇక్కడే వున్న వారి మనిషికి ఫోన్ చేసి వుంటారు. వాటర్ పైప్ గుండా బాల్కనీలో దిగి, పిస్తోలు పేల్చమని.... ఆ సాకుతో సమే దివ్యనాథ్ రివాల్వర్ తీసి గదిలోని లైటు యెగరగొట్టేశాడు.

"ఆ చీకట్లోనే నెమళ్ళ మార్పిడి జరిగిపోయింది.... తరవాత నకిలీ నెమలి తెచ్చానని ఆరోపించి, ఇద్దరూ చల్లగా జారుకున్నారు."

"స్థానిక పోలీసుల సాయంతో వారికోసం గాలిస్తే?"

పెదవి విరిచాడు దుర్యోధన్. "అటువంటి జిత్తుల మారి నక్కలు అంత సులభంగా పట్టుబడతారనుకోడం కల్ల! ఈ పాటికి వాళ్ళు చేరుకోలేని దూరానికి పారిపోయుంటారు. ఈ సంగతి గరుడప్పన్‌కు తెలిస్తే, మనల్ని ప్రాణాలతో ఈ దీవినించి కదలనివ్వడు. ఆ నెమలికి బదులు షీల అతని దగ్గరుంది. ఆమె గురించే బెంగపడుతున్నాను."

"ఏం చేద్దామంటా రిప్పుడు?"

"చెయ్యాలి. ఏదో ఒకటి చెయ్యక తప్పదు. ఆలోచించి పథకం అల్లుతాను. నువ్వు పడుకో!" అన్నాడు దుర్యోధన్ సిగరెట్ అంటిస్తూ.

# 5

"రాత్రంతా ఆలోచించి ఓ ప్లాన్ రూపొందించాను. త్వరగా లెములు. స్థానిక పోలీస్ హెడ్ క్వార్టర్స్ కెళ్ళి డి.ఎస్.పి.ని కలుసుకోవాలి" అన్నాడు దుర్యోధన్ సూట్ కేస్ తెరుస్తూ.

తలూపి, బాత్ రూంలో దూరాడు అర్జున్.

సూట్ కేస్ అడుగులోంచి ఆరంగుళాల పొడవూ, రెండంగుళాల మందం వున్న తెల్లని కొవ్వొత్తుల్నిపోలిన అరు కడ్డీలు తీశాడు దుర్యోధన్. వాటిని మూడు మూడు చొప్పున విడగొట్టి పాంటు పైకెత్తి పిక్కల దగ్గర వెడల్పాటి రబ్బర్ బాండ్స్‌తో బిగించుకున్నాడు.

అర్జున్ తయారయ్యాక టిఫిన్ కానిచ్చి కారెక్కాడు.

అరగంటలో చేరుకున్నారు హెడ్ క్వార్టర్స్.

వారి పేర్లు వినగానే డి.ఎస్.పి. పర్సనల్ అసిస్టెంట్ సబ్ ఇన్స్‌పెక్టర్ వాసు లేచి కరచాలనం చేశాడు. "మహేంద్రనాథ్ గారు క్యాంపునించి ఇంకా రాలేదు. చెప్పండి. నావల్ల ఏదైనా సహాయం కావలిస్తే, తప్పక ప్రయత్నిస్తాను" అన్నాడు సాదరంగా.

"ప్రస్తుతం ఓ మోటార్ బోట్ అవసరమైంది మాకు."

"అంతేనా! ఇక్కడి ప్రజలకు చేపలు పట్టడమే ముఖ్య వృత్తి. లెక్కలేనన్ని మోటర్ బోట్లు దొరుకు తాయి. నో ప్రాబ్లమ్. మీరు వ్యక్తిగతంగా వెళ్ళి

అడిగితే ఇద్దరుగానీ, పోలీసులం, మేము కోరిన వెంటనే యేర్పాటుచేస్తారు. ఎప్పుడు కావాలి మీకు?"

"రెండు మూడు గంటల్లో దొరికితే బావుంటుంది."

"ఆల్ రైట్! ఇప్పుడే ప్రయత్నిస్తాను."

అతనికి థాంక్స్ చెప్పి, అర్జున్‌తో బైటికివచ్చి, నువ్విక్కడే వుండు. ఆ మోటర్ బోట్ దొరికిన వెంటనే రేవు దగ్గర మాకోసం కాచుకో. నేనూ, షీలా యే క్షణంలోనైనా అక్కడికి వస్తాం! ఆ తరవాత చెబుతాను యేం చెయ్యాలో!" అంటూ కారెక్కి ముందుకు పోనిచ్చాడు దుర్యోధన్.

గరుడప్పన్ ఇంటిముందు కారాపగానే కాపలాదారు వచ్చి, "ఎవరు కావాలి?" అనడిగాడు.

తన పేరు చెప్పి, "గరుడప్పన్ గార్ని కలుసుకోవాలి" అన్నాడు.

అతను లోనికెళ్ళి, పదినిమిషాల తరవాత వచ్చి, గేటు తెరిచాడు. "వెళ్ళండి."

కారు కాంపౌండ్లోకి పోనివ్వగానే, పోర్టికోలో నిల్చుని కనిపించాడు సదాశివం.

కారాపి అతనికి షేక్‌హాండ్ ఇచ్చాడు దుర్యోధన్.

"రండి. బాస్ డైనింగ్ హాల్లో ఎదురుచూస్తున్నారు" అంటూ లోనికి నడిచాడు సదాశివం.

అతన్ని అనుసరిస్తూ ఓరగా సెక్యూరిటీ క్యాబిన్ వైపు చూశాడు దుర్యోధన్. మేజర్ సైగల్, ఇద్దరు గార్డులూ వున్నారక్కడ. తన రివాల్వర్ నిన్ననే వారికప్పగించడంవల్ల ఈ రోజు సోదా చెయ్యడం అనవసరమనుకున్నారేమో, వదిలేశారు.

సదాశివం వెనక తిన్నగా డైనింగ్ హాల్లో అడుగు

పెట్టాడు దుర్యోధన్. వెడల్పాటి డైనింగ్ టేబిల్ కిరుపక్కలా గరుడప్పన్, షీలా కూర్చున్నారు.

దుర్యోధన్ని చూడగానే, గరుడప్పన్ గారపళ్ళికిలించి, "గుడ్ మార్నింగ్ డిటెక్టివ్! రండి. కూర్చోండి" అన్నాడు కుర్చీ చూపుతూ.

షీల పక్కన కూర్చుని, "ఎలా వుందిక్కడ?" అడిగాడు దుర్యోధన్.

"చాలా బావుంది. గరుడప్పన్ గారు నిజంగా మంచి అతిథి పారాయణులు" అంది షీలా.

"టిఫిన్ చల్లారిపోతోంది. కానివ్వండి" అన్నాడు గరుడప్పన్ తనే స్వయంగా దుర్యోధన్ ప్లేట్లో వడ్డిస్తూ.

తినాలని లేకున్నా మర్యాదకోసం వారికి కంపెనీ ఇవ్వసాగాడు దుర్యోధన్.

టిఫిన్ ముగించి కర్చీఫ్‌తో చేతులు తుడుచుకుంటూ చాలా నింపాదిగా అన్నాడు గరుడప్పన్. "మిస్టర్ దుర్యోధన్! మీరు దొంగల్ని, హంతకుల్ని పట్టుకోడంలో చాలా ఘటికులనీ విన్నాను. అలాగే, దొంగతనం చెయ్యడంలోనూ మీకు మంచి ప్రావీణ్యం వుందని నిన్ననే తెలిసింది నాకు!"

నివ్వెరబోయి చూశాడు దుర్యోధన్. "ఇది యే రకం జోకో నాకర్థం కాలేదు!"

గరుడప్పన్ నవ్వి—"ఏమీ తెలియనట్టు నటించడంలోనూ మీరు సిద్ధహస్తులేనని తెలుస్తోంది" అన్నాడు.

"చెప్పేదేదో సూటిగా చెప్పండి" అన్నాడు దుర్యోధన్ తీక్షణంగా.

"చెబుతాను. వినండి. నిన్న మీరు ఆ బంగారు నెమలితోబాటు నా మ్యూజియంలోని అతి విలువైన

పాతిక లక్షల వజ్రాల హారంకూడా కాజేశారు. నేర పరిశోధనలాగే మీరుచేసే దొంగతనం తీరుకూడా అద్వితీయమైనది. నా జీవితంలో మీవంటి వ్యక్తిని మొదటిసారి చూశాను" అన్నాడు గరుడప్పన్.

"వాటార్ యూ టాకింగ్ నాన్సెన్స్! నిన్న ఇక్కడున్నంతసేపూ మీరూ, సదాశివం నా వెంటే వున్నారు. అలాంటప్పుడు హారాన్ని ఎలా తీసికెళ్లాను?" అరిచాడు దుర్యోధన్.

"అరవకండి. అదే నేనూ తెలుసుకోవాలనుకుంటున్నాను. ప్రత్యక్షంగా మేం మీ ఎదుట వున్నా, మీరు దాన్ని యెలా తస్కరించారు? మ్యూజియంలో అది యెక్కడ పెట్టబడిందో ఎలా తెలుసు మీకు?" అడిగాడు గరుడప్పన్.

"నిజంగా నాకేమీ తెలీదు. నమ్మండి."

"ఐదే, దాన్ని నాకు ఇవ్వదలచుకోలేదన్నమాట!"

"మీ దగ్గర అటువంటి వజ్రాలహారం వున్నదీ, లేనిదీ కూడా తెలీనప్పుడు నేను దొంగిలించే ప్రసక్తిలేదు. ఇంటికి వచ్చిన అతిథుల్ని ఇలా అనుమానించడం మీ ఆచారమా?"

"డిటెక్టివ్! నువ్విప్పుడు మద్రాసులో లేవు. సముద్రం మధ్య పోర్టుబ్లేయర్లో వున్న సంగతి మరువక! ఇంతవరకూ నీకిచ్చిన మర్యాద చాలు. నా హారాన్ని యే విధంగా కాజేశావో, కాజేసి యెక్కడ దాచావో మర్యాదగా చెబితే సరి. లేదా, నా దగ్గర అనేక పద్ధతులున్నాయి.

ఆ పద్ధతులుపయోగించానంటే ప్రాణంలేని శవాలు కూడా పలకడం ప్రారంభిస్తాయి. ఆ స్థితి రాకముందే

టుదిగా చెప్పేయ్!" అన్నాడు గరుడప్పన్ కర్కశంగా.

"ఒక్కసారి కాదు, వెయ్యిసార్లు చెబుతాను. ఆ హారం నా దగ్గర లేదు!"

నెమ్మదిగా చప్పట్లు చరిచాడు గరుడప్పన్.

వెంటనే ఓ వస్తాదులాంటి వ్యక్తి వచ్చాడు లోనికి. బోడిగుండు. ఒంటిమీద కేవలం నల్లపాంటు. కసరత్తు చేసి, కండలు పెంచిన పిండం!

"ఓహో! ఈ బుల్ డాగ్ ద్వారా నన్ను చితగ్గొట్టించి, ఆ హారం సంగతి కనుక్కోవాలనుకుంటున్నావా?" అడిగాడు దుర్యోధన్ నింపాదిగా.

"నో.నో! నిన్ను వాడికప్పగించడం చాలా ప్రమాదం! యెందుకంటే, వాడి పూర్తి శక్తి యెంతో వాడికే సరిగ్గా తెలీదు. ఒకటి రెండు దెబ్బలు కొట్టి నీ ఎముకల్ని ఎండుపుల్లల్లా విరిచేయగలడు. దురదృష్టవశాత్తూ తగలని చోట దెబ్బ తగిలితే, నీవు పైలోకం వెళ్ళే ప్రమాదముంది. నా హారం నాకు దొరక్కముందే నీవు చావడం నాకిష్టంలేదు. అందుకే ఓ పద్ధతి ఆలోచించాను."

"ఏమిటది?"

"శత్రువు బలహీనమైన నరం పసిగట్టి, దానిమీదే దెబ్బతియ్యడం విజ్ఞుల లక్షణం! నీ బలహీనతేమిటో నా కరమైంది. మిస్ షీలను హింసిస్తే అది చూసి విధిలేక నీ నోరు తెరుచుకుంటుందనుకుంటాను...." అంటూ షీల వైపు తిరిగి, "మిస్ షీలా! కాస్త ఆ కుర్చీలోంచి లేచి నిల్చుంటావా?" అడిగాడు గరుడప్పన్ నవ్వుతూ.

షీల బెదిరిన లేడిలా దుర్యోధన్ వైపు చూసింది.

"మిస్ షీలా! చెప్పేది నీకే! మా పహిల్వాన్ తలుచుకుంటే, నిన్ను ఒక చేత్తో ఎత్తి ఇరవై గజాల దూరం

విసిరెయ్యగలడు. బుద్ధిగా చెప్పినట్టు చెయ్!" అన్నాడు గరుడప్పన్ ఈసారి కటువుగా.

ఆమెను లేచి నిల్చోమన్నట్టు సైగ చేశాడు దుర్యోధన్.

"మిస్టర్ డిటెక్టివ్! ఈమె గులాబీరంగు ఒంటిమీద నల్లని వాతలు పడుతుంటే చూసి, నీ జ్ఞాపకశక్తి వెంటనే తిరిగి వస్తుందనుకుంటాను" అన్నాడు గరుడప్పన్ నవ్వుతూ.

"వద్దు, వద్దు! హారం ఇక్కడే నా దగ్గరే వుంది" అన్నాడు దుర్యోధన్ రాజీకి వస్తూ.

గరుడప్పన్ విరగబడి నవ్వి—"వెరీ గుడ్! పాపం, షీలని ఆ యాతనలు పడకముందే కాపాడావు. నాకు తెలుసు, హారం నీ దగ్గరే వుందని. యేదీ దాన్ని తీసి ఈ బల్లమీద పెట్టు చూద్దాం!" అన్నాడు.

రెప్ప మూసి తెరిచేలోగా వంగి, కుడికాలి పిక్క నించి ఆ కొవ్వొత్తిలాంటి వస్తువు లాగి, కోటు జేబు లోంచి గ్యాస్ లైటర్ తీసి లేచాడు దుర్యోధన్. అందరూ యేమీ అర్థంకాక గుడ్లప్పగించి చూడసాగారు.

బటన్ వత్తి లైటు వెలిగించాడు దుర్యోధన్. దాన్ని ఆ వస్తువుకు దగ్గరగా పట్టుకుని—"గరుడప్పన్! ఇటువంటి విషమపరిస్థితుల్ని ఎలా ఎదుర్కోవాలో నాకు బాగా తెలుసు. నా చేతిలో వున్నది కొవ్వొత్తి అనుకునేవు. కాదు. శక్తివంతమైన డైనమైట్! యెవ్వరైనా యే చిన్న పిచ్చి పనిచేసినా లైటర్‌తో డైనమైట్ వత్తి వెలిగిస్తాను. తరవాత యేం జరుగుతుందో మీకు బాగా తెలుసు" అన్నాడు నవ్వుతూ.

ఆ హఠాత్పరిణామంతో కొద్ది క్షణాలు యెవ్వరి

నోటా మాట పెగల్లేదు. అందరూ స్తబ్ధులై చూడసాగారు. సదాశివం తేరుకున్నాడు కాబోలు, చటుక్కున లేవబోయాడు.

తెలివి తక్కువ పని చెయ్యక! నేను ఊరికే బెదిరించడం లేదు. నిజం తెలుసుకోవాలంటే ప్రయత్నించి చూడు. తరవాత చింతించి ప్రయోజనం వుండదు" అన్నాడు దుర్యోధన్ హెచ్చరిస్తూ.

"డైనమైట్ పేల్చేవంటే, మాతోబాటు నువ్వూ, షీలా ఇక్కడే మసి అవుతారు. అది ఆలోచించావా?" అడిగాడు గరుడప్పన్.

నవ్వి—"ఆ మాత్రం గ్రహించే బుర్ర నాకూ వుంది. మీ జేతుల్లో చిత్రహింసలుపడి మా కిష్టం లేని చావు చావడంకంటే మాకు మేముగా ఇష్టపడి చావడం గౌరవప్రదం! యే నాడైతే మేమీ వృత్తి ప్రవేశించామో, ఆ నాడే మా ప్రాణాలను వృత్తికి కుదువబెట్టాం!

"మీ ప్రాణాలమీద మీకు తీపివుంటే, బ్రతకాలనుకుంటే కిక్కురు మనకుండా కూర్చోండి. పద షీలా!" అంటూ వారినే చూస్తూ తలుపుని సమీపించాడు దుర్యోధన్.

షీలతో తలుపు రెక్క పక్కన నక్కి—"మేజర్ సైగల్ కమాన్! హరియిప్!" అన్నాడు బిగ్గరగా.

లోపల ఏం జరిగిందోనని ఖంగారుపడుతూ వెంటనే గార్డులతోసహా పరిగెత్తుకొచ్చాడు మేజర్. వారు లోపలికి రాగానే మెరుపులా షీలతో బైటికెళ్ళి తలుపు మూసి గడియ బిగించాడు దుర్యోధన్.

క్షణం వృధా చెయ్యకుండా పోర్టికోలోకి పరిగెత్తి

శారిద్దారిదరూ.

"అర్జున్ ఎక్కడ?" అడిగింది షీల పైటతో చెమట తుడుచుకుంటూ.

"రేవు దగ్గర మోటార్ బోట్ తో మనకోసం యెదురు చూస్తూంటాడు. మద్రాసు కెళ్ళడానికిప్పుడు విమానం లేదు. అంగుళంలోనే తెలుదేరాలి" అంటూ కారు స్టార్టుచేసి పరిగెత్తించాడు దుర్యోధన్.

"ఊహించని విధంగా మీరు మళ్ళీ ఎందుకొచ్చారు? ఆ బంగారు కిమలి ఎక్కడ? ఈ వజ్రాల హారం కథేమిటి?" అడిగింది షీల అయోమయంగా.

హోటల్లో జరిగిన సంఘటన ఆమెకు వివరించి, "ఈ వజ్రాల హారం సంగతి నాకూ అంతుబట్టడంలేదు. ప్యాలెస్ లో అంత పటిష్టమైన సెక్యూరిటీ ఏర్పాట్లుండగా యెవరు కాజెయ్యగలరు దాన్ని? గరుడప్పన్ ఊరికే నామీద నిందమోపి, యేదైనా నాటక మాడాలనుకున్నాడా?" అంటూ అనుమానం వ్యక్తం చేశాడు దుర్యోధన్.

"ఏది యేమైనా మీ చాకచక్యంవల్ల పెద్ద ప్రమాదం తప్పింది మనకు" అంది షీల తేలిగ్గా నిట్టూరుస్తూ.

రేవు సమీపించగానే కనిపించాడు అర్జున్. "మోటర్ బోటు దొరకలేదు. చేపలుపట్టే పెద్దపెడా మర పడవ దొరికింది" అంటూ వారిని లంగరు వేసివున్న మినీ షిప్ దగ్గరికి తీసికెళ్ళాడు.

"ఇదీ ఒకందుకు మంచిదే అయింది" అంటూ షిప్ ను క్షుణ్ణంగా పరిశీలించాడు దుర్యోధన్.

పైన ఆపరేట్ కేబిన్, దానిచుట్టూ అరుగులాంటి ఖాళీ డెక్, ఓ మూల కింది కేబిన్ లోకి కెళ్ళడానికి నాలుగైదు

మెట్లున్నాయి. ఆ మెట్లు దిగి కిందికెళ్ళాడు దుర్యోధన్. వలలూ, చేపలుపట్టే ఇతర సామానూ పెట్టడానికి ఉద్దేశించిన అతి చిన్న కేబిన్ అది. అవసరంవస్తే ఇద్దరు ముగ్గురు పడుకోవచ్చు కూడా!

వెలుతురుకోసం ఓ మూల కొవ్వొత్తులుంచడానికి చిన్న స్టాండు కూడా వుంది. కాళ్ళకు కట్టుకున్న రైన మైట్స్ తీసి, ఆ స్టాండు కమర్చి తిరిగి డెక్ మీది కెళ్లాడు దుర్యోధన్. ఆపరేట్ కేబిన్‌లో ప్రవేశించి, ఇంజన్ స్టార్టుచేసి, దిక్సూచి సాయంతో షిప్‌ను మద్రాసువైపు పరిగెత్తించాడు.

## 6

చీకటిపడింది మద్రాసు రేవు చేరేసరికి. షిప్ కు లంగర్ వేసి, టాక్సీలో తిన్నగా హోటల్ కార్వాన్ చేరుకున్నారు ముగ్గురూ.

"షీలా! స్వప్నరాశి నెంబర్ వన్, దివ్యనాథ్‌లు రూం నెంబర్ నూటయేడులో వున్నారో లేదో వెళ్ళి చూసిరా! మా ఇద్దర్ని తప్ప వాళ్ళింకా నిన్ను చూడలేదు" అన్నాడు దుర్యోధన్.

షీల తలూపి హోటల్లోకి నడిచింది.

పార్కింగ్ ప్లేస్‌లో నిల్చుని యెదురుచూడసాగారిద్దరూ.

అరగంటైనా ఆమె తిరిగి రాలేదు. మరో పదిహేను నిమిషాలు ఓపిగ్గా కాచుకున్నారు.

షీల జాడ లేదు!

"నువ్విక్కడే నిల్చో! గంటలోగా మేము తిరిగి రాకుంటే హెడ్ క్వార్టర్స్‌కి రింగ్ చేసి ఇన్‌స్పెక్టర్ యుగంధర రెడ్డిని పిలిపించు" అంటూ హోటల్ వైపు

నడిచాడు దుర్యోధన్.

లిఫ్ట్ ద్వారా సెకండ్ ఫ్లోర్ చేరి, నడవా కిరుపక్కలా వున్న రూం నెంబర్స్ చెక్ చేస్తూ 107వ గది ముందాగాడు. తలుపు మూసుంది. మునివేళ్ళతో తోసిచూశాడు. తెరుచుకోలేదు. కోటు జేబులో వున్న అర్జున్ పిస్తోలు సేఫ్టీ కాచ్ లాగి, అవసరంవస్తే వెంటనే తియ్యడానికి అనువుగా పట్టుకుని కాలింగ్ బెల్ నొక్కాడు.

రెండు నిమిషాల తరవాత యెవ్వరో తలుపును సమీపిస్తున్న అడుగుల సవ్వడి. గడియతీస్తున్న అలికిడి. తలుపు తెరుచుకుంది. దివ్యనాథ్.

"మీరా! ఇదేనా రావాడం? ప్లీజ్, కమిన్!" అన్నాడు తలుపుకడ్డం తొలుగుతూ.

జేబులో చెయ్యి పెట్టుకునే లోన అడుగు పెట్టాడు దుర్యోధన్.

దివ్యనాథ్ తప్ప ఆ గదిలో యెవ్వరూ లేరు!

"అరగంట క్రితం ఓ యువతి వచ్చిందా ఇక్కడికి?" అడిగాడు అతన్ని పరీక్షగా చూస్తూ.

"ఔను. ఆ పక్క గదిలో స్వప్నరాశితో మాట్లాడుతోంది. యెవ్వరా అమ్మాయి?" అడిగాడు దివ్యనాథ్.

జవాబివ్వకుండా అటు నడిచాడు దుర్యోధన్. ఆ గదిలోని దృశ్యం చూడగానే, దుర్యోధన్ గుండె క్షణం ఆగి తిరిగి కొట్టుకోసాగింది.

ఓ కుర్చీకి చేతులు వెనక్కి విరిచి, తాళ్ళతో కట్టేసి వుంది షీల. అరవడానికి వీల్లేకుండా నోటికడ్డంగా టేప్ అతికించి వుంది!

మెరుపులా పిస్తోలు తీసి, "మిష్టర్ దివ్యనాథ్! యేమిటిది?" అంటూ వెనుదిరగబోయాడు దుర్యోధన్.

అప్పుడు పడింది దెబ్బ. బుర్ర గింగురుమనేలా, కళ్ళు చెదరు కమ్మేలా పడింది. ఆ దెబ్బనుంచి తేరుకోకముందే మరొకటి పడింది. కళ్ళల్లో చుక్కలు మెరిశాయి. చీకట్లు కమ్ముకున్నాయి.

కుప్పలా కూలిపోయాడు కింద!

# 7

కళ్ళు తెరిచి చూస్తే నేలమీద బోర్లా పడున్నానని గ్రహించాడు. పరీక్షగా చూశాక తెలిసింది. అది నేల కాదు. మినీ షిప్ మీది చెక్క డెక్! చుట్టూ సముద్రపు హోరు. అంటే, తను సముద్రం మధ్య యేదో షిప్ మీద పడున్నాడన్నమాట!

"సార్!" అన్న కీచు కంఠం విని ఉలిక్కిపడి అటు చూశాడు.

అర్జున్! మసక చీకట్లో తనలాగే కిందపడున్నాడు బోర్లా.

"నిన్నెలా తీసుకొచ్చారిక్కడికి?" అడిగాడు ఆశ్చర్యంగా.

"నన్ను హోటల్ బైట నిల్చోబెట్టి మీరు లోనికెళ్ళిన పావుగంట తరవాత హోటల్ బాయ్ బైటికి వచ్చి, డిటెక్టివ్ దుర్యోధన్ గారు మిమ్మల్ని పిలుస్తున్నారన్నాడు. ఎక్కడున్నారని అడిగితే, సెకండ్ ఫ్లోర్ లో నూటాయేడవ గదిలోనని చెప్పాడు.

నిజమే అనుకుని లిఫ్ట్ ద్వారా పైకెళ్ళాను. ఆ గది తలుపు తెరిచే వుంది. లోనికెళ్ళిన మరుక్షణం తల వెనక పడింది దెబ్బ. అంతే! కళ్ళు తెరిచి చూస్తే ఇక్కడున్నాను!"

"షీల ఏమైంది?"

"తెలీదు."

"ఈ షిప్ మనం పోర్టుబ్లేయర్నుంచి తెచ్చిందేనా?"

అరుణ్ కాసేపు చుట్టూ కళ్ళజూసి, "ఔను. అదే!" అన్నాడు లేచి కూర్చుంటూ.

"హల్లో డిటెక్టివ్స్!" అన్న కంఠం విని ఇద్దరూ ఉలిక్కిపడి అటు చూశారు.

సదాశివం చేతిలో రివాల్వర్ పట్టుకుని నిల్చుని నవ్వుతున్నాడు.

"నువ్విక్కడికెలా వచ్చావ్?" అన్నాడు దుర్యోధన్ దిగ్భ్రాంతితో లేచి నిల్చుంటూ.

సదాశివం జవాబిచ్చేలోగా ఆపరేట్ కేబిన్లోంచి యెవ్వరో డెక్ మీదికొస్తున్న అడుగుల చప్పుడై అటు చూసి, కొయ్యబారిపోయారు డిటెక్టివ్లు. వేరొకరైతే దిగ్భ్రమతో ఊపిరందక తన్నుకునేవారే!

ఆ వ్యక్తులు యెవ్వరో కాదు. స్వప్నరాశి నెంబర్ వన్, నెంబర్ టూ, ఇద్దరు దివ్యనాథ్లు!! నలుగురు నవ్వుతూ వారిని సమీపించారు. అప్పుడు తొలగిపోసాగాయి దుర్యోధన్ మస్తిష్కాన్ని అంతవరకూ కమ్మివున్న మబ్బుతెరలు!

సాలోచనగా తలూపి, "ఇప్పుడర్థమైంది! మీరంతా ఒకే గ్యాంగ్! అటు గరుడప్పన్నీ, ఇటు నన్నూ ఫూల్స్నిచేసి ఆ బంగారు నెమలిని కాజేశారన్నమాట!"

"అంతేకాదు డిటెక్టివ్! ఆ నెమలితోబాటు పాతిక లక్షలు విలువచేసే వజ్రాల హారం కూడా మేమే కాజేశాం! ఈ సంగతి నీవింకా గ్రహించనందుకు చింతిస్తున్నాం!" అన్నాడు సదాశివం నవ్వుతూ.

"ఎలా కాజేశారు?" ఆశ్చర్యంతో దుర్యోధన్ కళ్ళు

విప్పారాయి.

"ఎప్పుడైతే గరుడప్పన్ తన లాకర్ రూంలోంచి ఆ స్వర్ణమయూరాన్ని తెచ్చి నీకివ్వబోయాడో ఆ అదను కోసమే యెదురుచూస్తున్న నేను కల్పించుకుని, షీలకు దాన్ని చూపి తెస్తానని మ్యూజియంలోకి తీసికెళ్ళాను. ముందామెకు దాన్ని చూపి, తిరిగివస్తూ అదివరకే ఓ చోట రహస్యంగా దాచిపెట్టిన ఆ హారంతీసి, నెమలి కాళ్ళకి దగ్గరగా వున్న గ్లోబ్‌లో దాన్ని దాచి తెచ్చాను. నిజానికాహారం దుర్భేద్యమైన ఆ లాకర్ రూంలోనే వుంటుంది.

ఒకనాడు గరుడప్పన్ కొందరు ప్రత్యేక అతిధులకు అక్కడి అమూల్య వస్తువులు చూపుతుండగా వారి కళ్ళు గప్పి, లాఘవంగా ఆ హారాన్ని కోటుజేబులోకి చేర్చి వారివెంట బైటికి వచ్చేశాను. దాన్ని లాకర్ రూం లోంచి ఇవతలికైతే తేగలిగాను గానీ అక్కడి అభేద్యమైన సెక్యూరిటీ సిబ్బంది కళ్ళు గప్పి బైటికి తీసికెళ్ళే ధైర్యం చాల్లేదు నాకు.

అందుకే, నిన్ను ఎరగా ఎన్నుకుని, నెమలితోబాటు హారాన్ని కూడా బైటికి చేర్చడంలో విజయం సాధించాం! ఆ తరవాత స్వప్నరాశీ, దివ్యనాథ్‌లు హోటల్ గదిలో నిన్ను బోల్తాకొట్టించి, చీకట్లో అసలు నెమలి కాజేసి, నకిలీ నెమలి వుంచిపోయారు. బాల్కనీగుండా పిస్తోలు పేల్చిందికూడా నేనే!

కేవలం ఆ హారంకోసమే ఇంత నాటకమూ, రిస్కూ తీసుకున్నామనుకున్నావా? నో, నో! అసలు కథ వేరే వుంది. ఆ కథకు సూత్రధారి యెవ్వరోకాదు. అదుగో, ఆ దివ్యనాథ్ నెంబర్ టూ!" అంటూ కళ్ళద్దాలూ, పిల్లి

గడ్డమూ వున్న వ్యక్తివైపు చూపాడు సదాశివం.

"అతని అసలు పేరు దివ్యనాథ్ కాదు. భాను ప్రకాశ్! పురాతత్వశాస్త్రవేత్త!! విజయనగరానికి ఇరవై మైళ్ళ దూరంలోని చిత్రదుర్గం అనే ఊరి పరిసరాల్లో పురాతత్వశాఖ ఆధ్వర్యంలో చారిత్రక అవశేషాలకోసం త్రవ్వకాలు జరుపుతున్నప్పుడు అతనికో తామ్రపత్రం దొరికింది.

దేవనాగర లిపిలో రాసివున్న ఆ పత్రాన్ని చదవగానే అత్యంత ఆశ్చర్యకరమైన ఒక నిగూఢ రహస్యం తెలిసిందతనికి. చిత్రదుర్గమనే ఆ ఊరు ఒకప్పుడు రణభేరుల త్రివిక్రమ నాయుడనే సేనాపతి జాగీరుగా వుండేదనీ, మరణించేముందు ఆయన తన అమూల్య సంపదనంతా ఒక ఉక్కు పెట్టెలో భద్రపర్చి, ఓ రహస్య ప్రదేశంలో పాతిపెట్టాడనీ.

ఆ ప్రదేశం తాలూకు వివరాలు వారి వంశ చిహ్నమైన బంగారు నెమిలి కడుపులో నిక్షిప్తపర్చిన రాగిరేకుపై పొందుపర్చి వున్నాయని తెలిసింది! ఆ రహస్యాన్ని ప్రభుత్వానికి బహిర్గతంచేస్తే తనకు లభించేది ఓ ప్రశంసాపత్రం, కొద్దిపాటి బహుమానం తప్ప మరేమీకావని, యెలాగైనా ఆ నిక్షిప్త నిధిని తానే కైంకర్యం చేసుకోవాలని ఆలోచించాడు భానుప్రకాశ్.

వెంటనే ఆ వంశస్థులకోసం ఆరాతీస్తూ, చివరికి విజయనగరంలో స్థిరపడ్డ రణభేరుల రఘుపతినాయుడి నివాసాన్ని కనుగొన్నాడు. ఐతే, ఆయన పెద్దకొడుకు ఆ బంగారు నెమలిని గరుడప్పన్‌కి అమ్మేశాడని తెలియగానే, తిన్నగా పోర్టుబ్లేయర్ చేరుకున్నాడు.

అదృష్టవశాత్తూ ఆ సమయంలో గరుడప్పన్ పనిమీద

ట్రివేండ్రం వెళ్ళటంవల్ల, విధిలేక అతని యెస్టేట్ మేనేజరైన నన్ను కలుసుకుని ఆ బంగారు నెమలి విషయం కదిపాడు. తను కొన్న వస్తువులు గరుడప్పన్ ఎట్టి పరిస్థితిలోనూ, ఎవరికీ అమ్మడని తెలిసి ఎలాగైనా దాన్ని సంపాదించాలనే ఉద్దేశంతో అసలు రహస్యం నాకు చెప్పి, ఆ నిధిలో నన్నూ భాగస్వామిగా చేర్చుకున్నాడు భానుప్రకాశ్.

గరుడప్పన్ లాకర్ రూంలో భద్రపర్చిన ఆ నెమలిని సంపాదించడం అంత సులభంకాదు గనక, బాగా ఆలోచించి ఓ పథకం రూపొందించాను. దివ్యనాథ్ నెంబర్ వన్‌గా మీకు పరిచయమైన నా తమ్ముణ్ణి, అతని భార్యనూ మీ వద్దకు పంపి, బంగారు నెమలి ప్రస్తావన ఎత్తించాను.

అందుకు మీరు నిరాకరించడంతో, భానుప్రకాశ్‌నూ, అతని భార్యనూ అవే పేర్లతో, అదే కథనంతో మళ్ళీ మీ దగ్గరకు పంపాను. అప్పుడు రేకెత్తింది నీలో ఆసక్తి. పోర్టుబ్లేయర్ వెళ్ళడానికి ఒప్పుకున్నావు.

దాంతో అటు గరుడప్పన్‌కు — స్వప్నరాశి అనే అమ్మాయి ఆ బంగారు నెమలికోసం తీవ్రంగా ప్రయత్నిస్తోందనీ, ఆమె తరఫున దాన్ని సంపాదించడానికి మద్రాసునించి డిటెక్టివ్ దుర్యోధన్, లేడీ ఇన్స్పెక్టర్ షీలా వచ్చారనీ చెప్పి, అతనిలోనూ జిజ్ఞాస మొలకెత్తించాను.

ఎట్టకేలకు మా ప్రయత్నంలో విజయం సాధించాం! ఇక ఆ నిధిని వెదికి స్వంతం చేసుకోడమే తరవాయి. దురదృష్టవశాత్తూ అది మాకు దక్కకున్నా, పాతికలక్షల హారం వుండనే వుంది. దానితోనే సరిపుచ్చుకోవచ్చు.

యెలా వుంది ప్లాను?" అడిగాడు సదాశివం విలాసంగా పిస్తోలు ఊపుతూ.

"బ్రహ్మాండంగా వుంది. మీ లక్ష్యాన్ని సాధించారు. ఇంకేం, ఇప్పుడు మమ్మల్నెక్కడికి తీసికెళుతున్నారు?" అడిగాడు దుర్యోధన్ ఆశ్చర్యంలోంచి తేరుకుని.

ఆతను నవ్వి—"మా రహస్యాలు తెలిసిన నీవు ప్రాణాలతో వుండటం ఎంత ప్రమాదమో మాకన్నా నీకే బాగా తెలుసు. అందుకే మిమ్మల్ని ఇలా సముద్రం మధ్యకు తెచ్చాను. ఈ షిప్‌తో సహా మీరు సముద్రంలో మునిగి చేపలకీ, సముద్ర జంతువులకీ మనిషి మాంసం రుచి చూపిస్తారు" అన్నాడు.

దుర్యోధన్ బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది. "షీల ఎక్కడుంది?" అడిగాడు.

"భయపడక! కింద కేబిన్‌లో బంధించాము. మీరు ముగ్గురూ మరణించాక కూడా కలిసి కట్టుగా యమపురికి ప్రయాణమౌతారు" అన్నాడు సదాశివం నవ్వుతూ.

"షిప్‌తోబాటు మమ్మల్ని ముంచి మీరెక్కడికి పోగలరు? మాతోబాటు మీరూ సముద్రం లోతు చూడరా?" అడిగాడు దుర్యోధన్.

పకపక నవ్వాడు సదాశివం. "ఆ మాత్రం ఏర్పాట్లు చేసుకోలేమనుకున్నావా మైడియర్ ఫూల్ డిటెక్టివ్! అదుగో, ఆ మోటార్ బోట్ మాకోసం సిద్ధంగా వుంది. అందులో సురక్షితంగా వెళ్ళిపోతాను" అంటూ సముద్రంలోకి చూపాడు సదాశివం.

ఫర్లాంగు దూరాన ఏదో వస్తున్నట్టు చీకట్లో మిణుకు మిణుకు మంటోంది లైటు.

"ఈ షిప్ నాలుగు మూలలా టైంబాంబులు పెట్టాం!

సరిగ్గా పదిగంటల ఇరవై నిమిషాలకు అవి పేలుతాయి. షిప్‌తో బాటు మీ ముక్కలూ గాలిలో ఎగురుతాయి" అన్నాడు సదాశివం.

టైం చూశాడు దుర్యోధన్. తొమ్మిదిన్నర!

కాసేపు తీవ్రంగా ఆలోచించి పెదవి విరుస్తూ తలెత్తాడు. "మిష్టర్ సదాశివం! నీవు చెప్పినట్లు నిజంగా ఇవి మా చివరి ఘడియలే అనిపిస్తోంది. తప్పించుకునే మార్గాలేవీ ఇక లేనట్టున్నాయి. చుట్టూ విశాలమైన సముద్రం! మేము నిరాయుధులం!!"

"వాస్తవాన్ని గ్రహించినందుకు సంతోషం!"

"ఈ చివరి క్షణాల్లో నా చివరికోరిక ఒకటి తీరుస్తారా?"

సదాశివం కనుబొమలు ముడిపడ్డాయి. "ఏమిటి?"

"పెళ్ళి చేసుకుని పచ్చగా సంసారం చేసుకోవలసిన వయసులో నా కారణంగా ఈ రొంపిలో దిగి ప్రాణానికి ముప్పు తెచ్చుకుంది షీల. ఈ చివరి ఘడియల్లో ఆమెకు క్షమాపణలు చెప్పుకుని వీడ్కోలు తీసుకోవాలనుకుంటు న్నాను. ఆమె నన్ను క్షమించానని చెప్పందే నా ఆత్మకు శాంతి లభించదు.

"ప్లీజ్! పదినిమిషాలు. పది నిమిషాలు నాకు ప్రసాదించండి. ఉరితియ్యబోయే ఖైదీని సైతం అతని చివరి కోరిక తీర్చడానికి ప్రయత్నిస్తారు. అలాగే, మీరూ నా కోరిక నిరాకరించరని నమ్ముతున్నాను" అన్నాడు దుర్యోధన్ వేడుకోలుగా.

వెంటనే పలకలేదు సదాశివం! కాసేపు ఆలోచించి, యేమనుకున్నాడో యేమో, "ఆల్‌రైట్! కిందికెళ్ళి ఆమెను కలుసుకో. పదినిముషాలకిమించి అరక్షణం కూడా

నేను అనుమతించేది లేదు" అన్నాడు.

"థాంక్యూ! థాంక్యూ వెరీమచ్!" అంటూ మెట్ల వైపు నడిచాడు దుర్యోధన్.

కింది కేబిన్‌లో అడుగుపెట్టి చూస్తే కుర్చీకి కట్టేసి వుంది షీల. గబగబ ఆమె కట్లు విప్పి, కొవ్వొత్తులుంచే రాక్‌ని సమీపించాడు. ఆరు డైనమైట్స్ ఇంకా అలాగే వున్నాయి. దూరంనించి అవి నిజంగా కొవ్వొత్తుల్లాగే కనిపిస్తాయి గనక, వాటి గురించి యెవ్వరూ పట్టించుకోలేదు. జేబులు తడుముకున్నాడు. వెళ్ళకు తగిలింది లైటర్!

డైనమైట్స్ కోటుజేబులో వేసుకుని, "ఇంకా మన నెత్తిమీదే వుంది ప్రమాదం! ఇది చివరి ప్రయత్నం! పైనించి నేను కేకెయ్యగానే నువ్వు పరిగెత్తుకు రావాలి" అంటూ చేతులు కోటుజేబుల్లో పెట్టుకుని, నింపాదిగా మెట్లెక్కి డెక్ మీదికెళ్ళాడు.

"మిష్టర్ సదాశివం! షీలని కలుసుకున్నాక నా నిర్ణయం మార్చుకున్నాను."

"ఏ నిర్ణయం?"

"ఇలా మీ చేతుల్లో దిక్కులేని చావు చావకూడదని."

విరగబడి నవ్వాడు సదాశివం. "జోక్ చేస్తున్నావా? లేక పిచ్చిగానీ పట్టిందా?"

"జోక్ చెయ్యడంలేదు. పిచ్చి పట్టలేదు. నిజమే!" అంటూ జేబులోంచి డైనమైట్, లైటర్ తీసి, వెంటనే లైటర్ వెలిగించాడు దుర్యోధన్.

దిగ్భ్రాంతితో అందరి నోళ్ళూ తెరుచుకున్నాయి. సదాశివం మెరుపులా పిస్తోలు గురిపెట్టాడు.

"అనవసరంగా పిచ్చివేషాలు వెయ్యక! నువ్వు గురి

తప్పకుండా పిస్తోలు కాల్చవచ్చు. నేను చావడానికి క్షణం పట్టవచ్చు. ఆ ఒక్క క్షణం చాలు నాకు. ఈ డైనమైట్ వత్తి వెలిగించడానికి, నాతో బాటు మీ రందరూ ముక్కలు చెక్కలై పోతారన్న విషయం మరవక! అనుమానం వుంటే చూడు!" అంటూ లైటర్ తో డైనమైట్ వత్తి వెలిగించి సముద్రంలోకి విసిరాడు దుర్యోధన్.

అంతే! దిక్కులు పిక్కటిల్లే చప్పుడు. నీటిలో ఉవ్వెత్తు అలలు!! షిప్ యెండుటాకులా అటూ ఇటూ వూగ సాగింది. వాళ్లా షాక్ లోంచి తేరుకోకముందే ఇంకో డైనమైట్ తీసి రెడీగా పట్టుకున్నాడు దుర్యోధన్.

"చూశారా? ఈ సముద్రంలో ఒంటరిగా, నికృష్టమైన చావు చచ్చేబదులు నాతో బాటు అందర్నీ తీసుకుని దేనికి చావకూడదు? ప్రాణాలమీద తీపివుంటే నా దగ్గర ఓ షరతుంది. ఆ షరతుకు ఒప్పుకుంటే అందరి ప్రాణాలూ సురక్షితమౌతాయి."

"ఏమిటది?" అడిగాడు సదాశివం చమట్లు కక్కుతూ.

"ఆ పిస్తోలు కిందపడేసి, నీ మనుషులతో తిన్నగా ఆ మోటార్ బోట్లోకి వెళ్ళిపో. మేం ముగ్గురం ఈ షిప్ లో మద్రాసు వెళ్ళిపోతాం! మీరు మీ ఇష్టం వచ్చిన చోటికి పారిపోండి. ఇందులో యెవ్వరికీ యెలాంటి నష్టమూ వుండదు. యేమంటావ్?"

విధిలేక పళ్ళు పటపట కొరుకుతూ పిస్తోలు ఓ మూలకి విసిరాడు సదాశివం!

మెరుపులా వెళ్ళి దాన్నందుకుని వారివైపు గురి పెట్టాడు అర్జున్!!

"ఇదేమిటి?" అన్నాడు సదాశివం ఆశ్చర్యంగా.

"సారీ, అయామ్ వెరీ సారీ! చేజిక్కిన నేరస్థుల్ని వదిలిపెట్టడం నా నియమాలకు విరుద్ధం! ఇప్పుడు మీరంతా నా బందీలు. షీలా! ఆ తాళ్ళు తీసుకుని పైకిరా! హరి యప్!" అన్నాడు దుర్యోధన్ గట్టిగా.

"మోసం! ద్రోహం!!" అరిచాడు సదాశివం.

"ఈ జీవితాలే అంత! నేరసులు రకరకాల ఎత్తులు వేసి నేరం చేస్తారు. మేము ఆ ఎత్తులకి పై ఎత్తులు వేసి వారిని చిత్తు చేస్తాం! ఐతే, ఒక విషయంలో మాత్రం నేనే కాదు, దేశం యావత్తూ మీకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. మీ కారణంగా ఎక్కడో భూమిలో పాతుకు పోయిన ఆ అమూల్య నిధి ఆచూకీ తెలిసి, ప్రభుత్వ ఖజానా కడుపు నిండబోతోంది!"

అంతలో షీల తాళ్ళతో వచ్చేసిందక్కడికి. అర్జున్ పిస్తోలు దుర్యోధన్‌కిచ్చి, ఆ తాళ్ళతో అందరి కాళ్ళూ, చేతులూ విరిచికట్టి కిందపడేశాడు.

"అర్జున్! వీళ్ళని పిస్తోలుతో కవర్ చేస్తూ ఇక్కడే వుండు. షీలా! నువ్వు డెక్ నాలుగు మూలలు వెదికి టైం బాంబ్స్ తీసి సముద్రంలో విసిరేయ్. నేను షిప్‌ని మద్రాసువైపు మళ్ళిస్తాను" అంటూ ఇంజన్ కేబిన్ వైపు నడిచాడు దుర్యోధన్.

—: అయిపోయింది :—

# బట్టతల పొట్టి మనిషి

బొమ్మిడి అచ్చారావు

"ఈ రాత్రికి జయా బ్యాంకు మన టార్గెట్. రాత్రి ఒంటి గంటకు సరిగ్గా మనం బ్యాంకును కొల్లగొట్టాలి" అన్నాడు మహేంద్ర.

అతనికి నలభై ఏళ్ళుంటాయి. దుబ్బులాంటి జుట్టు, గడ్డం అతని ముఖానికి క్రూరత్వాన్ని తెచ్చిపెడుతున్నాయి. మీసాల్లేవు. ఎర్ర చింతనిప్పుల్లాంటి కళ్ళు చూసేవాళ్ళకు భయంగొలిపేలా వున్నాయి. ఎంతటి ఘాతుకాన్నయినా మంచినీళ్ళ ప్రాయంలాగా చేసేలా వున్నాయి అతని చేతులు.

అతని చుట్టూ ఓ ఎనిమిదిమంది అనుచరులున్నారు. వాళ్ళ అవతారాలు కూడా దాదాపు వాళ్ళ యజమానిలాగానే వున్నాయి. అందరి చేతుల్లోను తుపాకులున్నాయి. యజమాని నిప్పుల్లోకి దూకమన్నా అందులోయే ఒక్కడు వెనుదియ్యడు. సాహసం, దౌర్జన్యం, దుడుకుతనం వాళ్ళ స్వంతమనట్టు మొరటుగా వున్నారు.

తను నాయకుడు చెప్పినదానికి అందరు తలలూపారు.

మహేంద్ర ఓ పెద్ద కాగితాన్ని మడతవిప్పి పక్కనే వున్న టేబిల్ మీద పరిచాడు.

దాన్ని అనుచరులకి చూపించి, "ఇదిగో, యిది అబిడ్స్‌కు పోయే దారి. ఇది యిలా మహబూబియా కాలేజి రోడ్. ఇదిగో బ్యాంక్ స్ట్రీటు. ఈ స్పాట్‌లో వుంది జయా బ్యాంకు. సరిగ్గా పన్నెండూనలభై నిమిషాలకు మన జీవ్‌లో బ్యాంక్‌కి పదిగజాల యివతల అందరం దిగిపోతాం! ఇద్దరు పోయి వెనకపాటున కొట్టి గూర్ఖాని స్పృహ తప్పించటమో, శాశ్వతంగా నోరు మూయించటమో చేస్తారు. తర్వాత మన పని అడ్డు లేకుండా జరిగిపోతుంది.

దొంగ పేరులో ఆ కౌంటు తెరిచి, అప్పుడప్పుడు చెక్కులు వేశాను. యే సేఫ్ ఎక్కడుందో అంతా బాగా స్టడీ చేశాను. కళ్ళు మూసుకుని వాటి దగ్గరకు పోగలను. మనం లోపల ప్రవేశించిన పదినిమిషాల్లో మన పని పూర్తి కావాలి. అంతా చకచకా జరిగిపోవాలి....ఓ....కే!?" అన్నాడు.

అనుచరులు మౌనంగా తలలూపారు.

మహేంద్ర ప్లాన్ కాగితం మళ్ళీ చుట్టేసి, చేతో పట్టుకున్నాడు. "ఇంకా యెవరికైనా అనుమానాలున్నాయా? వుంటే యిప్పుడే క్లియర్ చేసుకోండి!" అన్నాడు.

"వేషాలు మార్చుకోవాలా, అక్కర్లేదా?" ఒక అనుచరుడు అడిగాడు.

"అక్కర్లేదు. మనం ఒరిజినల్‌గా వున్నామో, వేషాలు వేసుకున్నామో — యెవరికి కనిపిస్తాం గనకా?

వృధా ప్రయాసపడి టైం వేస్టుచేసుకోవద్దు."

"అలాగే!" అందరూ తలలూపారు.

*　　　•　　　•

రాత్రి పన్నెండు దాటి పలభై నిమిషాలయింది.

బ్యాంకి స్ట్రీటులోని జయా బ్యాంకుకి పదిగజాల దూరంలో ఓ జీపు ఆగింది. దానిలోనుంచి చకచక తొమ్మిదిమంది కిందికి దిగారు. అందరూ చకచక జయా బ్యాంకు దగ్గరకు పరుగులాంటి నడకతో చేరుకున్నారు.

గూర్ఖా అప్పటికే నేలకరుచుకుని వున్నాడు. అయితే గూర్ఖాను పడగొట్టడానికి ముందుగా వచ్చిన తమ వాళ్ళిద్దరూ కనిపించలేదు.

మహేంద్ర తనవాళ్ళకు సైగచేశాడు.

వాళ్ళు అతని వెనకనే బ్యాంక్ లోపలికి చేరుకున్నారు.

మహేంద్ర తాళాలగుత్తి ఒకటి పైకితీశాడు.

సరిగ్గా అదే సమయంలో "ఎవరూ కదలొద్దు, ప్రాణాలు పోతాయి!" అన్న హెచ్చరిక వినిపించి, అందరు గన్స్ చేతుల్లో తీసుకున్నారు.

"మిష్టర్ మహేంద్రా నీ వాళ్ళను దుడుకుగా ప్రవర్తించకదని చెప్పు. ప్రాణాలు తీయటానికి మా వాళ్ళు వెనకాడరు!" హెచ్చరిక మరోసారి వినిపించింది.

అది ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ గొంతని మహేంద్రకు తెలుసు. పోలీసులతో ఆకస్మాత్తుగా దాడిచేశాడు.

మహేంద్ర మెరుపువేగంతో వెనుతిరిగి శ్రీనివాస్‌కి గన్ గురిచేసి అతని చేతిలోని రివాల్వర్ ఎగరగొట్టాడు. అయితే పోలీసులు వూరికే కూచోలేదు. మహేంద్ర

చేతిలోని గన్ గాల్లోకి యెగరగొట్టారు. అతని అనుచరు లిద్దర్ని గాయపరిచారు.

శ్రీనివాస్ చేతిలోకి మళ్ళీ రివాల్వర్ ప్రత్యక్ష మయింది.

సరాసరి మహేంద్రకు గురిచేసి, "మిస్టర్ మహేంద్రా చివరిసారిగా చెపుతున్నాను. నీ మనుషులు వెంటనే ఆయుధాలతోబాటు మాకు సరెండార్ అయిపోండి! లేకుంటే అందర్నీ నిస్సంకోచంగా కాల్చేస్తాం!, మేజిస్ట్రేట్ నించి ఫైరింగ్ ఆర్డర్స్ తీసుకున్నాం. మీ ముఠా ఎక్కడ కనపడ్డా కాల్చెయ్యమని కమిషనర్, డి.జి.పి. నుంచి అందరు మాకు ఆదేశాలు స్పెషల్‌గా ఇచ్చారు!" అన్నాడు శ్రీనివాస్.

పోలీసులు వాళ్ళని గన్స్‌తో కవర్ చేస్తున్నారు.

ఓ అయిదు నిమిషాల తర్వాత మహేంద్రను, అతని తక్కిన అనుచరుల్ని తీసుకుని పోలీసు వేన్ విజయగర్వంతో స్టేషన్‌వైపు సాగిపోయింది.

## 2

"మహేంద్రతోపాటు మరికొన్ని అలాంటి డెకాయిట్ ముఠాలు సిటీలో దోపిడీలు సాగిస్తున్నాయి. మహేంద్రని అతని అనుచరుల్ని బంధించిన మర్నాడే బాంక్ స్ట్రీటులోని లక్ష్మి బ్యాంకుని దోచేశారు. అంతక్రితం యీ కేసు పరిశోధనకు వెళ్ళిన యిద్దరు పోలీసు ఆఫీసర్ల జాడ లేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్—యెదురుగా కూచునివున్న డిటెక్టివ్ కిరణ్‌తో.

కిరణ్ శ్రీనివాస్ చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు.

"మహేంద్ర తేలికగా లొంగాడా?" అడిగాడు.

"ప్రతిఘటించాడు. అయినా చివరికి లొంగిపోయాడు.

అతని సాధరం ముట్టడించి అక్కడి ఆయుధాలు స్వాధీనం చేసుకున్నాను — ఇంకో యిద్దరు అనుచరులు అక్కడ కూడా దొరికారు. వాళ్ళని అదుపులోకి తీసుకున్నాం!"

కిరణ్ తలూపాడు.

"ఈ దోపిడీలకు ఓ అంతర్జాతీయ ముఠా హస్తం వున్నదని స్పష్టమవుతోంది. మహేంద్రనుగాని అతని అనుచరుల్నిగాని యెంత అడిగినా నోరు మెదపటంలేదు. చాలా మొండివాళ్ళు!"

కిరణ్ మందహాసం చేశాడు.

శ్రీనివాస్ ఉడుకుతున్నట్టు చూసి "అప్పుడే అథారిటీస్ నుంచి వార్నింగ్స్ వచ్చాయి. త్వరలో యీ దోపిడీలకు కారణమయిన ముఠాల్ని పట్టి బంధించమని ఆదేశాలు వచ్చాయి. ఫెయిలయితే చాలా తీవ్రంగా వుంటాయి పనిష్మెంట్సు!" అన్నాడు.

"ఇంతకీ నా కెందుకు కబురుపెట్టి పిలిచావో చెప్పనే లేదు!"

"అదేమిటి బ్రదర్, నిన్ను పిలిపించాల్సి వచ్చిందంటే అర్థం పరిస్థితి మా చేయిదాటిపోయిందని! మా కంట్రోల్లో వున్నంతవరకూ ప్రయత్నించాం. కాని, యిక మావల్ల కాదని తేలిపోయింది. కమిషనర్ గారు, డి.ఐ.జి. నీకు కబురు చేయమన్నారు. నీతో నాకు సన్నిహిత సంబంధాలున్నాయని తెలిసి నన్నే కబురు పెట్టమన్నారు. నువ్వు రాగానే ఫోన్ చెయ్యమన్నారు. చెయ్యనా?"

కిరణ్ చేయి ఎత్తి వారించి, "వద్దు! నేనిప్పట్లో యీ కేసులో యెలాంటి సహాయమూ చెయ్యలేను!" అన్నాడు.

శ్రీనివాస్ విస్తుపోయి చూశాడు.

"అదేమిటి బ్రదర్, నీమీదే హోప్స్ అన్నీ పెట్టుకొని వున్నారు" అన్నాడు.

"సారీ, నాకు ఇంకో అర్జంటు కేసుంది. ఆ కేసు వివరాలు సేకరించటానికి ఢిల్లీ వెళుతున్నాను. మళ్ళీ తిరిగొచ్చాక నే యిక యే కేసయినా చూసేది!" కిరణ్ అన్నాడు.

శ్రీనివాస్ నిస్సహాయంగా చూశాడు.

"నేను వచ్చిన వెంట నే కూడా మీ పనికి దిగటానికి అవుతుందో, లేదో! యెందుకంటే నేను వివరాలు సేకరించి వచ్చాక నా కేస్‌ని డిస్పోజ్ చెయ్యాలి కదా! అంతదాకా మీది టేకప్ చెయ్యలేను!"

శ్రీనివాస్ యిబ్బందిగా చూశాడు.

కిరణ్ చెప్పేదేం లేదన్నట్టు లేచి నిలబడ్డాడు.

"మళ్ళీ యెప్పుడొస్తున్నావు?" అడిగాడు శ్రీనివాస్.

"బహుశా ఓ వారం పట్టొచ్చు!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ కిరణ్‌ని స్టేషన్ బయటివరకు సాగనంపాడు. కిరణ్ టయోటా స్టార్టుచేసేవరకు శ్రీనివాస్ కిరణ్ దగ్గరే నిల్చుని వున్నాడు.

కిరణ్ సెలవు తీసుకుంటున్నట్టు చేయి ఊపాడు. టయోటా వెళ్ళిపోయింది!

ఆ మర్నాడు అన్ని పేపర్లలోను సంచలనం కలిగించిన వార్త!

మహేంద్ర జైలునుంచి తప్పించుకు పారిపోయాడు!

## 3

"కంగ్రాచ్యులేషన్స్ మిష్టర్ మహేంద్రా!"

మహేంద్ర తలతిప్పి చూశాడు. యెదురుగా వున్న

వ్యక్తి. స్నేహపూర్వకంగా నవ్వుతున్నాడు.

"నీకు తెలీదనుకుంటాను. ఈ పొవరం పోలీసులు వళ పరచుకున్నారు. నువ్విక్కడికి వస్తావని తెలిసి నేను యిక్కడే కాచుకుని వున్నాను. కమాన్ అదిగో నా కారు! బాస్ దగ్గరికెళ్దామా?" అన్నాడా వ్యక్తి పైపు పిలుస్తూ మహేంద్ర వంక స్నేహ పురస్సరంగా చేయి చాపి.

మహేంద్ర అతనితో కరచాలనం చేశాడు.

"ఆల్ రైట్, పోదాం!" అన్నాడు మహేంద్ర.

ఆ వ్యక్తి కారువైపు నడుస్తూ సిగరెట్ పెట్టెతీసి మహేంద్రకు ఆఫర్ చేశాడు. మహేంద్ర ఓ సిగరెట్ తీసుకుని సిగరెట్ అతనికిచ్చేశాడు.

"ఏమిటి డల్ గా వున్నావు? రెండ్రోజులు జైల్లో వుండగానే వేదాంతిలా తయారయ్యావే?" అన్నాడతను.

మహేంద్ర నవ్వి, "అదేంకాదు, పద!" అన్నాడు.

అతను డ్రయివింగ్ సీటు తలుపు తెరిచి కూచున్నాడు. అతని పక్క సీట్లో మహేంద్ర కూచున్నాడు. కారు కదిలింది.

"నేనొస్తున్నట్టు బాస్ కి తెలుసా?"

"ఉదయం పేపరు చూసేవరకు యెవరమూ అనుకో లేదు. పేపర్ లో నువు తప్పించుకున్న వార్త ప్రముఖంగా ప్రచురించారు. అది చూడగానే బాస్ నన్ను నీ దగ్గరకు వెళ్ళమన్నారు. అయితే నువ్వు ఎక్కడుంటావో అంచనా కట్టడం కష్టమయింది. యెక్కడున్నా నీవుండే పొవరాని కొస్తావని తెలుసు? అందుకే కారుతో బాటు అక్కడ వెయిట్ చేస్తున్నాను" అన్నాడతను.

"థాంక్స్!" అన్నాడు మహేంద్ర.

కారు చిన్న జర్క్‌తో ఆగింది.

మహేంద్ర ముందుకు చూశాడు. ఊరి పొలిమేరలు దాటి చాలా దూరం వచ్చేశారు.

అక్కడ కొండలబారు వున్నది. చాలా యెత్తయిన కొండలు బాగా విస్తరించి వున్నాయక్కడ.

కారు దిగారిద్దరు. కొండలబారువంక నడిచారు.

పైకి కొండలు మాదిరి కనిపించినా దగ్గరికి వెళ్ళేసరికి అక్కడ బిలమార్గాలు కనిపించాయి.

అతను ఓ బిలం దగ్గర నిలబడి చేత్తో కుడిపక్కన నేలమీద తడిమాడు.

అంతే! సొరంగం బయటపడింది. అంతవరకు అడ్డుగా వున్న బండరాయి పలక పక్కకి జరిగింది.

మహేంద్ర మౌనంగా అతన్ననుసరించాడు.

సొరంగం లోపలకు ప్రవేశించి మళ్ళీ లోపల ఏదో మీట నొక్కాడతను. బండరాయి మామూలుగా బిలానికి అడ్డుగా మూసుకుపోయింది.

ఇద్దరు లోపల కొంతదూరం నడిచాక ఓ సమతల ప్రదేశం చేరారు. అక్కడ కాగడాల వెలుతురులో కొందరు వ్యక్తులు నిల్చుని వుండటం, అక్కడ ఓ యెత్తయిన బండరాయిమీద కూచుని మరో వ్యక్తి తన యెదుట నిల్చున్న వాళ్ళకు ఏవో సూచనలిస్తున్నాడు.

"వెల్‌కం మహేంద్రా! నువు తప్పించుకొస్తావని నాకు తెలుసు. గుడ్ అడ్వెంచర్!" అన్నాడు ఆ వ్యక్తి.

"మనం అనుకున్నట్లే తన స్థావరం వద్దనే కనిపించాడు సార్! వెంటనే కారులో తీసుకొచ్చాను" అన్నాడు మహేంద్రతో వచ్చిన వ్యక్తి.

"గుడ్ మిష్టర్ ప్రకాష్. నువ్వు వెళ్ళొచ్చు. అయితే యీ రాత్రికి యే స్పాట్ యెన్నుకోవాలో చెప్పాను కదా!"

"చెప్పారు బాస్! ఈ రోజు వేటలో మిష్టర్ జస్వంత్ సహాయం కూడా తీసుకోమన్నారు!"

"జస్వంత్ అక్కర్లేదు, మహేంద్ర వచ్చేశాడుకదా! అతన్ని సాయం తీసుకువెళ్ళు. నీ ఫాలోయర్స్ ఎలాగూ వున్నారుకదా!"

"అలాగే సార్, జస్వంత్ కి కబురుచేస్తాను."

"నేను వైర్ లెస్ మెసేజ్ యిస్తాను. మళ్ళీ నువ్వు వెళ్ళటం దేనికి? అదీగాకుండా మనవాళ్ళు మకాముంటున్న రహస్య స్థావరాలకి తరచు వెళ్ళటం మంచిది కాదు! బయటి వాళ్ళుగాని, పోలీసులుగాని పసిగట్టారంటే ప్రమాదం! అందుకే మహేంద్ర స్థావరం మనం యికమీదట ఉపయోగించకూడదని నిర్ణయించుకున్నాం. అది పోలీసులకి తెలిసిపోయింది!"

"అవును బాస్! వాళ్ళకి స్థావరం తెలిసిపోవటమే కాదు. జయా బ్యాంకును లూటీ చేయబోతున్నట్టు ముందే తెలిసిపోయింది. అందుకే వాళ్ళు మాకన్న ముందు బ్యాంకు దగ్గర మాటువేసి మమ్మల్ని బంధించేశారు" అన్నాడు మంహేంద్ర.

"అంటే మీరు బ్యాంకు దోపిడికి ప్లాన్ చేస్తున్న సమయంలో యెవడో పోలీసుల తాలూకు మనిషి వినయినా వుండాలి. లేదా నీ ఫాలోయర్స్ యెవరైనా వాళ్ళకు ఉప్పందించి వుండాలి! నీ అనుచరులంతా నమ్మకస్తులేనా?"

"చాలా నమ్మకమైనవాళ్ళు బాస్! జైల్లో ఎన్ని చిత్ర

హింసలు పెట్టినా మన తక్కిన పాతరాల గురించిగాని, ముఠాల గురించి గాని, యేమాత్రం లీక్ చేయలేదు!"

"జైల్లో నిన్ను ఏమైనా అడిగారా? ఎలా తప్పించుకు రాగలిగావు? నువ్వొచ్చేశాక పోలీసులు మనవాళ్ళనుంచి రహస్యాలు కక్కిస్తారేమో!" బాస్ అనుమానం వెలిబుచ్చాడు.

"మనవాళ్ళు అవసరమైతే ప్రాణాలు త్యాగం చేస్తారే గాని యేమాత్రం రహస్యాలు బయటపెట్టరు బాస్! ఆ ధైర్యం వాళ్ళకుంది! నన్ను చాలా రకాలుగా హింసించారు. అయినా నేను బయటకు చిన్న రహస్యం కూడా లీకివ్వలేదు! రాత్రి సెంట్రీని పట్టుకుని వాడికి నేను కట్టుకున్న బంగారు మొలత్రాడు యిచ్చేశాను. అంతే వాడు నేను సెల్ నించి బయటపడి గోడదుమికేవరకు చూసీ చూడనట్టు వదిలేశాడు. నాతోబాటు మనవాళ్ళని కూడా తప్పించాలనుకున్నాను — కాని గోలయిపోతుందని ఆ సాహసం చెయ్యలేదు!" అన్నాడు మహేంద్ర.

"గుడ్! మనవాళ్ళకి బయటకి రప్పించే ప్రయత్నాలు చేద్దాం. నీకు సాయం చేసిన సెంట్రీ యెక్కడ వుంటాడో వివరాలు సేకరించావా?"

"ఆఁ! చంచల్ గుడాలోనే క్వార్టర్సులో వుంటున్నానని చెప్పాడు. అవసరమైతే యెలాంటి సాయమైనా చేస్తానన్నాడు."

"గుడ్! పోలీసుల్లో ఇలాంటి లంచగొండులున్నంత కాలం మనలాంటి డెకాయిట్స్‌కేం భయంలేదు. చక్కగా తప్పించుకోవచ్చు. సరే, యీ రోజు జస్వంత్ వేరే పని మీద పోతాడుగాని నువ్వు ప్రకాష్‌కి సాయంగా వెళ్ళు. జాగ్రత్త, ఓ పక్క నీకోసం పోలీసులు గాలిస్తూనే

వుంటారు" అన్నాడు బాస్.

మహేంద్ర, ప్రకాష్ బాస్ దగ్గర సెలవుతీసుకుని బయటికొచ్చారు. మీటలు నొక్కి బండరాయి పలకను తెరిచి మళ్ళీ మూసేశాడు ప్రకాష్.

"ఈ రోజు యే బ్యాంక్ ప్లాన్ చేశారు?" అడిగాడు మహేంద్ర.

"బ్యాంక్ కాదు! శేఠ్ చున్నీలాల్ నగల దుకాణం! చాలా జ్యూయెల్రీ వుందతని షాపులో. ఆ షాపుకి లాకింగ్ సిస్టమ్ చాలా పకడ్బందీగా వుంది. యేసిడ్స్ ఉపయోగించి తలుపులు తెరవటానికి అంతా ప్లాన్ చేశాం! నేను, జస్వంత్ వెళ్ళాలనుకున్నాం. నువ్వొచ్చావు కదా అని బాస్ నీకు అప్పగించాడు జస్వంత్ బాధ్యత!"

ఇద్దరు కారు దగ్గర కొచ్చారు.

"కారిలా రోడ్డుపక్కన వదిలి వచ్చావు కదా, పబ్లిక్ గాని పోలీస్‌కిగాని అనుమానం రాదా?"

"వస్తే రానివ్వు! కారు మనది కాదుగదా!"

"అంటే....?"

"ఇందాకా నీకోసమని దీన్ని రెడీమేడ్‌గా కోఠీ సెంటర్‌లో పార్కు చేసి వుంటే వేసుకొచ్చాను. దాని ఓనర్ పోలీసు రిపోర్టిచ్చి వాళ్ళు రంగంలోకి వచ్చి వుంటే దీన్ని యెవడో యిక్కడ వదిలేసి వుంటాడని తీసుకుపోతారు, లేకుంటే మనకు ఉపయోగపడుంది మరి కాసేపు. ఇప్పుడు దీని పనిలేదు మనకి! ఇక్కడే వదిలేసి పోతాం!"

"మన బాస్ స్థావరానికి దగ్గరలో వదిలేతే పోలీసులకి కోరి మన యిన్ఫర్మేషన్ యిస్తున్నట్టు కాదా?" అడిగాడు మహేంద్ర.

"చూశావు కదా బాస్ వుంటున్న స్థలం యెంత పకడ్బందీగా యేర్పాటయిందో! మనం వచ్చిన దారికాక, యెమర్జన్సీలో తప్పించుకు పోవటానికి మరో అండర్ గ్రౌండుంది లోపల. అక్కడ ఎలక్ట్రానిక్ యెక్విప్మెంట్ అంతా వుంది! అక్కడికి బాస్, ఒకరిద్దరు ముఖ్య అనుచరులుతప్ప యింకెవరూ వెళ్ళటానికి అనుమతి లేదు! అందుకే యెవరికి వాటి విషయం పూర్తిగా తెలీదు!"

"పోనీ ఈ కారుని సిటీకి బాగా దూరంగా వదిలేద్దాం యెందుకైనా మంచిది!"

"సరే, అలాగే పద!"

# 4

కూకట్పల్లి చేరాక "కహాఁరుక్నా సాబ్?" అనడిగాడు టాక్సీ డ్రయివర్.

"ఇదరీ రుకో!" అన్నాడు ప్రకాష్.

టాక్సీకి ఫేర్ చెల్లించాడు ప్రకాష్. ఇద్దరు రోడ్న నడుస్తున్నారు. కూకట్పల్లి కాలనీ దాటాడు. హౌసింగ్ బోర్డు కడుతున్న యిళ్ళ కాలనీ కూడా దాటేశారు.

ప్రకాష్ చుట్టూ పరీక్షగా చూశాడు. ఎవరూ తమని గమనించటంలేదని నిర్ధారణ చేసుకున్నాడు.

మరికొంతదూరం నడిచారిద్దరూ.

అక్కడ నిర్మానుష్యంగా వుంది. అన్నీ కొండలు, బండరాళ్ళు. రోడ్డు వదిలి బండలవైపు నడిచాడు ప్రకాష్. మహేంద్ర అనుసరిస్తున్నాడు.

"మనతో బాటు ఆరుగురు అనుచరులున్నారు. అందరూ బాగా అనుభవమున్నవాళ్ళే! సరిగ్గా ఒంటి

గంటన్నరకు వాళ్ళు ఆ ఏరియాలో గస్తి తిరిగే గూర్ఖాను ఉదయంవరకు లేవకుండా చేస్తారు. అప్పుడూ అప్పుడూ యిద్దరు బీట్ కానిస్టేబుల్స్ నైట్ పెట్రోలింగ్ కని నియమించబడుంటారు. వాళ్ళు చాయ్‌లు తాగుతూ యెక్కడో బాతాఖానీ కొడుంటారు.

శేర్ చున్నీలాల్ షాపు రోడ్డు చివరి మలుపులో వుంది. మనం చేసే పని రోడ్‌న పోయేవాళ్ళకు కనబడే అవకాశంలేదు! అదీగాక రాత్రి పన్నెండు తర్వాత యెవరూ రోడ్‌న నడవటానికి రూల్సు ఒప్పుకోవు. కాబట్టి మనను యీ హైదరాబాదు నగరంలో రాత్రి పన్నెండు తర్వాత అడిగే నాధుడులేడు! మనదే రాజ్యం!" నవ్వాడు ప్రకాష్.

మహేంద్ర తనూ నవ్వి, "ఈ నగరం పదికాలాల పాటు యిలాగే వర్ధిల్లాలని కోరుకుంటున్నాను!" అన్నాడు.

ప్రకాష్ పెద్ద బండరాళ్ళున్న గుట్ట దగ్గర ఆగాడు. అక్కడ ఆరుగురు వ్యక్తులు రాళ్ళు కొడుతున్నారు. ప్రకాష్‌ని చూసి కూడా చూడనట్టు తమ పనిలో నిమగ్నయిపోయి వున్నారు వాళ్ళు!

ప్రకాష్ వాళ్ళను చూపించి, "వీళ్ళే మన అనుచరులు!" అన్నాడు.

"ఇదేమిటి?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇది పగటి వేషం! మనకి ప్రత్యేకం యిక్కడ రహస్య స్థావరమంటూ ఏం లేదు. పగలంతా వీళ్ళు యిక్కడ రాళ్ళుకొట్టే కూలీలు. చీకటిపడ్డాక రాజ్యమేలే రారాజులు!" నవ్వుతూ అన్నాడు ప్రకాష్.

"మరి ఆయుధాలు ఎక్కడ దాస్తారు? పగలెవరైనా

చూసి అనుమానిస్తే కష్టంకదా?" అన్నాడు మహేంద్ర.

"అదిగో ఆ రాళ్ళు కొట్టి కుప్పలు పోస్తున్నారే, అవే ఆయుధాగారాలు! ఆ రాళ్ళగుట్టల అడుగున మన వాళ్ళక్కావలసిన రైఫిల్సు, బుల్లెట్సు, నాటుబాంబులు వగయిరా అన్నీ సంక్షిప్తమై వుంటాయి. ఎలా వుంది మన ప్లాన్?"

"చాలా బావుంది."

"ఇదివరలో నువ్వు యిక్కడికి రాలేదు గాబట్టి నీకివన్నీ కొత్తగా వున్నాయి. నా బెటాలియన్‌ని 'ఓపెన్ ఎయిర్ సోల్జర్సు' అని మనవాళ్ళు సరదాగా పిలుస్తుంటారు.... ప్రతి ఏజెంటుకు అండర్ గ్రౌండ్ స్థావరాలు కష్టం కదా! అంచేత నేనే బాస్‌కి చెప్పి యిలా మేనేజ్ చేస్తున్నాను నా గ్రూప్‌ని.

చీకటి పడుతోంది. రాళ్ళు కొడుతున్న వ్యక్తులు లేచి గుట్టల వెనుకకు వెళ్ళి దాచిన గుడ్డలు వేసుకుని వచ్చారు. అంతవరకు కూలీల్లా వున్న మనుషులు ఒకేసారి కులీనులయిపోయారు. షర్టులు, పేంటులు, మఫ్లర్లు వేసుకున్నారు. ప్రకాష్ దగ్గరగా వచ్చారు.

"ఈయన మరో యేజెంటు మహేంద్ర! నాలాంటి ఏజంట్ అన్నమాట! మీలో ఎవరైనా ఈయన్ని చూసి వుండొచ్చు యిదివరకు. అవునా?" అన్నాడు ప్రకాశ్ తన వాళ్ళకు మహేంద్రను చూపుతూ.

"మహేంద్రాజీ తెలియక పోవటమేమిటి? వారం రోజులక్రితం బాస్ జరిపిన జనరల్ బాడీ సమావేశంలో ఏజెంట్సందర్నీ పరిచయం చేశారుకదా!" అన్నారు వాళ్ళు.

"మరి వీళ్ళకి భోజన సదుపాయాలు?" సందేహం వెలిబుచ్చాడు మహేంద్ర.

"సారికి యిద్దరు చొప్పున యెర్రగడ్డపోయి హోటల్స్‌లో తిని తాగొస్తారు. తక్కువ వాళ్ళు యిక్కడ ఆయుధాగారానికి కాపలా....!" అని ప్రకాష్ చెప్తుండగానే రాళ్ళగుట్ట వెనకనించి బీప్....బీప్....అంటున్న శబ్దం వినిపించింది.

ప్రకాష్ రెండంగల్లో రాళ్ళగుట్ట వెనక్కు పరుగెత్తుకు వెళ్ళి రెండు నిమిషాల తర్వాత వచ్చాడు.

మహేంద్ర ప్రశ్నార్థకంగా చూశాడతనివంక.

"బాస్‌నించి మెసేజ్ వచ్చింది. అంతా సవ్యంగా వుందని, ఈ రోజు పాత బస్తీలో కర్ఫ్యూ మూలంగా పోలీసులు ఎక్కువమంది అక్కడే డ్యూటీమీద వుంటారని, లైన్ క్లియర్‌గా వుంటుందనీ చెప్పాడు. మనల్ని ప్రిపరేషన్‌లో వుండమన్నాడు!"

మహేంద్ర తలాడించాడు.

"సో, మనిద్దరం పోయి భోంచేసివద్దామా, లేక మన వాళ్ళచేత బిరియానీ పాకెట్స్ పట్టించుకురమ్మని చెప్దామా?" అన్నాడు ప్రకాష్.

మహేంద్ర నవ్వి, "వైన్ కూడా!" అన్నాడు.

ప్రకాష్ తనూ నవ్వి, "అది లేకుండా ఎలా?" అన్నాడు.

## 5

రాత్రి పన్నెండు దాటింది.

"లెటజ్ స్టార్ట్" అన్నాడు ప్రకాష్. అతని మాట బాగా ముద్దగా వస్తోంది. విస్కీ మోతాదుమించి తాగటంతో మత్తుగా వాలిపోతున్నాయి కళ్ళు.

మహేంద్ర పరిస్థితి కూడా దాదాపు అలాగే వుంది. కావలసిన సరంజామాతో అనుచరులు కదిలారు. ప్రకాష్,

మహేంద్ర, అరుగురు అనుచరులు రోడ్ మీద కొచ్చారు.

"ఈ రాత్రిపూట మనకు కన్వేయన్స్ యెలా దొరుకుతుంది?" అన్నాడు మహేంద్ర.

ప్రకాష్ అతనివైపు చిత్రంగా చూసి, "మీరు మొన్న దేన్లో వెళ్ళారు బ్యాంక్ కి?" అన్నాడు.

"జీవ్ లో!" అన్నాడు మహేంద్ర. "మేం లొంగిపోయాక, ఆ జీవ్ పోలీసులు స్వాధీనం చేసుకున్నారు."

"ఇప్పుడు మనకోసం మన కంపెనీ వేన్ వస్తుంది!" అన్నాడు ప్రకాష్ చిన్నగా నవ్వి.

సరిగ్గా అదే సమయంలో తెల్లటి స్టాండర్డు వేన్ వచ్చి వాళ్ళ ముందాగింది.

ప్రకాష్ డ్రయివర్ సీట్లోని వ్యక్తివంక చూసి "వెన్నెల చాలా చల్లగా వుంది!" అన్నాడు.

"రెండు రోజులుగా యిలాగే వుంది!" అన్నాడు డ్రయివర్.

అవి వాళ్ళ కోడ్ వర్డ్సు

ప్రకాష్, మహేంద్రతో డ్రయివర్ పక్కన యెక్కి కూచున్నాడు. అనుచరులంతా బాడీలో కూచున్నారు. వెంటనే వేన్ పరుగుతీసింది.

శేఠ్ చున్నీలాల్ షాపుకి యిరవై గజాల దూరంలో వేన్ అవ్ చేశారు.

ముందుగా ఓ అనుచరుడు ఏసిడ్స్, తాళాలగుత్తి తీసుకుని దిగి, చున్నీలాల్ షాపు దగ్గరకు వెళ్ళాడు. ఈ లోపల మరో అనుచరుడు వీధి చివరకు వెళ్ళి వచ్చాడు.

"గూర్ఖా వస్తున్నాడు" అన్నాడు గుసగుసగా.

ఈలోపల షాపు దగ్గరకు వెళ్ళిన వ్యక్తి చకచక ఏసిడ్స్ పోసి మారుతాళంచెవులతో తాళాలు తెరిచాడు.

వైండింగ్ స్టీల్ డోర్‌ని పైకి లేపాడు. గూర్ఖా అది చూసి అటు పరుగెత్తేటంతలో తక్కిన అనుచరులు వేన్ నుంచి దూకి గూర్ఖాను వెనకనుంచి పట్టుకున్నారు. ఏదో వాసన చూపించారు.

గూర్ఖా నేలమీదికి జారిపోయాడు.

ముగ్గురు అనుచరులు డోర్‌ని పైకి తోసేశారు.

ప్రకాష్, మహేంద్ర వేన్ దిగారు. వాళ్ళిద్దరి చేతుల్లోను రివాల్వర్లున్నాయి. అనుచరుల చేతుల్లో గన్స్ వున్నాయి.

ఇద్దరు అనుచరులు గుమ్మం దగ్గర వేటకుక్కల్లా కాపలా వున్నారు. డ్రయివర్ వేన్ లోనుంచి అందర్నీ పరీక్షగా చూస్తున్నాడు. రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. యే విధమైన వాహనాలు కూడా తిరగటంలేదు.

సరిగ్గా అదే సమయంలో పోలీసు వేన్, జీపు రెండు మోటారుబైక్‌లు పెద్ద చప్పుడు చేసుకుంటూ వచ్చేశాయి. పోలీసులు గన్స్‌తో బిలబిలమంటూ దిగిపోయారు.

ముందుగా ప్రమాదాన్ని గుర్తించిన వేన్ డ్రయివర్ సైరన్ లాంటి హారన్ బొయ్‌మనిపించాడు. ఒక్కసారిగా షాపునుంచి అందరు బయటికి పరుగెత్తుకొచ్చేశారు.

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ మోటర్‌బైక్ దిగి, "ఎవరూ పారిపోవాలని ప్రయత్నించవద్దు! మర్యాదగా లొంగిపోండి!" అంటూ అరిచాడు.

ప్రకాష్ చేతిలోని రివాల్వర్ గర్జించింది.

శ్రీనివాస్ చేతిలోని రివాల్వర్ ఎగిరి అవతలపడింది. అప్పటికే ఇన్‌స్పెక్టర్ కైలాష్ ప్రమాదాన్ని గుర్తించి ప్రకాష్ చేతికి గురిచూసి కాల్చాడు.

ప్రకాష్ నెత్తురు కార్తున్న చేతిని పట్టుకుని ఒక్క

పరుగున వేన్ వైపు తప్పించుకోవాలని ప్రయత్నించాడు. కాని అతని తొడలోనుంచి మరో బుల్లెట్ దూసుకు పోయింది కైలాష్ రివాల్వర్ నుంచి.

ఈలోపల ఆరుగురు అనుచరులు పోలీసులమీద కాల్పులు జరిపారు. ముగ్గురు కాన్‌స్టేబుల్స్ నేలవాలి పోయారు. ఆదేశమయంలో యిద్దరు అనుచరులు కూడా నేల కూలిపోయారు.

తక్కిన నలుగుర్ని పోలీసులు పట్టేశారు.

మహేంద్ర ఈలోపల తప్పించుకుని వేన్ దగ్గరకు పరుగుతుకుపోయాడు.

శ్రీనివాస్ మహేంద్రను గుర్తించి, "వాడే తప్పించుకుపోయిన డెకాయిట్ మహేంద్ర! వేన్‌లో పారిపోతున్నాడు పట్టుకో కైలాష్!" అని అరిచాడు, ఇన్‌స్పెక్టర్ కైలాష్ వంక తిరిగి.

కాని అప్పటికే వేన్ స్టార్టయి సర్రున ముందుకు పోయింది. దాన్నందుకోవాలనే ప్రకాష్ ప్రయత్నం ఫలించలేదు. నలుగురు అనుచరులతోను, పోలీసులకి బందీగా చిక్కిపోయాడు.

శ్రీనివాస్, తక్కిన సిబ్బంది వాళ్ళ అయిదుగుర్నీ పోలీస్ వాన్ వైపు నడిపిస్తున్న సమయంలో కిందపడున్న శ్రీనివాస్ రివాల్వర్ రెప్పపాటులో అందుకుని కాల్చుకున్నాడు ప్రకాష్.

మరుక్షణంలో పోలీసుల చేతుల్లో అతని శరీరం నిర్జీవంగా వేలాడింది.

పదినిమిషాల తర్వాత కైలాష్ మోటార్ బైక్ మీద తిరిగొచ్చి, "తప్పించుకు పోయాడు రాస్కెల్!" అన్నాడు.

"గాయాలు తగిలిన ముగ్గురు కానిస్టేబుల్స్ని వెంటనే హాస్పిటల్కి తరలించు. అలాగే ఆ యిద్దరు అనుచరుల్ని కూడా!" అన్నాడు శ్రీనివాస్ కైలాష్ నుద్దేశించి.

ఇంతలో సార్జెంట్ శివం "సార్, మనవాళ్ళు ఇద్దరు, వాళ్ళ మనిషి ఒకడూ చనిపోయారు!" అన్నాడు.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్, కైలాష్ హేట్స్ తీసి చేతుల్తో పట్టుకుని నిలుచుండిపోయారు కాసేపు.

## 6

"డిసీజ్ సెకండ్ ఫెయిల్యూర్!" అంటూ మండి పడ్డాడు బాస్ మహేంద్రమీద.

"ఏం చెయ్యమంటారు బాస్? నేనైతే రెండుసార్లు తప్పించుకు రాగలిగాను. కాని ప్రకాష్గాని, మన ఫాలోర్స్గానీ ఎస్కేప్ కాలేకపోయారు. అయామ్ సారీ! రెండుసార్లూ మనవాళ్ళు దొరికిపోయారు" అన్నాడు మహేంద్ర.

పోలీసులబారినుంచి తప్పించుకుని సరాసరి బాస్ను చేరుకుని జరిగిన సంగతి వివరంగా చెప్పాడు మహేంద్ర.

వేన్ డ్రయివర్ "మహేంద్రాజీ తప్పేంలేదు బాస్! ఆయనకూడా వాళ్ళకి దొరికిపోతే, నేనుకూడా తప్పించుకు రాలేకపోయేవాణ్ని! నానుంచి స్టీరింగ్ తనే తీసుకుని ధైర్యంగా డ్రయివ్ చేసుకుని వచ్చాడు మహేంద్ర" అని చెప్పాడు.

బాస్ కొంత శాంతించినా చిందులు వేయటం మానలేదు. "మనం యింత పకడ్బందీగా రైడ్సు చేసినా యీ విషయం పోలీసులకి ఎలా తెలిసిపోయింది? రెండు సందర్భాల్లోనూ కూడా వాళ్ళు సమయానికి ఎలా రాగలిగారు?

నాకు చాలా కండర్ గా వుంది. మనవాళ్ళల్లో నే ఎవరో పోలీసుల తో తుగా పని చేస్తున్నారేమోనని అనుమానం కూడా కలుగుతోంది! అది యెవరో తెల్సుకోవాల్సి వుంది!" అన్నాడు.

మహేంద్ర తలూపి, "కావటానికవకాశముంది బాస్!" అన్నాడు.

"మన బెటాలియన్స్ రెండు దొరికిపోయాయి పోలీసులకి. ఇక జస్వంత్ గ్రూపు, లతీఫ్ గ్రూపు మాత్రం మిగిలాయి. ఇన్ని దోపిడీలు యెంతో విజయవంతంగా జరిపిన మన సంస్థ ఘోరమైన యెదురు దెబ్బలు అప్పుడే రెండు రుచి చూసింది. రేపు ఫైనల్ ట్రయల్! ఇది విజయవంతం కాని పక్షంలో మనం హైదరాబాదు వదిలేసి మరో నగరం చూసుకోవటం చాలా ఉత్తమం!" అన్నాడు బాస్.

"మరి మన ఎక్విప్ మెంటు, వైర్ లెస్ ఆపరేటస్ ఎలక్ట్రానిక్ ఆపరేటస్ యిదంతా....?" అర్థోక్తిలో ఆగిపోయాడు మహేంద్ర.

"వెళ్ళిపోయే ముందు నాశనం చేసేసి వెళ్దాం. ఒకప్పుడు మనం యిక్కడ స్థావరమేర్పరుచుకున్న విషయం ఎవరికీ తెలియకూడదు. రూపురేఖలే లేకుండా చేసిపోదాం!" అన్నాడు బాస్.

మహేంద్ర తలూపాడు.

"మిష్టర్ మహేంద్ర, నువ్వు రేపు జస్వంత్ తో కలిసి పని చెయ్యాల్సి వుంటుంది. ఎక్కడ యేం చెయ్యాల్సిందీ అతను నీతో చెపుతాడు. ఉదయం మన వేన్ లోపోయి అతన్ని కలుసుకో! నే నీలోపల అతనికి మెసేజ్ పంపుతాను. టేక్ రెస్ట్ ఫర్ దిస్ నైట్ హియర్!" అన్నాడు

బాస్.

బాస్ అండర్ గ్రౌండుకి వెళ్ళిపోయాడు. మహేంద్రకు అక్కడే వసతి ఏర్పాటు చేయబడింది.

మహేంద్ర నిద్రపోవడానికి ప్రయత్నిస్తూ ఎలక్ట్రానిక్ వాచీలోకి చూశాడు. మూడు గంటలు కావస్తోంది.

ఓ అరగంట తర్వాత లేచి చూచున్నాడు మహేంద్ర. చుట్టూ దాదాపు పదిహేనుమంది అనుచరులు నిద్ర పోతున్నారు. ఇద్దరుమాత్రం సొరంగ ద్వారం దగ్గర పేటుకక్కల్లా కాచుకుని వున్నారు.

మహేంద్రకు బాస్ అండర్ గ్రౌండులో యేముందో చూడాలనిపించింది. చప్పుడు చెయ్యకుండా లేచాడు. సొరంగం దగ్గర కాపలా అనుచరులు మహేంద్రకు కని పించటంలేదు.

మహేంద్ర యిందాక బాస్ వెళ్ళిన దారి గుర్తు పెట్టుకుని అటు వెళ్ళాడు. సొరంగం ఇరుగ్గా వున్నచోట ఆగాడు. సొరంగం గోడలకి యేవో స్విచ్ లున్నాయి. వాటిని తడిమాడు. ఓ చోట గుండ్రంగా వున్న బిలం యేర్పడి, కిందికి మెట్లు కనిపించాయి. సన్నటి వెలుతురు మెట్లు దిగడానికి వీలుగా వున్నట్టు మెట్లుమీద పడు తోంది.

ఎక్కడ్నుంచో పెద్దగా యింజను శబ్దం వినిపిస్తోంది. అది జనరేటర్ శబ్దమని మహేంద్ర గ్రహించాడు. మెట్లు దిగాడు.

అది ఓ పెద్ద హాలులా వుంది. ఆ హాలునిండా టెలి విజన్ సెట్లవంటి సెట్లున్నాయి. స్క్రీన్ మీద యేవో తరంగాల మాదిరిగా గీతలు వస్తున్నాయి పోతున్నాయి. మూడు సెట్ల్సున్నాయి, వాటిముందు ముగ్గురు వ్యక్తులు

కూచుని వున్నారు.

ఆ పక్కనే నాలుగైదు బల్లలమీదున్న సెట్స్ వైర్‌లెస్‌కి సంబంధించినవని చూడగానే గ్రహించాడు మహేంద్ర. శబ్దం కాకుండా గోడని అనుకునే ముందుకి జరిగాడు.

అక్కడ చాలా తుపాకులు గుట్టగా పోసివున్నాయి. సంచుల్లో నిండుగా బుల్లెట్స్ బయటికి తొంగిచూస్తున్నాయి. ఓ పక్కగా పెద్ద గన్నీ బేగ్‌లో నాటు బాంబులున్నాయి. హాలుకి చేర్చివున్న గదివైపు కదిలాడు మహేంద్ర!

చెక్కతో చేయబడ్డ తలుపు. ఆ గదిని హాలునించి వేరుచేస్తోంది.

తలుపు తోశాడు. లోపల ఓ నలభై యేళ్ళ వ్యక్తి పడుకుని నిద్రపోతున్నాడు. అతనికి రెండుపక్కలా అందమైన ఇద్దరు అమ్మాయిలు పూర్తిగా నగ్నంగా వున్నారు. వాళ్ళు కూడా ఒళ్ళు ఎరక్కుండా నిద్రపోతున్నారు. పక్కనే వున్న టీపాయ్‌మీద వేట్ 69 బాటిలు, గ్లాసులు, ఐస్‌క్యూబ్స్ వున్న జగ్‌లు వున్నాయి.

ఆ వ్యక్తిని చూసి ఎక్కడో చూసినట్టుందని కాసేపు గుర్తుచేసుకోవటానికి ప్రయత్నించాడు మహేంద్ర!

అతనికి వెంటనే తట్టింది—అతను బాస్!

కాని యీ రూపం వేరు, ఎప్పుడూ కనిపించే రూపం వేరు! అతను అందరికీ కనిపించే రూపం కళ్ళకు నల్లటి కళ్ళద్దాలతో, పెద్ద మీసాలతో, మూతి దిగువనుంచి కాళ్ళవరకు వేసుకున్న నల్లటి ముసుగుతో, ఒత్తుగా పెరిగిన జుట్టుతో పొడవుగా కనిపిస్తాడు.

కానీ యిప్పుడు అవేమీ లేవు! కళ్ళకు అద్దాలు లేవు.

దుబ్బు జుట్టు స్థానంలో బట్టతల. బోడి మూతి—మీసా లేవు. మూతి దిగువనుంచి వుండాల్సిన మసుగు మొదలే లేదు. ఆ ఆకారం చాలా పొట్టిగా వుంది! ఒంటిమీద నూలుపోగుకూడా లేదు.

అవన్నీ పక్కనున్న టేబిలుమీద దర్శనమిస్తున్నాయి. అవే పైకి కనిపించేలా లేకుంటే, అతనే బాస్ అని మహేంద్ర ఎట్టి పరిస్థితుల్లోనూ నమ్మేవాడు కాదు!

అయితే ఈ పొట్టి వ్యక్తి....? మహేంద్ర మెదడులో మెరుపులు మెరిశాయి.

అవును! అతనే!....అతనే యీ బాస్!

మహేంద్రకు మంచు తెర విడిపోయింది.

చప్పుడు కాకుండా మెట్లు యెక్కి తను పడుకున్న చోటికి వచ్చాడు. ఎవరూ తనని గమనించలేదని నిర్ధారణ చేసుకున్నాక ఓ పక్కకు తిరిగి నిద్రకుపక్రమించాడు మహేంద్ర.

ఇంతలోనే అతనికేదో తట్టింది. చప్పుడు చెయ్యకుండా మెట్లు దిగాడు. ఇందాకటి హాలు, బాస్ రూందాటి యింజన్ చప్పుడవుతున్న ప్రదేశానికి మెల్లగా చేరుకున్నాడు.

అది కేబిన్ రూంలా వుంది. దాంట్లో జనరేటర్ పని చేస్తోంది. ఆ స్థావరంగానికంతటికీ వెలుగును ఎలక్ట్రానిక్ అపరేటస్ పనిచేయటానికి కావలసిన ఎలక్ట్రిసిటీ అక్కడి నుంచే సప్లై అవుతున్నట్టు గమనించాడు మహేంద్ర.

కేబిన్ రూం పక్కనే మరో ఏంటి రూంలా వున్న గది కనిపించింది. అన్నీ చెక్కలతో కట్టిన గదులే! లోపలికి అడుగుపెట్టిన మహేంద్ర గుర్పాటులో ఓ క్షణం అడుగు వెనక్కి వేశాడు.

అక్కడ ఖాకీ పేంట్లు, బనియన్స్‌తో వున్న యిద్దరు యువకులు కాళ్ళు చేతులు ఓ పెద్ద బండకు కట్టబడి నిస్సహాయస్థితిలో శోషవచ్చి పడిపోయినట్లు కనిపిస్తు న్నారు!

నించునే నిద్రపోతున్న ఆ యిద్దరిలో కళాకాంతులు లేక బాగా నీరసంగా నిస్త్రాణగా వున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది.

ఆ యిద్దరు యెవరో అర్థమైంది మహేంద్రకు. బాస్ చేత బంధింపబడిన పోలీస్ ఇన్‌స్పెక్టర్లు వాళ్ళు! వాళ్ళని చంపకుండానే వుంచాడన్నమాట! వాళ్ళద్వారా తమ క్కావలసిన వివరాలు చెప్పించటానికే ప్రాణాలతో వుండనిచ్చాడు బాస్. లేకుంటే, తను దారికి అడ్డొచ్చి నందుకు యెప్పుడో చంపి పాతేసి వుండేవాడు!

మహేంద్ర వెనుతిరిగి మెల్లగా గదులన్నీ దాటు కుంటూ హాలు దగ్గరకొచ్చాడు. హాల్లోని వ్యక్తులు కదలక మెదలక బొమ్మల్లా కుర్చీలకు అతుక్కుపోయి అలాగే వున్నారు.

మెల్లెక్కుతుండగా పై మెట్టు దగ్గర ఎవరో నిల్చుని వుండటం చూసి ఉలిక్కిపడ్డాడు మహేంద్ర.

అతను సొరంగం ముఖద్వారం దగ్గర కాపలా వున్న యిద్దరిలో ఒకడు! అతన్ని చూసి మహేంద్ర చిన్నగా నవ్వాడు.

అతను "ఏం మహేంద్రాజీ, యెక్కడ్నుంచి వస్తు న్నారు? ఈ క్రింద బాస్ రహస్య మందిరమనీ, దాని లోపలికి యెవరికీ ప్రవేశంలేదనీ నీకు తెలియదా?" అన్నాడు సీరియస్‌గా.

"తెలుసు, తెలుసు! బాగా దాహమయింది. మంచి

నిళ్ళు దొరుకుతాయేమోనని దిగాను."

"మమ్మల్ని అడిగితే యిచ్చేవాళ్ళం కదా!"

"మీరెక్కడో సెంట్రీ డ్యూటీమీదున్నారు కదా! పడుకున్న వాళ్ళను లేపటానికిష్టంలేకపోయింది!"

"రండి యిస్తాను" అతను మాట నొక్కి అండర్ గ్రౌండ్ బిలాన్ని మామూలుగా మూసేశాడు.

## 7

ఉదయమే మహేంద్రను వేన్ మీద జస్వంత్ వుండే స్థావరానికి తీసుకుని బయల్దేరాడు డ్రయివర్. బాస్ అప్పటికింకా లేవలేదుగాని, రాత్రి యిచ్చిన ఆదేశం డ్రైవర్ కి సుగ్రీవాజ్ఞ.

మహేంద్ర యింకా తెల్లవారని గుడ్డి వెలుతురులో హైదరాబాదు నగర వీధుల్ని పరికిస్తున్నాడు. ఊరి పొలిమేరల్లో వున్న బాస్ రహస్య స్థావరంనించి బయల్దేరిన వేన్ నల్లగొండ చౌరస్తామీదుగా విజయవాడ రోడ్ కి తిరిగింది. దిల్ సుక్ నగర్, కొత్తపేట చౌరస్తా దాటి పోయాయి. వరసగా వున్న పౌల్ట్రీఫారంస్ దాటిపోతూ, చివరిగా వున్న ఓ పౌల్ట్రీఫారం ముందాగింది వేన్.

"ఇదే జస్వంత్ స్థావరం! లోపలికి వెళ్ళండి" అన్నాడు వేన్ డ్రయివర్.

"నువ్వూ వస్తావా?" అడిగాడు మహేంద్ర.

"రాకూడదు సార్! బాస్ చెప్పింది మిమ్మల్ని యిక్కడకు చేర్చటంవరకే! లోపల యేం జరుగుతుందో, యెవరున్నారో నేను చూడకూడదు. అది రూలు. రూలు తప్పితే బాస్ ప్రాణాలతో వదలడు."

మహేంద్ర తలూపాడు. వేన్ వెళ్ళిపోయింది.

మహేంద్ర పౌల్ట్రీఫారం లోపలికి అడుగులు వేశాడు.

వరసగా కట్టబడిన వైర్ మెష్ షెడ్డు అంతా కొత్తగా కట్టినట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది!

ఎవరు మనుషులున్న జాడే కనిపించలేదు మహేంద్రకు.

అప్పటికి బాగా వెలుగు వచ్చేసింది. సూర్యకిరణాలు పౌల్ట్రి షెడ్స్‌మీదపడి మెరుస్తున్నాయి.

మహేంద్ర అడుగులో అడుగు వేసుకుంటూ అటు యిటు చూస్తూ అక్కడే తచ్చాడుతున్నాడు. అక్కడ నాలుగు పౌల్ట్రి షెడ్స్ తప్ప యింకేం లేవు!

"హల్లో, మహేంద్రాజీ! మీరా? యెవరో అనుకున్నాను" అన్న మాటలు వినిపించి మహేంద్ర చటుక్కున తిరిగిచూశాడు.

ఆ మాటలు తనపక్కగా వున్న షెడ్ నుంచి వస్తున్నట్టు గుర్తించాడు. షెడ్ తలుపులు తెరుచుకుని ఓ నడివయసు వ్యక్తి బయటికొచ్చాడు.

మహేంద్ర వెంటనే అతని వైపు చిరునవ్వులో అడుగులువేసి "హల్లో జస్వంత్ జీ, నేనే! బాస్ మీ దగ్గరికి పంపించాడు. మీరెవరూ కనిపించకపోవటంతో నిల్చుని చూస్తున్నాను!" అన్నాడు.

జస్వంత్ ముఖంలో ఏదో అనుమాన వీచిక మెరిసి మాయమయింది.

"మనవాళ్ళెవరూ కనిపించరే, యేమయ్యారు?" అడిగాడు మహేంద్ర.

జస్వంత్ రెండు క్షణాలేవో ఆలోచించి అంతలోనే చిర్నవ్వు నవ్వి, "చెప్పుకోండి చూద్దాం!" అన్నాడు.

మహేంద్ర చుట్టూ కలయజూసి "మీరు వచ్చిన షెడ్ లోనే ఉండివుంటారు!" అన్నాడు.

జస్వంత్ ముఖంలో ఆశ్చర్యం యీసారి కొట్టొచ్చి

నట్టు కనిపించింది. "ఏరీ? అతన్ని కోళ్ళే!" అన్నాడు.

మహేంద్ర నవ్వేసి, "చెప్పలేను, మీరే చెప్పె య్యండి!" అన్నాడు.

జస్వంత్ అందుకు సమాధానమివ్వకుండా, "ఇంత ఉదయాన్నే వచ్చారు, కారణమేమిటి?" అన్నాడు.

"బాస్ మీ దగ్గరకు వెళ్ళమన్నాడు. మీకు ప్రోగ్రాం గురించి తెలుసునని నన్ను ఈ రోజు మీతో కలిసి పని చెయ్యమనీ చెప్పాడు....అన్నట్టు, ఈ రోజు ప్రోగ్రాం యేమిటి? బ్యాంకా, నగల దుకాణమా?" అడిగాడు మహేంద్ర.

జస్వంత్ వెంటనే సమాధానం చెప్పలేదు.

"బాస్ నీతో....అదే, మీతో యేం చెప్పలేదా?"

"లేదు. పోయి మిమ్మల్ని కలుసుకోమన్నారు!"

"నాతో యేం చెప్పలేదే!"

"చెప్పలేదా? చిత్రంగా వుందే! నిన్న రాత్రి నేను బాస్ దగ్గరే వున్నాను. మీకు మెసేజ్ పంపుతా నన్నారు. బహుశా వైర్‌లెస్ లోపించి వుండాలి!"

"ఎందుచేతనో మరి, పంపలేదింకా!"

"ఫరవాలేదు, యిప్పుడు బహుశా పంపుతారు. నే నిక్కడ దిగిం తర్వాత డ్రయివర్ వెళ్ళి యిన్ఫర్మేషన్ చెపుతాడు. ఆ తర్వాత మీకు మెసేజ్ పంపవచ్చునని పూరుకుని వుంటాడు బాస్!"

జస్వంత్ జేబులోంచి సిగరెట్ ప్యాకెట్టుతీసి ఓ సిగరెట్ మహేంద్రకు ఆఫర్ చేశాడు.

మహేంద్ర సిగరెట్ తీసి పెదాల మధ్య బిగించాడు. ఇద్దరికీ సిగర్ లైటర్‌తో సిగరెట్లు వెలిగించాడు జస్వంత్.

"నాతో రండి!" అంటూ ముందుకి దారితీశాడు

జస్వంత్. పౌల్ట్రీ షెడ్లకు ఆనుకుని ఆఫీసురూంలా వున్న ఓ గదిలోకి తీసుకు వెళ్ళాడు జస్వంత్—మహేంద్ర అతనితో కలిసి వెళ్ళాడు.

"అనుచరుల గురించి అడిగారు కదూ, రండి చూపిస్తాను!" అన్నాడు జస్వంత్.

మహేంద్ర తక్కిన మూడు షెడ్లకన్న నాలుగో షెడ్డు కొంత విలక్షణంగా వుండటం గుర్తించాడు. నాలుగో షెడ్‌కి ఆనుకుని వున్న ఆ రూంకి పక్కనే రెండు గదులున్నాయి. ఆ షెడ్లో కోళ్ళు యేవీ లేవు. మూడు షెడ్లనిండా కోళ్ళు, వాటికి ఆహారం వేయటానికుపయోగించే పాత్రలు వున్నాయి. నాలుగో షెడ్‌లో వాటికి వేసే ఆహారం, తౌడు బస్తాలు వున్నాయి.

జస్వంత్ రెండో గది తలుపుమీద మునివేళ్ళతో శబ్దం చేశాడు. తలుపు సగం తెరుచుకుని అందులోనుంచి అయిదుగురు వ్యక్తులు బయటికి వచ్చారు. అందరు పేంట్లు బనియన్లు వేసుకుని వున్నారు. వాళ్ళందరి చేతుల్లోను గన్స్ వున్నాయి.

మహేంద్ర ఆశ్చర్యంగా చూశాడు.

జస్వంత్ చిన్నగా నవ్వి, "ఈయన మన ఫ్రెండ్! నాలాంటి మరో ఏజెంటు! గన్స్ దించండి!" అన్నాడు.

అనుచరులు గన్స్ దించి నేలకి ఆనించి వుంచారు.

"ఈ రాత్రికి ప్రోగ్రాం గురించి అడిగావు కదూ, చెప్పటం మరిచాను. రాత్రి పన్నెండున్నరకు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ యిల్లు లూటీ చెయ్యబోతున్నాం!"

"ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ యిల్లా? పోలీసు యింట్లో మనకేం దొరుకుతుంది? ధనమా, బంగారమా?"

జస్వంత్ పెద్దగా నవ్వి, "పోలీసుల యింట్లో కోటి

శ్వరుడి యింట్లో కూడా దొరకని మణులు, మాణిక్యాలు కావల్సినన్ని స్మగుల్డ్ గూడ్సు దొరుకుతాయి__నీకింకా తెలీదేమో!" అని తన జోక్కి తనే మళ్ళీ పడిపడి నవ్వాడు.

మహేంద్ర ఏం మాట్లాడలేదు.

"ఇంకో విషయం కూడా ముందే చెప్పేస్తున్నాను. ఇన్‌స్పెక్టర్ని పై లోకానికి పంపించెయ్యబోతున్నాం!"

మహేంద్ర ముఖంలో ఆశ్చర్యం కొట్టొచ్చినట్టు కనిపించింది.

"మన బాస్ యెవర్నీ ఎంతో అవసరమైతే తప్ప చంపవద్దన్నాడు కదా! యింతక్రితం యిన్‌స్పెక్టరని కూడా...." అని నాలుక్కొరుచుకున్నాడు మహేంద్ర.

జస్వంత్ వెంటనే, "ఆ....యింతక్రితం యిన్‌స్పెక్టరని....ఏం చేశాడు బాస్? చంపేశాడు కదా!" అన్నాడు.

"అదే అంటున్నాను. చంపేశాడని కొందరు చంపలేదని కొందరు మనవాళ్ళే అనుకొంటుంటే విన్నాను. చంపేశారన్నమాట!" అన్నాడు మహేంద్ర తప్పు దిద్దుకుంటూ. తను బాస్ అభ్యంతర మందిరం పక్కనున్న గదిలో యినస్పెక్టరని సజీవంగా చూసిన విషయం బయటపడకుండా జాగ్రత్తపడ్డాడు.

"బాస్ యింత చిన్న పనికి మిమ్మల్ని కూడా నాకు తోడుపంపించడం దేనికో అర్థం కాకుండా వుంది!" అన్నాడు జస్వంత్.

"నేనింకా యేదో పెద్ద బ్యాంకో, నగల దుకాణమో మరే కోటీశ్వరుడి యిల్లో అనుకున్నాను. ఆఫ్టరాల్ ఓ పోలీసు యినస్పెక్టర్ని చంపడం, యిల్లు లూటీచెయ్యటం

మనకు మంచినీళ్ళ ప్రాయం!" అన్నాడు మహేంద్ర.

"కమాన్ అండ్ సిట్ డవున్! యు ఆర్ మై గెస్ట్! యేం తీసుకుంటావు? సారీ, నిన్ను ఏకవచనంలోకి చాలా సార్లు సంబోధిస్తున్నాను. యేమీ అనుకోవటం లేదు కదా మీరు?"

"ఛ, ఛ, మనలో మనకు మన్ననలెందుకు? 'నువ్వు' అని పిలిస్తేనే ఆత్మీయంగా వుంటుంది."

"ఓ..కే! కూచో, యిప్పుడే వస్తాను!" అంటూ పక్క గదిలోకి వెళ్ళాడు జస్వంత్.

# 8

మహేంద్ర చుట్టూ చురుగ్గా చూశాడు. అనుచరులు కోళ్ళ మేత కలుపుతున్నారు దూరంగా. జస్వంత్ పక్క గదిలోనుంచి వచ్చేలోపల తన పని పూర్తికావాలి.

మహేంద్ర రిస్టువాచీ బటన్ బయటకు లాగాడు. పొడవైన తీగ బయటికొచ్చింది. చకచక మెసేజ్ అందించేశాడు.

"హేండ్సప్ మిష్టర్ కిరణ్!" అన్న మాటలు విని పించి చటుక్కున వెనుతిరిగాడు.

జస్వంత్ చేతిలోని రివాల్వర్ ఆకలిగొన్న పులిలా మహేంద్రవైపు గురిపెట్టబడి వుంది!

మహేంద్ర వాచీ బటన్ మామూలుగా నొక్కేసి "వాట్? కిరణ్ యెవరు? అయామ్ మహేంద్ర!" అన్నాడు.

జస్వంత్ పగలబడి నవ్వాడు.

"నువ్విక్కడికొచ్చిన క్షణమే నువ్వు శత్రువువని గుర్తించాను మిష్టర్ కిరణ్! మంహేంద్రకు నేనెక్కడుంటానో, నా అనుచరులెక్కడుంటారో బాగా తెలుసు!

సరాసరి నా దగ్గరికి వచ్చేవాడు. నీలా దిక్కుదరీ తోచక పెడమధ్యనించుని వెర్రి చూపులు చూసేవాడు కాదు! అప్పుడే నీమీద అనుమానం వచ్చింది.

"నంబర్ టూ! మహేంద్ర నా క్లోజ్ ఫ్రెండు. మే మిద్దరం యేరా అంటే యేరా అనుకుంటాం. అంత క్లోజ్! నువ్వు నన్ను బహువచనంతో సంబోధించటమే కాక, మహేంద్ర మాటని బాగా అనుకరించలేక పోయావు.

"నంబర్ త్రీ! మహేంద్ర ఎట్టి పరిస్థితిల్లోనూ డంకన్ సిగరెట్లు తప్ప మరో బ్రాండ్ తాగడు. నువ్వు నేను ఆఫర్ చేసిన రీజెంట్ ఫిల్టర్ సిగరెట్టు సంకోచంగా తాగావు. అదీగాకుండా నువ్వు రాత్రి ప్రోగ్రాం గురించి యిప్పట్నుంచీ తొందరపడుతున్నావు—రాగానే అదే ప్రశ్న వేశావు. అంటే యిన్ఫర్మేషన్ యెవరికో అందచెయ్యటానికి సిద్ధంగా వున్నావన్నమాట.

"ఈ కారణాలవల్ల నువ్వు మహేంద్రవు కాకపోవ టమేగాక, పోలీసువాడివని అనుమానం బలపడింది. అందుకే కావాలని ఇనస్పెక్టర్ శ్రీనివాస్ యిల్లు లూటీ చేసి అతన్ని హతమార్చబోతున్నట్టు చక్కటి అబద్ధం చెప్పాను. నా అనుమానం నిజమయితే, నువ్వు వెంటనే ఆ విషయం యేదో శ్రీనివాస్ కి అందచేస్తావు. అదేమిటో తెల్సుకోవటంకోసం కావాలని పని కల్పించుకుని పక్క-గదిలోకి వెళ్ళాను.

"నా అనుమానం రుజువయింది. నువ్వు నీ ఫ్రెండుకి అప్పుడే అన్ని జాగ్రత్తలు చెపుతూ మెసేజ్ పంపేశావు. నీ నిజస్వరూపాన్ని నువ్వే బయట పెట్టేసుకున్నావు. మహేంద్ర వేషభాషల్ని, రూపురేఖల్ని చాలా చక్కగా

అనుకరించి బాస్‌తో బాటు అందర్నీ బోల్తా కొట్టించావు.

"అయితే బాస్‌కి ఎందుకో నీమీద అనుమానం వచ్చింది. నువ్విక్కడికి రావటానికి అయిదు నిమిషాలక్రితం మెసేజ్ పంపాడు—నిన్నొక కంట కనిపెట్టి వుండమని! రెండుసార్లు మా ప్లాన్స్ ఘోరంగా పరాజయం పొందటానికి నువ్వే కారణమయి వుంటావని కూడా చెప్పాడు. అయితే బాస్ నువ్వే కిరణ్ అని అనుమానించలేదు. మహేంద్రగానే భావించి, నువ్వు యేదో ప్రలోభానికి లోబడి పోలీసులకి మా గుట్టుమట్లు చెప్తున్నావని మాత్రమే అనుమానించాడు.

"కాని నీ ప్రవర్తనలో అన్ని విషయాలు నేను గ్రహించాను. కిరణ్ నువ్వేనని గుర్తుపట్టేశాను!" జస్వంత్ యింకా నవ్వుతూనే వున్నాడు.

మహేంద్ర ఉరఫ్ కిరణ్ చటుక్కున జేబులోకి చేతిని పోనివ్వబోయాడు.

జస్వంత్ గట్టిగా అరిచి చెప్పాడు. "మిస్టర్ కిరణ్, తెలివితక్కువ పనులు చెయ్యవని నా నమ్మకం! మర్యాదగా చేతులు పైకెత్తి ఆ గోడ పక్కగా నించో!" రివాల్వర్ మరింత కావన్‌గా పట్టుకుని అన్నాడు.

డిటెక్టివ్ కిరణ్ చేతులు పైకెత్తి జస్వంత్ చెప్పినట్టే చేశాడు.

జస్వంత్ కిరణ్‌ని సమీపించి, "ప్లీజ్ ఆ వాచీ యిలా యిచ్చెయ్యి!" అన్నాడు.

కిరణ్ మారుమాట్లాడకుండా వాచీ తీసి జస్వంత్ కందించాడు. అందిస్తూ అతను బటన్‌మీద మెల్లగా ఒత్తడం జస్వంత్ గమనించలేదు!

"మిస్టర్ కిరణ్, మమ్మల్ని బోల్తా కొట్టించాలని

కావాలనే నువ్వు యేదో పనిమీద ఢిల్లీ వెళుతున్నట్టు నాటకమాడావు. నువ్వు, శ్రీనివాస్ మాట్లాడుకున్న విషయాలు మా బాస్ విన్నాడు. అయితే ఆ తర్వాత నువ్వు బేగంపేట్ విమానాశ్రయంవరకు వెళ్ళటం మా అనుచరులు చూశారు. విమానం యెక్కటం కూడా చూశారు. నువ్వు నిజంగానే ఢిల్లీ వెళ్ళిపోయావనే అనుకున్నారు.

"మహేంద్ర బంధింపబడ్డాక నువ్వు మహేంద్ర వేషంలో తప్పించుకు పోయినట్టు నాటకం ప్రారంభించావు. మా బాస్ నమ్మాడు, ప్రకాష్ కూడా నమ్మాడు. ప్రకాష్‌తో కలిసి చున్నీలాల్ షాపు లూటీ చెయ్యబోతున్న విషయం శ్రీనివాస్‌కి మెసేజ్ పంపి వుంటావు. నువ్వు మాత్రం తెలివిగా తప్పించుకుని పోయావు. నిన్ను కైలాష్ కొంబడించటం కూడా నాటకంలో ఓ భాగమే! అవునా?" అన్నాడు జస్వంత్ నవ్వుతూ.

కిరణ్ నవ్వి, "నువ్వు చాలా తెలివైనవాడివని ఒప్పుకుంటున్నాను. నీకీ విషయాలన్నీ యెలా తెలుసు?" అన్నాడు.

"నువ్వు ఇనస్పెక్టరి దర్శిని సజీవంగా చూసి వుండి వుంటావని కూడా నాకు తెలుసు అవునా?"

కిరణ్ తలూపి, "అవును. తెలుసుకున్నాను" అన్నాడు.

"అక్కడే హాల్లోవున్న ఎలక్ట్రానిక్ పరికరాలు, వైర్‌లెస్, టెలివిజన్ సెట్లుకూడా చూశావుకదా! వాటిద్వారా యివన్నీ, బాస్‌కి ఎప్పటికప్పుడు తెలుస్తూనే వున్నాయి. ఆ విషయాలు ఎప్పటికప్పుడు ఆయన తెలియజేస్తూవచ్చాడు!"

కిరణ్ తలూపి, "ఇదంతా చాలా ప్లాన్డ్‌గా జరిగిందన్నమాట! మీరందరు యిక్కడ వివిధ వృత్తులు చేపట్టిన వ్యక్తుల్లాగా చక్కగా అమరిపోయారంటే, మీకు ఇక్కడ స్థానికంగా కొంతమంది వ్యక్తులు బాగా సాయపడుతున్నారని నాకు అర్థమైంది!" అన్నాడు.

జస్వంత్, "చివరిసారిగా నీ దేవుడ్ని తలుచుకో!" నిన్ను వెంటనే చంపెయ్యమని బాస్ ఆర్డరు. యిప్పటిదాకా నీతో వాదన వేసుకోవటం ఆయనకు తెలిస్తే నన్ను చంపుతాడు! ఇదివరలో పోలీసువాళ్ళని చంపవద్దనేవాడు, కాని నీ సంగతి యింతక్రితమే నేను వైర్‌లెస్‌లో చెప్పగానే వెంటనే ప్రాణాలు తీసెయ్యమన్నాడు. నువ్వు బతికుంటే యింకా చాలా ఘోరాలు జరిగిపోతాయని ఆయనకు తెలుసు!" అన్నాడు. అతని వేలు ట్రిగ్గర్ మీద బిగుసుకోవటం కిరణ్‌కి స్పష్టంగా కనిపిస్తోంది.

"ఒక్కమాట! మీ బాస్ ఎవరు? అతని పేరేమిటి? ఇదొక్కటి చెప్పి నన్ను చంపెయ్యి!" అన్నాడు కిరణ్.

జస్వంత్ పెద్దగా నవ్వి "చావబోయే వాడివి నీకెందుకంత యింట్రెస్టు?" అన్నాడు.

"ఊరకే తెల్సుకుని చద్దామని!"

"చెప్పను, చెప్పకూడదు! మేము ఎంత డెకాయిట్స్ అయినా మాకుందే నీతి మాకూ వుంది! ఎవరికీ యెట్టి పరిస్థితుల్లోనూ చెప్పమని రక్తప్రమాణం చేశాం!" జస్వంత్ చేతిలోని రివాల్వర్ మరుక్షణం గర్జించి వుండేదే! అతని రివాల్వర్‌లోని బుల్లెట్ కిరణ్ నెత్తురు రుచిమాచి వుండేదే!

కాని కిరణ్ కాళ్ళతో చిన్న అద్భుతం సృష్టించాడు.

అతని షూ కింద అమర్చబడిన సాకెట్ నుంచి ఒక్క-సారిగా విపరీతమైన గ్యాస్ బయటికొచ్చింది.

జస్వంత్ ఉక్కిరి బిక్కిరై పోయాడు. ఆ ఒక్క క్షణాన్ని సద్వినియోగం చేసుకున్నాడు కిరణ్. కోటు జేబునుంచి రివాల్వర్ తీసి అంత చురుగ్గాను జస్వంత్ చేతికి గురిచూసి కాల్చాడు.

సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ అది! గుండు సఁయ్ మంటూ పోయి జస్వంత్ చేతిని గాయపరిచింది. అతని చేతిలోని రివాల్వర్ ఎగిరి అవతలపడింది.

అయితే అప్పటికే అనుచరులు అయిదుగురు గన్స్‌తో గదిలోకి పరుగెత్తుకుని వచ్చారు.

కిరణ్ అప్పటికే జస్వంత్ దగ్గరికి చేరుకుని అతని కణతకు రివాల్వర్ గురిచేసి పట్టుకున్నాడు. ఎడమచేత్తో జస్వంత్‌ను ఒడిసిపట్టుకుని, "నీ అనుచరులు ఏమాత్రం తొందరపడినా నిన్ను చంపి మరీ చస్తాను, అది గుర్తుంచుకో!" అన్నాడు.

జస్వంత్ తనవాళ్ళకు సైగ చేశాడు. వాళ్ళు కోపంగా చూశారు జస్వంత్ వైపు "నువ్వు నీ ప్రాణంకోసం చూసుకుంటున్నావా? బాస్ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని మేము నీ మాట వినకూడదనుకుంటున్నాం!" అన్నాడు అందులో ఒక అనుచరుడు.

కిరణ్ ప్రమాదాన్ని గుర్తించి, అనుచరుల్ని గురిచూసి కాల్చాడు. ఇద్దరు నేలకూలారు. తక్కిన ముగ్గురు గన్స్ చేతుల్లో పొజిషన్ చూసుకుని కాల్చేలోపల కిరణ్ జస్వంత్‌ని అమాంతం పైకెత్తి వాళ్ళమీదకు విసిరేశాడు.

నలుగురు నేలబారుగా పడిపోయారు.

సరిగ్గా అదే సమయంలో బయటనుంచి బూట్ల చప్పుడు. శ్రీనివాస్, కైలాష్, పోలీసుల్తో పరుగున లోనికొచ్చారు.

అనుచరులకి కాల్చటానికి అవకాశ మివ్వకుండానే పోలీసులు వాళ్ళని కస్టడీలోకి తీసుకున్నారు.

కిరణ్ వంక ఆత్రంగా చూస్తున్నాడు శ్రీనివాస్.

"నీకేదో ప్రమాదం జరిగిందనటానికి సూచనగా అలారం వినిపించింది. వెంటనే నువ్వు ముందు మెసేజ్‌లో చెప్పిన వివరాలను గుర్తుపెట్టుకుని పరుగెత్తుకొచ్చాం!" అన్నాడు.

"గుడ్! చివరి ఛాన్సుగా వాచ్ బటన్ ఒత్తి మరీ దాన్ని జస్వంత్‌కిచ్చేశాను. మిస్టర్ జస్వంత్ నా వాచీ తీసుకుంటున్నాను!" అంటూ అతని పేంటు జేబునుంచి తన వాచీ స్వాధీనం చేసుకున్నాడు కిరణ్.

జస్వంత్ కొరకొరా చూస్తున్నాడు కిరణ్ వంక.

"నువ్వు నాతో యెందుకు సంభాషణ పెంచుతూ తాత్సారం చేశావో యిప్పుడర్థమయింది నాకు! నువ్వే డిటెక్టివ్ కిరణ్‌వని గుర్తించగలిగిన మేధావిని నీ చేతిలో ఓడిపోయాను!" అన్నాడు.

కిరణ్ నవ్వి, "నువ్వు తెలివైన వాడివని నేను ఒప్పుకున్నాను కదా! కాని తక్కిన వాళ్ళకన్న నువ్వు సెన్సిటివ్! యేదో మూల నీకింకా మానవత్వం మిగిలిపోయింది. అందుకే నన్ను మీ బాస్ చంపేయమని వెంటనే చెప్పినా కొంత టైమిచ్చావు!" అన్నాడు అతని భుజం తట్టి.

తర్వాత శ్రీనివాస్ వైపు తిరిగి, "వీళ్ళను కైలాష్‌కి అప్పచెప్పు. మనం చాలా అర్జంటుగా వెళ్ళాలి!" అంటూ

బయటికి పరుగులాంటి నడకతో చకచక అంగలువేశాడు కిరణ్.

శ్రీనివాస్ అనుసరించాడు.

జీప్ ఎక్కబోతూ, "మిష్టర్ కైలాష్! ఇక్కడి అణు వణువూ బాగా పరీక్షించి ఆయుధాలు స్వాధీనం చేసుకో! నా అనుమానమే నిజమయితే ఆ షెడ్‌లో వున్న తవుడు బస్తాల్లోకూడా ఆయుధాలు, నాటు బాంబులు, ట్రాన్స్ ఫార్మర్లవంటి ఎలక్ట్రానిక్ సాధనాలు దొరకొచ్చు. జస్వంత్ ఓ పట్టాన చెప్పడు. అయినా బి కాషస్!" అన్నాడు కిరణ్.

జీప్ నాచారం గోడ్డువెళ్ళ దూసుకుపోయింది.

# 9

ఎదురుగుండా నల్లటి బొగ్గులా వున్న ఆ కొండ ప్రాంతాన్ని బయట్నుంచి చూస్తూనే శిలలా నిలబడి పోయాడు కిరణ్. శ్రీనివాస్ అతనివంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఏమిటి బ్రదర్, యేమయింది?" అనడిగాడు.

"హో కాల్డ్ బాస్ తన సామ్రాజ్యాన్ని ధ్వంసం చేసేసి యిక్కడ్నుంచి పారిపోయాడు. నా తాత్సారంవల్ల మన ఇనస్పెక్టరిద్దరు ప్రాణాలు కోల్పోయారు!" అన్నాడు కిరణ్ విచారంగా.

శ్రీనివాస్ హేట్ తీసి చేత్తో పట్టుకున్నాడు.

"అయితే బాస్‌తోబాటు తక్కిన అనుచరులు కూడా తప్పించుకుపోయారంటావా?" అడిగాడు.

"ఏం చెప్పగలం? తన ఆధారాలేవీ దొరక్కుండా ఈ సామ్రాజ్యాన్ని మందుగుండుతో పేల్చేసి వుంటాడు. ఊరికి చాలా దూరంలో వుండటంవల్ల సెవెరికీ యీ

విషయం పట్టలేదు! బహుశా మనం జస్వంత్ ని వశం చేసు కోవటం బాస్ టి.వి. స్క్రీన్ మీద స్పష్టంగా కనిపించి వుంటుంది. తర్వాత మనం ఎలాగూ యిక్కడికే వస్తామని అతనికి తెలుసు! అందుకే ఈ సౌధరాన్ని నామరూపాలు లేకుండా చేసి వుంటాడు!" అన్నాడు కిరణ్.

రోడ్డున అప్పుడొకటి, అప్పుడొకటి వాహనాలు వస్తూ పోతున్నాయి. కాని యేం పట్టనట్టు మామూలుగా, చాలా సహజంగా యెవరి మటుకు వాళ్ళు వాహనాలు ఆపకుండానే పోతున్నారు.

కిరణ్ శ్రీనివాస్‌వంక చూసి, "బాంబులుపడి పెద్ద ప్రళయం వచ్చినా ఈ హైదరాబాదు వాసులు పక్కనేం జరుగుతున్నదో పట్టించుకోరనటానికి ఈ సౌధరం వద్ద జరిగిన ప్రేలుడే నిదర్శనం! యెక్కడికక్కడ రాళ్ళు కూడా లేచిపోయేటంత పెద్ద పేలుడు సంభవించి వుండాలి! అయినా ఎవరూ దీన్ని గుర్తించలేనంత బిజీ జీవితమైపోయింది!" అన్నాడు.

శ్రీనివాస్, "సిటీకి యిరవై కిలోమీటర్ల దూరంలో జరిగింది పేలుడు! ఎక్కువమందికి వినిపించే అవకాశం లేదులే!" అన్నాడు.

కిరణ్ మస్తిష్కంలో మెరుపులు మెరిశాయి!

"మిస్టర్ శ్రీనివాస్! ఆ బాస్ ఎవరో నాకు చూచాయగా తెలిసింది. మనకి వెంటనే మూడు నెలల క్రితం న్యూస్ పేపర్స్ కావాలి! అందులో ఈ బాస్ గురించిన వివరాలు దొరుకుతాయి!" అన్నాడు.

శ్రీనివాస్ ఆశ్చర్యంతో చూశాడు.

"కమాన్, ఆ పేపరు మా యింట్లో దొరుకుతుంది. సరాసరి మా ఇంటికి పోదాం!" అన్నాడు కిరణ్ ఒక్క

గొంతులో జీవ్‌లోకి ఉరుకుతూ.

జీపు 'శ్రీ సదనం' వైపు దూసుకుపోయింది.

అరగంట తర్వాత—

కిరణ్ న్యూస్ పేపరు ముందేసుకుని, "ఇతని పేరు జె. సంతానగోపాలం. ఎలక్ట్రానిక్ యింజనీర్. నంబరు ఆరవై రెండూ బై ముప్ఫైమూడు యింజనీర్స్ కాలనీ!" అని చదివాడు.

శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా చూశాడు. "ఇతన్ని కొత్త ప్రభుత్వం అవినీతి ఆరోపణలమీద ఉద్యోగం నించి తొలగించింది. ఇతని అడ్రసు మనకెందుకు?" అన్నాడు.

"ఎందుకా? ఇతనే యిన్ని ఘాతుకాలకు కారణమయిన ఆ 'బాస్'! ఇతని నిజస్వరూపం నేను కళ్లారా చూశాను. అతన్ని చూడగానే ఎక్కడో చూసినట్టు అనిపించింది. అప్పుడే అతని గురించిన జ్ఞాపకాలు నా మెదడులో రికలెక్ట్ అయాయి! వెంటనే యీ నెంబరు యింటికి సిబ్బందితో వెళ్ళి యీ దేశంనుంచి సంతానగోపాలం పారిపోయేలోపల స్వాధీనం చేసుకో!" అన్నాడు కిరణ్.

• • •

ఫోన్ గణగణ మోగటంతో రిసీవర్ ఎత్తి "హల్లో!" అన్నాడు కిరణ్ పక్కమీదనుంచే.

అవతలనుంచి శ్రీనివాస్ మాట్లాడుతున్నాడు.

"సుప్రభాతం బ్రదర్! సంతానగోపాలం, తన ఫాలోయిర్స్‌తోబాటు దొరికిపోయాడు. జరిగిన అన్ని దోపిడీలకు తనే కారకుడనని అంగీకరించాడు. లతీఫ్ అనబడే అతని ఆఖరి యేజెంటు కూడా సరెండరయి

పోయాడు. ఉద్యోగం పోయిన తర్వాత అక్రమ సంపాదనకు అలవాటైన సంతానగోపాలం, అప్పటికే చిన్న చిన్న దోపిడీలు చేస్తున్న జస్వంత్, లతీఫ్‌ని, మహేంద్రను, ప్రకాష్‌ని సమీకరించుకుని డెకాయిటిమ్స్‌కి ఆధిపత్యం వహించాడు.... థాంక్స్‌లాట్ బ్రదర్! నీ ప్రాణాలకు తెగించి, యీ విజయం సాధించినందుకు మన హోమ్ మినిష్టర్, కమిషనర్, డి.జి.పి. నిన్ను....” అంటూ శ్రీనివాస్ దండకం చదువుతుండగానే నవ్వుతూ ఫోన్ పెట్టేశాడు కిరణ్.

—: సమాప్తం :—

సీరియల్

# నల్ల గుండం

బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

కార్తీక్ కాసేపు సంకోచించి చివరికి అన్నాడు.

"మాకు సెలవిస్తే మేము వెళ్తాం సార్! మీకు మా కృతజ్ఞతలు!" అంటూ చేతులు జోడించాడు.

ఆ వ్యక్తి ఫెళ్ళున నవ్వి, "అదేమిటండీ, అంత తొందర? మాంత్రికుడు ఎటుకూడీ చచ్చాడంటున్నారు కదా! ఇక భయం దేనికి? మేము ముగ్గురం ఆయుధాలతో మీతోడున్నాం. జస్ట్, ఆ గుహ సంగతేమిటో చూసి వెళ్ళిపోదాం! కావాలంటే మీకు చివరిదాకా మేం తోడొచ్చి దిగబెడతాం, సరేనా?" అన్నాడు.

అతని మాటలకు నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు వాళ్ళకు. పిల్లికి చెలగాటం ఎలుక్కి ప్రాణసంకటం అంటే యేమిటో ప్రత్యక్షంగా తెలిసివచ్చింది వాళ్ళకు!

వాళ్ళ మనోభావాలతో తనకేం సంబంధంలేదన్నట్టు ఆ వ్యక్తి మళ్ళీ యిలా అన్నాడు. "అయామ్ వెరీ సారీ!

మీరందరు నన్ను మనస్ఫూర్తిగా క్షమించాలి! ఇంతదాకా మమ్మల్ని మేం పరిచయంచేసుకోలేదు చూశారా?

"నా పేరు జయవర్మ. అందరూ వర్మ అని పిలుస్తారు. ఇక్కడికి నలభై కిలోమీటర్ల దూరంలో మా ఊరు సిరిపురం వుంది. సిరిపురంలో చిన్న సైజు జమీందారుగా పిలవబడతాను నేను. వీళ్ళిద్దరు మా పనివాళ్ళు. లవుడు, కుశుడు వీళ్ళ పేర్లు. కవలపిల్లలెండి, అందుకని వాళ్ళమ్మ నాన్న ఆ పేర్లు పెట్టుకున్నారు.

"ఇక్కడికి దగ్గరగా ఓ చిట్టడవి వుంది. అక్కడ సరదాగా వేటాడుతుంటాను నేను. రాత్రి బాగా పొద్దు పోయేవరకు వేటాడాం. ఈ టైగర్ హిల్స్ గురించి వినటమేగాని ఎప్పుడూ చూళ్ళేదు! రాత్రికి ఎటూ సిరిపురం పోవటం లేదుకదా అని యీ కొండమీద విశ్రమిద్దాం అని వచ్చాం. కింద మా జీపు వదిలేసి వచ్చాం. ఇక్కడికొచ్చేసరికి మీరు ఆపదలో చిక్కుకున్నట్టు గ్రహించాం. అదీ విషయం!" అంటూ ముగించాడు— తేనెకళ్ళ వ్యక్తిగా పరిచయమైన జయవర్మ.

అందరూ చెవులప్పగించి అతను చెప్పిందంతా విన్నారు. ఇంత మంచి వ్యక్తిని అనవసరంగా అనుమానించి అపార్థం చేసుకున్నందుకు మనసులోనే నొచ్చుకున్నారు.

వర్మ అందరివంకా పరీక్షగా చూసి "ఏమిటి, ఎవరూ మాట్లాడటం లేదు? ఇంతసేపు చెప్పకుండా సస్పెన్స్‌లో వుంచానని నన్ను తిట్టుకోవటం లేదుకదా!?" అంటూ ఫెళ్ళున నవ్వేశాడు.

అందరి మనసులు తేలికపడ్డాయి.

ముందుగా కార్తీక్ తేరుకుని, "అబ్బెబ్బె, అదేమిటి

సార్ అలా అంటారు? అలా సస్పెన్స్‌లో వుంచి చెప్పటంవల్ల కలిగిన థ్రిల్ నించి యింకా తేరుకోలేక పోతున్నాను, అంతే!" అన్నాడు.

వర్మ దీప్తి వంక చూసి, "ఏమమ్మా, మాంత్రికుడి గుహాలోకి రావటానికి మీరు భయపడటం లేదు కదా!" అన్నాడు ఎంతో మర్యాదగా.

దీప్తి వెంటనే తల అడ్డంగా వూపి, "అబ్బె, భయం లేదండి మీరందరుండగా నాకేం భయం?" అన్నది.

"మీరందరు మనస్ఫూర్తిగా అంగీకరిస్తేనే ఆ గుహాలోకి వెళ్దాం. లేకుంటే బలవంతంలేదు. మిమ్మల్ని యీ క్షణం మీ బసకు చేర్చమన్నా సిద్ధం! సంతోషంగా మా లవుడు కుశుడు మీ తోడు వచ్చి దిగుస్తారు!" అన్నాడు వర్మ.

"ఫరవాలేదు, మీతో గుహాలోకి రావటానికి సిద్ధం!" అన్నారు అశ్విని, అభిలాష్, హిమవంత్ ముక్తకంఠంతో.

"థాంక్యూ, థాంక్యూ వెరీమచ్! మిమ్మల్ని కల్సుకో గలిగినందుకు మీ పరిచయం దొరికినందుకు చాలా సంతోషిస్తున్నాను" అన్నాడు వర్మ.

• • •

"ఏడీ మాంత్రికుడు కనిపించదేం?" అయిదో గుహాలోకి అడుగు పెడుతూనే అడిగాడు వర్మ.

"అప్పుడే రాదు సార్, మరి కాస్త దూరం నడిచాక మెట్లు కనిపిస్తాయి, కిందికి. నేలమాళిగ వుంటుంది. అక్కడే దేవతా విగ్రహం, మాంత్రికుడి అతని అనుచరుల శవాలున్నాయి!" అన్నాడు కార్తీక్.

అప్పుడప్పుడు టార్చ్ ఫోకస్ చేస్తేనేగాని లోపలి దృశ్యం కనపడని పరిస్థితి ఏర్పడింది.

"బయట ఎండకూడా వచ్చేవేళయింది. కాని లోపల చీకటిగానే వున్నది" అన్నాడు వర్మ.

మెట్లు దిగి నేలమాళిగలోనికి, సమతల ప్రదేశం చేరారందరు.

కాళికా విగ్రహం యథాస్థానంలోనే వున్నది.

కాని మాంత్రికుడుగాని, అతని అనుచరులుగాని, భరణి శవంగాని—యేవీ లేవక్కడ!

కార్తీక్‌తోపాటు అందరూ ఆశ్చర్యంగా అలాగే నిల్చుండిపోయారు!

"ఏమండీ, మాంత్రికుడు చచ్చిపడి వున్నాడన్నారే, యెక్కడా?" అనడిగాడు వర్మ.

అక్కడ నెత్తురుగాని మరేవిధమైన ఆనవాళ్ళుగాని లేవు! అసలు అంతక్రితం రోజు అక్కడ పెద్ద హడావిడి జరగటం, మారణ హోమాలు జరగటం చెపితే హాస్యాస్పదంగా వున్నట్టనిపిస్తుంది. అక్కడ అలాంటి సూచన లేమీ లేవు!

కార్తీక్‌తోబాటు అందరి మెదళ్ళను తొలచివేసే ప్రశ్న అదే!

"ఏదో చూసి యేదో అనుకుని భయపడి వుంటారు! ఈ రోజుల్లో మాంత్రికుడు, భూతప్రేతా లేమిటండీ, అంతా ఉత్తది!" అన్నాడు వర్మ.

"మంత్రాలు, తంత్రాలు ఉత్తదయితే కావచ్చుగాని, మేము, మాంత్రికుడు అతని యిద్దరు అనుచరులు చచ్చి పడుంటం కళ్ళారా చూశాం! పక్కనే మా డ్రయివరు భరణి కూడా శవరూపంలో పడున్నాడు. ఇంతలో చిత్రంగా అన్ని శవాలు మాయమైపోయాయి. మాకే నమ్మబుద్ధి కావటంలేదు!" అన్నాడు కార్తీక్!

అనుచరుల శవాలు కూడా చిత్రంగా మాయ మయ్యాయే! ఎలా జరిగింది?

"సరే, యింకా లోపలికి పోదాం, రండి!" అన్నాడు వర్మ. విగ్రహం పక్కనుంచి దారితీశాడు కార్తీక్. అతని వెనక వర్మ, లవుడు కుశుడు వాళ్ళిద్దరి వెనక అభిలాష్, దీప్తి, హిమవంత్, అశ్విని నడుస్తున్నారు.

"ఇదేమిటి, యిక్కడ పాములు చచ్చిపడున్నాయి. ఎవరో రివాల్వర్‌తో కాల్చినట్టు కనిపిస్తోంది" అన్నాడు వర్మ మోకాళ్ళమీద వంగి పాములవంక పరిశీలనగా చూస్తూ.

కార్తీక్ గాని, యింకెవరుగాని మాట్లాడలేదు.

దూరంగా పచ్చటి వెలుగు పడుతోంది. భూగృహం లోపలి భాగంలోనికి వెలుగు ఎలా వస్తోందోనని ఆశ్చర్యంగా చూస్తున్నాడు వర్మ.

ఇంతక్రితం చూసిన వెలుగే అది! ఆ వెలుగును సమీపిస్తూంటేనే యేదో వింత శబ్దాలు గాల్లో వినిపించాయి యిదివరకు.

అందరు చెవులు రిక్కించి నడుస్తున్నారు.

గాల్లో ఎలాంటి శబ్దమూ లేదు!

వర్మ నవ్వుతూ హిమవంత్ వంక చూశాడు. 'వర్మ అలా చూసినపుడల్లా అతనికి ఉక్రోషం వచ్చేస్తోంది.

"ఆగండి!" అన్నాడు వర్మ చటుక్కున ఆగిపోయి.

లవుడు, కుశుడు తుపాకులు సిద్ధంగా పట్టుకున్నారు. వర్మ చేతిలో రివాల్వర్ ఏ క్షణంలోనైనా పేలటానికి సిద్ధంగా వున్నట్టుంది!

కార్తీక్ బృందం ఊపిరిబిగబట్టి చూస్తున్నారు.

ఎక్కడో సన్నగా అలికిడి వినపిస్తోంది. యెవరో

తిరుగుతున్న చప్పుడు. అడుగుల సవ్వడి బరువుగా నేలని తాకుతున్న సవ్వడి!

హిమవంత్ కళ్ళెగరేశాడు. వర్మ అతన్ని చూసి అంత సీరియస్ పరిస్థితిలోను నవ్వుతున్నాడు సన్నగా.

వర్మ లవుడు కుశుడువైపు చూసి జాగ్రత్తగా వుండమన్నట్టు సైగచేశాడు!

ఎలాంటి సంఘటనా ఎదురుకాలేదు!

వర్మ ముందుకి కదిలాడు. అతనితోబాటు లవుడు కుశుడు కదిలారు. వారివెంట కార్తీక్ బృందం కదిలారు.

అక్కడ జారుడు అంతగాలేదు. ఇరుకుదారి విశాలంగా తయారయింది. పైన బాగా ఎత్తున బిలంతొలిచిన పైకప్పుంది. అంత విశాలమైన భూగృహాలుంటాయని వాళ్ళెన్నడూ ఊహించి వుండలేదు.

దూరంగా పచ్చటి వెలుగు అలా ప్రసరిస్తూనే వుంది. వాళ్ళెంత దూరం నడిచినా ఆ వెలుగు కూడా అంత దూరం జరిగిపోతున్నట్టనిపిస్తోంది!

దీప్తి యింతలో కెవ్వున అరిచింది!

అందరూ తృళ్ళిపడి చూశారు.

ఆమె సన్నగా వణికిపోతోంది.

చేతో ఒకప్రక్క చూపించింది. అక్కడ ముగ్గురు వ్యక్తులు కళ్ళు తేలవేసి నాలుక బయటకు పెట్టి వికృతంగా చూస్తున్నట్టు కదలక మెదలక నించున్నారు.

వర్మ రివాల్వర్ గర్జించింది. లవుడు కుశుడు కూడా తుపాకులతో కాల్చారు. కాని ఆ వ్యక్తులు కిక్కురుమనలేదు. నేల వాలలేదు!

పరీక్షగా ఆ వ్యక్తుల్ని చూసిన కార్తీక్ బృందం అదిరిపడ్డారు.

"అందులో ఓ మనిషి మన భరణిలా వున్నాడు!" అని అరిచాడు కాత్రీక్.

"అవునవును, భరణే!" అన్నా రందరు.

వర్మ ఆశ్చర్యంగా చూశాడు.

"భరణెవరు?" అన్నాడు.

"మా ద్రయివరు. మాంత్రికుడి అనుచరుల చేతిలో చనిపోయాడు. ఇక్కడ ఎలా నిల్చుని వున్నాడో అర్థం కాలేదు!" అన్నారు అందరు.

వర్మ ఆ ముగ్గురు వ్యక్తులవైపు నడిచాడు. లవుడు, కుశుడు అతన్ని వెంటనంటి వున్నారు.

కాత్రీక్ బృందం వాళ్ళననుసరించారు.

ఆ ముగ్గురిలో ఒకడు భరణి, ఆ తక్కిన యిద్దరు మాంత్రికుడితోబాటు చచ్చినవాడి అనుచరులు!

వాళ్ళని గుర్తుపట్టి అందరు విస్మయంగా నిల్చుండిపోయారు.

చచ్చిన శవాలు ఎలా నించున్నాయి? అదీగాక గుహలో నేలమాళిగ మెట్లదగ్గరున్న శవాలు యిక్కడికెలా వచ్చాయి? మాంత్రికుడి శవం ఏమయింది?

అన్నీ ప్రశ్నలే! జవాబురాని ప్రశ్నలు!

వర్మ ఆ ముగ్గుర్ని తోసి చూశాడు. వాళ్ళు కిందపడలేదు. కర్రలా అలాగే బిగుసుకుపోయి నించున్నారు—చేతికి ఐస్‌ముక్కల్లా తగిలారు.

వర్మ తల విదిలించాడు.

ఒకరి తర్వాత ఒకరు అందరూ ఆ శవాల్ని చుట్టుకుని తోసి చూశారు. ఒక్క అంగుళం కూడా ఆ శవాలు పక్కకి జరగలేదు!

ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు!

ఎక్కడినుంచో వికృతమైన నవ్వు వినిపించింది.

అందరు అదిరిపడి చూశారు. ఎవరూ కనిపించలేదు. కాని గాలిలో అంతవరకు లేని అలజడి, యేవో వింత శబ్దాలు!

హిమవంత్ అర్థవంతంగా వర్మకేసి చూశాడు.

వర్మ సాలోచనగా తలూపాడు.

"ఖచ్చితంగా అవి ప్రేతాత్మల చప్పుళ్ళే! క్షుద్ర దేవతల నారాధించేవాళ్ళు ప్రేతాత్మలతో యిలాంటి ప్రయోగాలు చేస్తారని మీరు వినలేదా?" అన్నాడు హిమవంత్, వర్మతో.

వర్మ తల విదిలించాడు. ఓటమి నొప్పుకోవటం ఇష్టం లేనట్టు గంభీరంగా తయారయింది అతని ముఖం!

కార్తీక్ బృందానికి చెమట్లు పోస్తున్నాయి. దీప్తి యింకా షాక్ నుంచి తేరుకున్నట్టులేదు. వర్మ మాట విని తెలిసి తెలిసి ఈ మంత్రాల గుహలోకి మళ్ళీ ఎందుకు కాలు పెట్టామా అని బాధపడసాగారు.

వర్మ అందరివంకా పరిశీలనగా చూసి, "ఇది ఏదో చోటా మంత్రగాడి ప్రయోగం! మనం యిలాంటివాటిని లెక్కచేయనక్కర్లేదు — శవాల్ని నించో బెట్టడంలాంటి క్షుద్ర విద్యలు తెలిసినవాళ్ళు చాలామందున్నారు. వాళ్ళు బతికున్న మనుషుల్ని ఏమీ చెయ్యలేరు. అలాంటి వాళ్ళు మన ఎదరపడటానికూడా భయపడ్తుంటారు...." అని అతనింకా ఏదో అంటుండగానే అతని చేతిలోని రివాల్వర్ అకస్మాత్తుగా గాల్లో ఎగిరింది.

వర్మ నిర్ఘాంతపోయి చూశాడు.

అప్పుడు కుకుడు గాల్లో తుపాకీలు పేల్చారు.

వికృతమైన నవ్వు మరోసారి వాళ్ళ కర్ణపుటాల్ని

చీల్చుతూ వినిపించింది.

అందరు విస్మయంగా చూస్తూండగానే వర్మ రివాల్వర్ టప్ మని నేలమీద పడింది.

"దయ్యాలు, మనకు కనిపించకుండా ఇక్కడ సంచరిస్తూండవచ్చు! వాటతో పేచీ పెట్టుకోవటం మంచిది కాదు. వర్మగారూ, వెనక్కి వెళ్ళిపోదామా?" అన్నాడు హిమవంత్.

వర్మ కోపంగా, ఉక్రోషంగా చూశాడతని వంక.

"డోంట్ బి ఫూలిష్! మరీ కాకమ్మ కథలు నమ్మటానికి మనం అజ్ఞానులం కాదు! యేదో చీప్ మంత్రగాడు కొన్ని క్షుద్ర విద్యలు నేర్చుకుని వాటిని మనమీద ప్రయోగిస్తున్నాడంతే! అలాంటి వాడికి జడిసి పారిపోతే అంతకన్న పిరికితనం, చిన్నతనం మరొకటి వుండదు! మనం ఎనిమిదిమంది వున్నాం. ఆమాత్రం వాళ్ళనెదిరించి పోరాడలేమా?" వర్మ మాటలకు అందరు మౌనం వహించారు.

ఇంతలో వాళ్ళపక్కగా ఎవరో నడుస్తూన్న సవ్వడి, గెంతుతున్న చప్పుళ్ళు వినిపించాయి. అందరు తమచుట్టు పరీక్షగా చూసుకున్నారు. కళ్ళకు ఎవరూ కనిపించటం లేదు! కాని ఎవరో తమ పక్కన అనుకుని తిరుగుతున్నట్టు చెవుల్లో ఏదో గుసగుస చెపుతున్న అనుభూతి!

అందరికీ గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. గాలి ఆడనట్టు, ఊపిరి తీసుకోవటం కష్టమైనట్టు, కదలలేనట్టు, మాట నోటినుండి రానట్టు రకరకాల అనుభూతులు వాళ్ళని కాసేపు తికమక పెట్టాయి!

ఎవరికి వారే ఆ విషయాలు తమ మనసులోనే దాచేసుకున్నారు. పైకి చెపితే వర్మ ఈసారి కొట్టేలాగా

వున్నాడు! చాలా కోపంగా కనిపిస్తున్నాడు.

"పదండి, ముందుకి నడవండి! ఈ ప్రేతాత్మల సంగ తేమిటో యిప్పుడే తేల్చేద్దాం!" అన్నాడు వర్మ అతను కిందపడున్న తన రివాల్వర్ అందుకుని చేతపట్టుకున్నాడు.

రివాల్వర్ మీద వర్మ చేతులు గట్టిగా బిగుసుకుపోవటం చూసి వాళ్ళకు నవ్వొచ్చింది! మరోసారి రివాల్వర్ గాల్లోకి ఎగిరిపోతోందేమోనన్నట్టు బిగించి పట్టుకున్నాడు వర్మ! అంటే, అతను, మేకపోతు గాంభీర్యం ప్రదర్శి స్తున్నాడా? యేమో!?"

దీప్తి శవాలవంక చూడకుండా ముఖం పక్కకు తిప్పి వాళ్ళతో ముందుకు అడుగులు వేసింది.

* * *

పచ్చటి వెల్తురు దగ్గరయినట్టే అయి దూరంగానే వుండిపోయింది!

అందరు పక్కలకు చూసుకుంటూ నడుస్తున్నారు. పులిబోనులో తల పెడుతున్న ఫీలింగ్ అందరిలోనూ.

కార్తీక్ వాచీ చూసుకున్నాడు. పదిగంటలు చూపి స్తోంది! వర్మతో పెట్టుకోకుండా వుంటే ఆ పాటికి వేన్‌లో చింతపల్లె క్షేమంగా చేరుకుని వుండేవాళ్ళు! కాని వర్మ ఆపదల వలయంలోకి తమని తనతో బాటు తీసుకుపోతున్నాడు!

ఎవరూ మాట్లాడటంలేదు. మౌనంగా చూస్తున్నారు.

వర్మ ఆగిపోయాడు! అతని వెనక అందరూ అక స్మాత్తుగా ఆగిపోయారు. అందరు అతనికేదైనా దృశ్యం కనిపించిందేమోనని అటు చూశారు. ఎదురుగా విశాల మైన దారి తప్ప మరేం కనపడలేదు.

కార్తీక్ ప్రశ్నార్థకంగా చూశాడు వర్మవంక. వర్మ

తదేక దీక్షతో దారివైపే చూస్తున్నాడు. అతని చూపులు నిశ్చలంగా వున్నాయి! చేతిలో రివాల్వర్ గురిపెట్టి వుంది! అతనిలో ఎలాంటి కదలికా లేదు.

అందరికీ ఆశ్చర్యంగా వుంది.

కార్తీక్ చేత్తో వర్మను తట్టాడు—వర్మలో చలనం లేదు.

లవుడు, కుశుడు మొదటిసారిగా పెదవులు విప్పారు. "సార్, సార్!" అంటూ వర్మను తట్టి పిలిచారు.

వర్మ పలకలేదు! ఎవరికీ అతని పరిస్థితి అర్థంకాలేదు.

సరిగ్గా అదే సమయంలో అక్కడ పదిమంది వ్యక్తులు ఎక్కడినుంచో బిలబిలమంటూ వచ్చి వాళ్ళను చుట్టు ముట్టేశారు. లవుడు, కుశుడు తుపాకులు కాల్చబోయారు కాని వాళ్ళ చేతులు అందుకు ఏమాత్రం సహకరించలేదు.

మాంత్రికుడి వచ్చిన అనుచరుల్లాగే ఆ పదిమందీ ఒంటికి విబూది పూసుకుని వున్నారు. నుదుట సింధూర బొట్లు వున్నాయి. మొలచుట్టూ జింక చర్మాలు కట్టు కున్నారు. అంతకుమించి వాళ్ళ శరీరంమీద మరెలాంటి ఆచ్ఛాదనా లేదు!

వాళ్ళ చేతుల్లో బలమైన తాళ్ళున్నాయి.

వర్మలో చలనంలేదు. అలాగే నించుని వుండి పోయాడు. అదే స్థితిలో తెలీకుండా అలాగే వుండి పోయాడు.

పదిమందీ ముందుకొచ్చి నిల్చున్నారు. వాళ్ళముఖాల్లో ఎలాంటి భావమూ ద్యోతకం కావటంలేదు. కేవలం కీ యిస్తే పనిచేసే మరబొమ్మల్లా వున్నారు.

కార్తీక్ బృందం అయిదుగుర్నీ, వర్మను, లవుణ్ని కుశుణ్ని తాళ్ళతో బంధించేశారు.

చిత్రంగా కార్తీక్ వాళ్ళు ఆ చర్యను ఎదుర్కోవాలనుకున్నా వాళ్ళ అవయవాలు అందుకు సహకరించలేదు. తమ పరిస్థితికి చింతపడుతూ వాళ్ళు నిశ్చలంగా వుండిపోయారు.

* * *

వాళ్ళు పదిమందీ కార్తీక్ బృందాన్ని గొడ్లని లాక్కుపోయినట్టు ఓ రాతి గది దగ్గరకు లాక్కుపోయారు. బిలానికి మూత వేసిన రాతి పలకవంటి దానితో ఆ గది కట్టారు. అయితే యివి గుండ్రటి రాళ్ళుకాదు, చతురస్రాకారంవే! వాటికి ఒకదానితో మరొకటి తాకించి గోడలుగా లేపారు.

అందర్నీ లాక్కుపోయి ఆ గదిలో పడేశారు. అదో బందిఖానాలాగా పోలీస్ స్టేషన్లో తాత్కాలికంగా నేరస్తుల్ని రిమాండులో పెట్టే సెల్లాగా వుందది. అందర్నీ అందులో పెట్టి, వాళ్ళు మౌనంగా వెళ్ళిపోయారు.

అప్పుడే మత్తు విడినట్టు వర్మ చటుక్కున కదిలి అందరివంకా చూశాడు.

"ఏమటది? యెక్కడున్నాం?" అన్నాడు హడావుడిగా.

లవుడు, కుశుడు మౌనంగా తమ యజమాని వంక చూసి కళ్ళతోటే మాట్లాడుతున్నారు.

కార్తీక్కి, అతని మిత్రులకి వర్మమీద చాలా కోపంగా వుంది. అయినా దాన్ని ప్రకటితంకాకుండా జాగ్రత్తపడ్డారు.

"మిస్టర్ కార్తీక్! ఏమిటిది? ఇలా బంధించారెవరు మనల్ని?" అన్నాడు వర్మ.

కార్తీక్ జరిగింది క్లుప్తంగా రెండు మాటల్లో చెప్పాడు.

వర్మ లవుడ్ని కుశుడ్ని కోపంగా తినేసేలా చూసి, "మీరిద్దరు నిద్రపోతున్నారా? మీ చేతుల్లో చేవ చచ్చిందా? కాల్చిపారెయ్యలేకపోయారా?" అన్నాడు.

"ఏం చెయ్యమంటారు సార్, మీకు పట్టిన గతే మాకూ పట్టింది. తుపాకులు కదల్చలేకపోయాం! మీరయితే మాటా పలుకు లేకుండా అలాగే నిల్చుండిపోతిరి!" అన్నాడు లవుడు.

వర్మ తల విదిలించాడు.

"నాకిప్పటికీ ఏమీ అర్థంకావటంలేదు. ఒక్కసారిగా నా నవనాడులు స్తంభించిపోయినట్టయింది. రివాల్వర్ వున్న చెయ్యి కదల్లేదు. మీ అందరు పిలవటం, నన్ను తాకటం, తట్టడం అన్నీ స్పృహలోకి వున్నాయి. కాని మీకు సమాధానం చెప్పటానికి నోరు రాలేదు. కనీసం ఆ వెధవలు నన్ను కట్టిపడేస్తూంటే కూడా ఎదిరించటానికి అవయవాలు స్వాధీనంలో లేవు!" వర్మ తన అనుభవాన్ని చెప్పుకొచ్చాడు.

"అంటే ఏదో ప్రేతాత్మ మిమ్మల్ని ఆవరించి వుంటుందాక్షణంలో! మీకు తెలియదుగాని వర్మగారూ, యీ ప్రేతాత్మలు చాలా గమ్మత్తులు చేస్తుంటాయండి. యేడిపించి తమాషా చూస్తుంటాయి. మీరు కొరివి దయ్యాలు అనే పేరు విన్నారా? ఇదిగో ఈ ప్రేతాత్మలు అదే 'పైపన్నమాట'! నేను ప్రేతాత్మలు గురించి-అదే స్పిరిట్సు అంటారింగ్లీషులో, చాలా డీటెయిలుగా చదివానో యింగ్లీషు పుస్తకంలో. ప్రస్తుతం ప్రేతాత్మలతో మనం సరాసరి మాట్లాడటానిక్కూడా పరిశోధనలు జరుగు

తున్నాయి. ప్రేతాత్మల మాటలు రికార్డు చేసుకోవచ్చునట టేపుమీద. ఇంకా యిలాంటి విషయాలెన్నో రాయ బడున్నాయి ఆ పుస్తకంలో. ఈసారి మీకిస్తానుండండా పుస్తకం!" హిమవంత్ కళ్ళింత చేసుకుని చెప్తుంటే వర్మ చిరాగ్గా చూశాడు.

"నిజమే వర్మగారూ! స్పిరిట్సున్నాయి. ఇది అలాంటి స్పిరిట్సు పనే అయుండాలి! అయితే మనల్ని బంధించినది మాత్రం మాంత్రికుడి అనుచరులు. మనుషులే! యిలాంటి వాళ్ళని దారిలో—చచ్చి నించుని వున్న శవాల్ని మీరు చూశారుగా!" అన్నాడు కార్తీక్.

వర్మ సాలోచనగా చూశా డతనివంక.

"ప్రేతాత్మలకు మనతో ఏం పని?" అన్నాడు.

"ఈ భూగృహం బహుశా వాటి నివాస స్థానమై వుంటుంది. అందులోకి మనం ప్రవేశించటం వాటికి సుతారాము యిష్టంలేదు. అందుకే మనల్ని భయపెట్టి వెనక్కు పంపేయాలని చూసివుంటాయి. మనం వినలేదు!" అన్నాడు కార్తీక్.

"అంటే యిదివరకు ఊరి చివరి మర్రిచెట్టుమీద పిశాచాలు కాపురముండేవని చెప్పుకునేవారు చూడండి, అలా అన్నమాట!" హిమవంత్ వర్మని యెడ్యుకేట్ చెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడు.

వర్మ అతనివంక కోపంగా చూసి, "మిష్టర్ హిమవంత్, నన్ను మరీ ఏమీ తెలియని అమాయకుడికింద జమకట్టొద్దు. నాకూ తెలుసు" అన్నాడు.

"అబ్బెబ్బె, నా ఉద్దేశం అదికాదు—మీకు స్పిరిట్సు పట్ల నమ్మకం కలిగిస్తున్నానంతే!"

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషా

## ప్రహరీ గోడ బిల్?

ఆ రోజు పాస్ కావల్సిన బిల్స్ ఫైలును ఆఫీసర్ టేబుల్‌మీద పెట్టమని ప్యూనుకు అందించాడు ఫైలును సత్యం.

సత్యం అందించిన ఫైలును తీసుకొని ఆఫీసర్ గదిలోకి వెళ్ళి టేబుల్‌మీద పెట్టి వచ్చాడు ప్యూను.

ప్యూను పెట్టిన ఫైలును తెరచి ఒక్కో బిల్‌ను పరీక్షిస్తూ సంతకం పెట్టసాగాడు.

'ఇందిరా పార్కుకు ఆరువందల గజాల ప్రహరీ గోడను కట్టిన బిల్'ను చూపి నివ్వెరపోయాడు.

ఆఫీసర్‌గారి ఆశ్చర్యానికి అంతులేదు.

చదివిన దాన్ని మళ్ళీ చదివాడు.

ఏమి అర్థంకావటంలేదు. తాను ప్రతిరోజు ఆఫీసుకు వచ్చే దారిలోనే వుంది ఇందిరా పార్కు. 'అక్కడ' ఆరు వందల గజాల ప్రహరీ గోడ కట్టబడి బిల్ కూడ తయారైంది. కానీ ఆ విషయం తనకు ఇంతవరకు తెలియదు. తనకు జ్ఞాపకం ఉన్నంతవరకు అక్కడ గోడ కట్టడానికి ఉపయోగించే ఇసుక, ఇటుక, సిమెంటు లాంటివి ఎక్కడా కనబడలేదు."

దీర్ఘంగా ఆలోచిస్తూ టేబుల్‌మీద వున్న బెల్ నొక్కాడు. ప్యూను లోపలికి రాగానే కారును రెడీ చేయమని చెప్పాడు. ప్యూను వెళ్ళిన వెంటనే టేబుల్ మీద

వున్న బిల్‌నుజేబులో పెట్టుకొని బయటకు నడిచాడు.

కారు ఎక్కి "ఇందిరా పార్కు"కు పోనిమ్మన్నాడు.

పదిహేను నిమిషాల్లో ఇందిరా పార్కును సమీపించింది కారు. అసలు అక్కడ గోడ కడ్తునట్లు ఎటువంటి సూచనలు గావి ఏమీ లేదు. విషయం ఏమిటో అర్థమయింది.

కారు తిరిగి ఆఫీసు చేరుకుంది.

తన గదిలోకి వెళ్ళుతూ ద్వారం వద్ద వున్న ప్యూనుకు సత్యంను లోపలికి రమ్మని చెప్పాడు.

కాస్సేపట్లోనే సత్యం ఆఫీసర్ ముందు వున్నాడు.

అతన్ని చూస్తూ "మిస్టర్ సత్యం! ఇందిరా పార్కుకు కట్టిన ఆరువందల గజాల ప్రహరీ గోడ యొక్క బిల్ తయారుచేసి పంపావు. కానీ ఇప్పుడది అవసరంలేదు. వెంటనే టెండర్ కాల్‌చేసి కట్టిన ఆ గోడను పడగొట్టించు. వెరీ అర్జంట్" అంటూ ఆజ్ఞను జారీచేశాడు.

ఒక్క క్షణం ఆఫీసర్‌గారు చెప్పింది ఏమిటో అర్థం కాలేదు సత్యానికి.

ఏదో తోచినట్లు చిన్నగా నవ్వుతూ "అలాగే సార్" అని బయటకు వచ్చాడు సత్యం.

సత్యం బయటకు వెళ్ళగానే ఇందిరా పార్కు బిల్‌ను తీసి సంతకం పెట్టాడు.

ఇదేమిటూ అని ఆశ్చర్యపోతున్నారు కదూ!

అసలు విషయం ఏమిటంటే, ఆ బిల్‌లో తన వంతుకు రావాల్సిన పర్సెంట్ రాలేదని ఆఫీసర్‌గారి భయం.

ఆ సాయంత్రమే అతని మామూలు అతని ఇంటికి చేరింది. అలా చేస్తుంది అన్న గట్టి నమ్మకంతోనే ఆ బిల్‌మీద సంతకం చేశారు ఆఫీసర్‌గారు.

—పేరు వ్రాయని పాఠకుడు.

